35762

# FIBROFLEX

## QUALITY AND COMFORT MATCHED TOGETHER




## FIBROFLEX

### The Rubberised Coir Mattresses

**Best blend of nature and science**

1 ISI Mark, the testimony of Superior quality mattresses
2 Centre criss cross fleece arrangements for firm support to your back as specially recommended by Medical practitioners
3 Special side walling as reinforcement to edges and for better durability and finish
4 Quilted mattresses with matching cloth at the bottom in attractive colour designs.





IS : 8391







Manufacturers
**BHARAT MOTORS**
Branch Office
26-3-64 Nageshwara Rao Panthulu Rd ,
Gandhi Nagar, Vijayawada-3

Distributor for Andhra Pradesh
**The Century Trading Co.**
26-22-25, Mudunurivari St ,
Gandhi Nagar, Vijayawada-3 Ph 74261






EXELADS BM 349 89

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

ఒరులేయవి యొనరించిన నరవర యప్రియము తన మనంబున కగునో
యొరులకు నవి సేయకునికి పరాయణము పరమ ధర్మపథములకెల్లన్

# మ.క. తె.ద్ర. గంగ!

"తెలుగుగంగ" చాలాకాలంగా వేరుకుపోయి గడ్డకట్టుకుపోయింది! - కాని హైద్రాబాద్ నగరంలో 'విశ్వామిత్ర' షూటింగ్ చూడవచ్చిన - మాజీ సినీజీవి అయిన తమిళనాడు ముఖ్యమంత్రి దీనికి తమ రాష్ట్ర వాటాలో భాగంగా 30 కోట్ల రూపాయలు యిస్తామని ప్రకటించారు - వెళ్లికివచ్చి చదివింపులులేకుండా ఎట్లాపోతాం అన్న తీరులో - "1993 నాటికి మంచినీళ్లు మనకే వస్తాయిగా" అన్న ధీమాతో, కరుణానిధి - యీ చిన్న 'నిధి'ని వదులుకోడంతో తెలుగుగంగకి మళ్లీ కదలిక రాగల సూచనలు కనిపించాయి. ఎన్నికలొస్తున్నాయి అన్న తొందర శ్రీ ఎన్.టి. రామారావులో బాగా కనబడుతున్నది. అందులో భాగంగా 'విశ్వామిత్ర' ఒకటి - తెలుగుగంగకి మోక్షం కల్పించుకొని పేరుప్రతిష్టలు యినుమడింపజేసుకోడం రెండు.

తెలుగు"గంగ" అంటే "కృష్ణమ్మ తల్లి"యే. కృష్ణానది మన రాష్ట్రంలో 620 కిలోమీటర్ల దూరం - మన తెలుగు భూములను బంగారుభూములుగా చేస్తూ పరవళ్ళు ఉరవళ్లుగా పోయి - మన రాష్ట్రంలోనే సాగరసంగమం చెందుతున్నది! దీనిలో వృథాగా పోతున్న "నీటి"కి సంబంధించిందే తెలుగుగంగ ప్రాజెక్టు. పాత లెక్కలప్రకారం 858 కోట్ల రూపాయల ఖర్చు అవవల్సిన యీ పథకం 1992 - 93 నాటికి పూర్తి అయితే, గియితే వెయ్యిమీద ఓ వంద కోట్ల రూపాయలుపైగానే వ్యయంతో బయటపడుతుంది!

దీనివల్ల - మద్రాసుకు "గొంతుతడి" ఆరుతుంది. కర్నూలు, కడప, చిత్తూరు, నెల్లూరుజిల్లాలకి "తడి" బాగా తగిలి - పంటలు పండే అవకాశం వస్తుంది! ఈ ప్రాజెక్టులో "తెలుగువాడు" పొందేదేగాని పోగొట్టుకునేదేమీ లేదు! కాని "కృష్ణమ్మ" దారి మళ్ళింపు పథకంలో - అడవులు పోతాయని ఒకసారీ, వాతావరణ తులనాత్మకత దెబ్బతింటుందని మరొకసారి అడ్డుపుల్లలు పడుతూనే వున్నాయి. దానికితోడు ఎం.జీ.యార్. గవర్నమెంటు నిమ్మకునీరెత్తినట్లు వూరుకోవడంతో యిది మూలపడిపోయింది. అయితే రేపటి ఎన్నికలవ్యూహంలో కాంగ్రెస్‌కి 'ప్రతి'గా చేతులు కలుపనున్న కరుణానిధి - ఎన్.టి.ఆర్. ల ఒప్పందంలాంటి సంగతి వొకటి మొన్న హైద్రాబాద్‌లో 'విశ్వామిత్ర' సెట్టింగుల ప్రక్కన జరిగింది! రు. 30 కోట్లు యిప్పుడూ మరో 30 కోట్లు ఆనక యిస్తాం అన్న కరుణానిధిగారు - తెలుగుగంగలో తెలుగు శబ్దం తనకి "ముడియాదు" అన్నాడు - దీన్ని "ద్రవిడ గంగ" అనమన్నాడాయన! మహారాష్ట్ర - కర్నాటక - ఆంధ్రా యిప్పుడు తమిళనాడు వున్నాయి. కనుక దీన్ని తమిళగంగ అనమంటున్నాడాయన! "మ.క.తె.ద్ర." గంగ, అనగా మహారాష్ట్ర కర్నాటక (ఆంధ్ర) తెలుగు తమిళ గంగ అని అంటే ఏ గొడవా వుండదు! ఎందుకంటే కర్నాటక జనతాపార్టీ నాయకుడు మాజీ పబ్లిక్‌వర్క్సు మంత్రివర్యుడు అయిన శ్రీ దేవ్‌గౌడ యీ "గంగ" నడకకి అడ్డంపడతానని అప్పుడే "వీరంగం" వేస్తున్నాడు

ఇది తమాషా అయిన "మడతపేచీ" - దీన్ని శ్రీ రాజీవ్‌గాంధీ "రామారావ్ జీ"మీద చోదితాస్త్రం "అగ్ని"లాంటి ఆయుధంగా వాడుకోవాలన్న ప్రయత్నం "లౌడ్" (స్పీకర్‌లలో)గానే మొదలుపెట్టారు! కర్నాటకకి గల హక్కులను ఉల్లంఘించకుండా తెలుగుగంగ ప్రాజెక్టు కొనసాగాలని - కాంగ్రెసుపార్టీ అధ్యక్షుడు దేశ ప్రధానమంత్రి శ్రీ రాజీవ్‌గాంధీ బహిరంగసభలో ప్రకటించడంతో - నదీజలాల వినియోగంమీద "బచావత్ ట్రిబ్యునల్ అవార్డు"ను యిప్పుడు తిరగేసి చూడవలసిన అవసరం వచ్చింది. "కర్నాటక జలాలు" ఎగువనున్నాయి - 1440 కిలోమీటర్ల పొడవైన కృష్ణానది- మహారాష్ట్ర నుంచి కర్నాటక మీదుగా మన రాష్ట్రానికి వచ్చేసరికి, 820 కిలోమీటర్ల పరీవాహక ప్రాంతాన్ని పుష్కలంగా 'తడిపి-' మరీ వస్తున్నది. ఆ మిగులు జలాలను రెండు వేల సంవత్సరం దాకా సముద్రం పాలు అయిపోకుండా వాడుకొనే 'హక్కు' లేదా 'అవకాశం' ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి వున్నది- దీన్ని ఎగువ రాష్ట్రం వాటాని అపహరించే యత్నంగా చిత్రీకరించే ప్రయత్నం జరుగుతున్నప్పుడు- దాన్ని ఖండించే ప్రయత్నం కేవలం వాగాడంబరంతో- లౌడ్ స్పీకర్ల ద్వారా కాక లిఖిత పూర్వకంగా జరగాలి. మహారాష్ట్ర, కర్నాటక, ఆంధ్రప్రదేశ్- తమిళనాడు కూడా తలలు ఏకం చేసి "బచావత్ ట్రిబ్యునల్" అవార్డుకు ఉల్లంఘన లేని రీతి వివాదాన్ని పరిష్కరించుకోవాలి. "ఎన్నికల స్టంట్స్"లో భాగంగా ఈ ప్రాజెక్టు నలిగిపోతే నష్టపోయేది కర్నూలు కడప- చిత్తూరు జిల్లాలే కనుక యింత దూరం ఆలోచించవలసి వుంటుంది! రెండువేల సంవత్సరానంతరం కృష్ణానదీ జలాల పాడకం మీద తిరిగి తల యెత్తే సమస్యని కూడా- కనీసం ఒక 'చిత్తు' ప్రతిగానైనా రూపొందించి- ఎవరెవరికి ఎంత? అన్నది అంచనా వేసుకోడం కూడా మంచిదే- అట్లా చేయాలి అనుకున్నా- తెలుగుగంగ ప్రాజెక్టును యిప్పుడు నిలిపివేయడం ధర్మం కాదు- ఇక్క 'ప్రజాహితమైన' కార్యానికి ఆటంకం కలగని రీతిలో కేంద్ర ప్రభుత్వం కూడా తన 'పాత్ర'ని నిర్వహించాలి! శ్రీమతి యిందిరా గాంధీ ఆశీర్వదించిన ఈ పథకాన్ని తనయుడు రాజీవ్ గాంధీగారు- కోపతాపాలతో చీల్చి చెండాడాలనుకోడం విజ్ఞత కాదు- ఇక పోతే- 'దప్పిక' తీరడానికి మంచినీరు 'మూల్యంగా'నే అయినా అందుకుంటున్న మద్రాసు రాష్ట్రానికి - యీ పథకాన్ని ద్రవిడగంగ అనమని కోరే హక్కుకూడా లేదు- పేరులోన ఏమి పెన్నిధిగలదు? అన్న మాట కరుణానిధిగారికి 'అన్న'గారు చెప్పడం మంచిది. ●

7-7-1989 35762
విడి ప్రతి వెల రు. 3.50

# ఆంధ్ర సచిత్ర వార పత్రిక

సంపుటము 81 స్థాపితం 1908 బొంబాయి : 1914 మద్రాసు సంచిక 41

విజయవాడ వ్యవస్థాపకులు: దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు శ్రీ శుక్లనామ సం జ్యేష్ఠ శు చవితి

(1938-1972 సంపాదకులు) శివలెంక శంభుప్రసాద్

ఎడిటోరియల్ అడ్వయిజర్: శివలెంక రాధాకృష్ణ ఎడిటర్. వీరాజీ

ముద్రాపకుడు, ప్రచురణకర్త శివలెంక నాగేశ్వరరావు

ఆంధ్రపత్రిక ప్రెస్, గాంధీనగరం, విజయవాడ-3, ఫోన్లు 75667, 61247, 61248

## వీక్లీ పోస్టు

బహుమతి పొందిన ఉత్తరం

సకాలం

ఆడంబరంగా అట్టహాసం చేస్తున్న పత్రికలవారు కూడా మన ఆంధ్రపత్రికను ఆదర్శంగా తీసుకోవాలి. ఆరునెలలలోనే అద్వితీయంగా, అనురాగ భరితంగా అనుకున్న ఫలితాన్ని సాధించి అవరోధాలు దాటుకొని వారానికి ముందే విడుదలకి సిద్ధపడుతున్న ఆంధ్రపత్రిక సకాల ఆగమనాన్ని ఆకాంక్షిస్తూ, అలా వచ్చినందుకు అభినందిస్తున్నాము

-కాళిదాసు సుబ్బలక్ష్మి, కందుకూరు

వజ్రసంకల్పం

నూతన ఆంధ్రసచిత్ర వారపత్రికలో ప్రారంభమైన "వజ్రసంకల్పం" మా హృదయంలోని సంకల్పాలను సైతం సన్నాయి పాడించింది రచయిత "శాతవాహన"గార్కి అభినందనలు

పంచశూలమ్ సీరియల్ రియాలిటీని లైఫ్‌ను మరపింప జేస్తోంది

పాఠకులకు అనుగుణమైన ఉత్తమరీతిలో వారం వారం నూతనత్వాన్ని సంతరించుకొని వెలువడుతున్న పత్రిక రియల్లీ మోస్ట్ ఇంపార్టెంట్ వీక్లీ

-"అరుణ" (మెట్‌పల్లి)

(74వ పేజీ చూడండి)

## పదండి తో పత్రిక!




ముఖ చిత్రం: టి.వి. సుభద్రగారానున్న రమ్యక్రిష్ణ ముఖారవిందం.

(ఫొటో: సత్యమూర్తి)

పై వారం:

అందానికి-అవసరానికి ప్లాస్టిక్ సర్జరీ!

శాస్త్రిగారు తిరుపతిలోచెప్పేశారు. , 15 తర్వాత ఏ రోజైనాసరే 'ఎల-' ప్రకటించేస్తామని చెప్పేశారు- లోక్- ఎన్నికలు, 17 రాష్ట్రాల్లో, వాటితోపా- అసెంబ్లీ ఎన్నికలు కూడా జరిగిపోతాయని టి గంట' పెట్టినట్లే యిప్పుడింక. ఎన్నిక- ా మాసం ఒకటి ధనుర్మాసంలాగ వచ్చేస్తుం- దన్నమాట- "తాంబూలా లిచ్చాను తన్ను- కు చావండి" అని అగ్నిహోత్రావధాన్లు అన్న- ట్లు మన ఎలక్షన్ల ప్రధాన అధికారి పేరిశా- స్త్రిగారన్నా అనకపోయినా- ఎలక్షన్ల కోసం పార్టీలు తన్నుకు చావడం ఖాయం- ఈపా- టికే వారంతా కత్తులు నూరుకుంటున్నారు. ఈసారి ఎన్నికల కురుక్షేత్రంలో దిగుతున్న పెద్ద లంతా ఎన్నడూ లేనంతమంది వోటర్లను ఎదు ర్కొంటారు. ఎన్నికల కమిషనర్‌గారి లెక్కల ప్రకారం 50 కోట్ల 17 లక్షల మంది వోటర్లు



రాష్ట్రాలు గవర్నర్ల "కబ్జా"లో వున్నాయి. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి ఎన్నికలకు తాను రెడీ అంటున్నారు. ఆయన "బ్రహ్మర్షి" గెట-ప్‌లో ఎన్నికల ప్రచారానికి ఎంత "యెర్లీ"గా అయితే అంత మంచి గిరాకీ రావచ్చును కను-క- ఆయన రెడియే మరి - ఈసారి వోట్లు ఎవరికి వేసినా - చైతన్యరథం బదులు - విశ్వా

శాస్త్రిగారు అన్నారు - లక్షా యాభై వేల ఎల-క్ట్రానిక్ వోటింగ్ యంత్రాలు యీసారి అక్క-డక్కడా ఉపయోగిస్తారట - శుభం కోరరా పెళ్లి కొడకా అంటే అలివేలు మంగళ కుండల-కాడ సచ్చినట్లు తొంగుంటా నన్నాట్ట- అలాగా అంటున్నాను అనుకోకండి. కాని యీ యంత్రా లు సమయానికి పని చేయకుండా పోకుండా వుండాలి - 50 కోట్ల 17 లక్షల వోటర్లున్న మరో దేశం అనగా ప్రజాస్వామ్య దేశం పవిత్ర భారత దేశం తప్ప మరోటి లేదు అని వేరే



## తాంబూలాలు యిస్తున్నాను...
## తన్నుకు చావండి...

తమ పరిపాలకులను ఎన్నుకోడానికి క్యూలలో నించుంటారు.

1990 సంక్రాంతినాటితో లోక్‌సభ గడు-వు అయిపోతుంది! అలాగే దేశంలోవున్న మరో 17 రాష్ట్రాలకి కూడా జనవరి ఏప్రియల్ నెల-ల మధ్యలోనే పాత అసెంబ్లీలకు కాలం చెల్లి-పోతుంది కనుక వాటికి కూడా ఎన్నికలు నిర్వ-హించవలసిందే కదా! కర్నాటక, పంజాబ్

మిత్రం రథం మైనస్ మేనకా బయట దేరి-తే దాని వెంట జనం విరగబడతారు. వడిసం ఆశ్చర్యం లేదు-

### వోటింగ్ యంత్రాలు

ప్రజలు మాత్రం యాంత్రికంగానే వోట్లు వేస్తున్నారు అయినా ఎలక్ట్రానిక్‌వోటింగ్‌యంత్రా లను యీసారి రంగంలోకి దింపుతామని పేరి-

చెప్పనక్కరలేదు- యిందులో వున్న జనాభాలో 23 శాతం జనాభా 40 సం.లుగా రాజ్యాంగ రీత్యా "వేరే"గా వెనకబడిన వారీగా పరిగణిం-పబడుతూనే వున్నారు- అదీ ఒక రికార్డే!

### చైనాలోపార్టీస్వామ్యం నిరంకుశత్వం!

సందర్భం వచ్చింది కనుక మన ప్రజా-



స్వామ్యాన్ని ఎంతైనా మెచ్చుకోవాలి - చైనాలో ప్రజాస్వామ్య పోకడలు కావాలని అడిగినందుకే కుర్రకుంకల్ని ఊచకోత కోస్తున్నారు రోడ్లమీద కొన్ని ముస్లిం దేశాలలాగా, నేరస్థుల్ని లేదా నిందితుల్ని నిలబెట్టి పబ్లిక్‌గా కాల్చి పారేయడమో, ఉరి తీయడమో చేస్తున్నారు డెంగ్, లీపెంగ్‌లు ఒక కొత్త స్లోగన్ ప్రవేశపెట్టారు పార్టీని, సైన్యాన్ని ప్రేమించమని సైన్యం ఇప్పుడు యువతరం జుట్టు పట్టుకుని టెలివిషన్ తెరమీద స్పష్టంగా కనపడేలాగ వారిని చిత్రహింసలు పెడుతున్నది

భారత దేశంలో వున్న "యువతరం" ఇటువంటి దృశ్యాలు వూహించనైనాలేరు-వారు సమ్మెలు, హర్తాళ్‌లు - బస్సుల, రైళ్ల "రోకోలు" పరశురామప్రీతులు ఇవన్నీ చేస్తారు-భూకంపాలు సృష్టించగలరు- మార్పు కావాలని డైనమైట్‌లై పేలిపోగలరు ఊ! కాని చైనాలో సంగతి వేరు- అక్కడ ఒక రైలు నాపాలనుకున్న జన సమూహంమీదుగా రైలు బండి ఇనుప చక్రాలు - సజీవమూర్తులను పచ్చడి చేస్తూ దొర్లిపోగా *60* మంది తునా తునకలై ప్రాణాలు వదిలేశారు! ఆ తరువాత ఆ రైలుని జనాలు తగలెట్టారట! కాని ఈ నేరానికిగాను పట్టుబడ్డ యువకులకు మరణదండన విధించింది చైనా పార్టీ గవర్నమెంటు- ఇది అమెరికా పత్రికలు తయారు చేసిన కట్టుకథగాదు- మన దూరదర్శన్‌లో కూడా ఈ రైలు తగలడిపోవడాన్ని చూపించారు. అంతకుముందు కథ మాత్రం యెవ్వరికీ తెలియదు-

ఇటువంటి ఉద్యమాలను అణచివేసే నిరంకుశ నియంతృత్వ నిర్లజ్జాకరమైన తీరు భారత దేశంలో మరి వంద ఏండ్లకీ రాదు, రావాలని కూడా ఎవ్వరూ అడగరు- ప్రజాస్వామ్యం ఉద్యమాన్ని చైనా ప్రభుత్వం మొదట చాలా ఉదారంగా చూసినట్లు కనపడ్డా- పొంచివున్న పులిలాగా ఉద్యమకారులమీద "సైన్యం"తో దూకించి "డెంగ్, పెంగ్‌లు" చేస్తున్న ఈ అకృత్య పాలనను రాజకీయ సాంఘిక సంస్కరణలలో అంతర్భాగంగా భావించాలనుకోడం అనుచితం - అది వారి అంతరంగిక వ్యవహారం అనడం భారత విదేశాంగ నీతి అయితే అవుగాక కాని చైనాలో విద్యార్థుల ఆందోళన వెనుక సంఘ దృష్టి లేదనడం ఎవ్వరూ చేయరాదు - చేస్తే అది మానవతా దృక్పథాన్ని కోల్పోయి చేయడమే అవుతుంది ప్రపంచంలో హింసాత్మక ఉద్యమాలు - యువతీ యువకులు పాల్గొంటున్న ఉద్యమాలు ఎన్ని దేశాలలో లేవు? అన్నిచోట్లా ఇట్లా "పిల్లల్ని" ఉరికంబా లెక్కించి, వారి గుండెల్లోకి తూటాలు గుప్పించి చేస్తున్నారా? మనిషిని చంపడంచేత సిద్ధాంతం అతనిలో చస్తుందా? చైనాలాంటి సువిశాల అతి పెద్ద జనాభా దేశంలో ప్రజలు పాల్గొనే ఉద్యమాలని దమననీతితో అణచివేయడం కష్టం అని డెంగ్, పెంగ్‌లు అద్యతన భావిలోనే గ్రహిస్తారు- కాని ఈలోగా ఈ దారుణ కృత్యాలవల్ల అమెరికా, అమెరికా మిత్ర రాజ్యాలు తీసుకుంటున్న "దిల్‌చస్పీ" లేదా కౌతుకం కొంచెం మోతాదు ఎక్కువేననిపించుతున్నది కొందరికి - అమెరికా అన్ని రకాల సంబంధాలు బీజింగ్‌తో ఒకటీ ఒకటీగా త్రెంచుకుంటున్నది ప్రాచ్య పాశ్చాత్య దేశాల మైత్రికి ఇది దెబ్బ అవుతుంది ఇట్లాంటి విఘాతాలు రాకుండా డెంగ్ పెంగ్‌ల పార్టీలు - జాగ్రత్త పడటం మంచిది - కాని చైనా ప్రభుత్వం ఎవరి మాట వినే స్థితిలో లేదు! - చివరికి చైనా ప్రజల మాటే అది వింటుంది! వారే అలా చేయగల ధీరులు!!

## మన "ఫ్రంట్" సంగతి

నేషనల్ ఫ్రంటు మీటింగ్ కూడా విశ్వామిత్ర ముహూర్తానికే పెట్టుకున్నారు వి పి సింగ్, దేవీలాల్ ప్రభృతులు దీన్ని కూడా చిటికెలో పరిష్కరించి - రానున్న ఎన్నికలలో *375* స్థానాలకి ఫ్రంటు పోటీ చేస్తుందని ప్రకటించారు వి పి సింగ్‌గారు! - అంటే *69* శాతం లోక్‌సభా స్థానాలకి ఈ భాగస్వామ్య పార్టీలు అభ్యర్థుల్ని నిలబెడతాయన్నమాట

ఉమ్మడి చిహ్నం విషయంలో పేచీ అలాగే వుంది అక్కడాకరుణానిధిగారే పట్టుబడుతున్నాడు ఉదయించే సూర్యుడే చిహ్నమైతే బేష్ అంటా డాయన - జనతాదళ్‌లో ఈలోగా లుకలుకలు ఎక్కువైతే ఈ *375* అంకె ఎలా మారుతుందో కూడా చెప్పలేం వామపక్షాలు కూడా ఫ్రంట్‌కే బాసటగా నిలిస్తే - వాళ్లు కూడా గెలిస్తే మొత్తం *425* అవుతాయట లోక్‌సభ స్థానాలు - దొంగలు దొంగలు వూళ్లు పంచుకున్నట్లుగా ఇప్పుడే వీరు సీట్లు పంచేసుకుంటే - వోటర్‌లు - వీళ్లనే ఎన్నుకుని తీరుతారు అన్న గ్యారంటీ ఏమిటి? - సింగిల్ లార్జెస్ట్ పార్టీగా ఈ *375* స్థానాలలోను పోటీ చేసిన పార్టీలలో ఏ ఒక్క పార్టీ అయినా రాగల స్కోపు వుంటే అప్పుడు కదా సింగిల్ లార్జెస్ట్ పార్టీగా కాంగ్రెసుకి ఎదురుగా ఏదో ఒక పార్టీని వేసి - "తతిమ్మా వారి మద్దతు తీసుకుంటాం" అంటూ రాష్ట్రపతి వెంట వీరు పడగలరు? - "ఫ్లోటింగ్ చూడవచ్చాం" అనుకోకుండా ఏదో వాక అంకె ప్రకటించారే గాని "ఫ్రంట్"- అసలు స్వరూపం బయటపడాలీ అంటే కొంత టైము పడుతుంది జూలై నెలాఖరున చూద్దాం.

(23-6-'89)


మేనకతో విశ్వామిత్ర



**పసుపులేటి శ్రీనివాసులు, అనంతపురం.**

జీవితాన్ని తెలుసుకోవాలంటే?

* బ్రతికి చూడడం ఒక్కటే నాకు తెలిసిన దారి!

ప్రేమించడానికి కావలసిన అర్హతలేమిటి?

* ఫిజికల్ లెవెల్‌లోనా? మెంటల్ లెవెల్‌లోనా? భార్యని పోషించకల పౌరుషం కలవాడిని, అన్నంపెట్టి దెప్పని వాడిని, జీవిత భాగస్వామిని పనిమనిషిగా చూడనివాడిని, ఆడదానికీ కాస్త మెదడుందని అనుకునేవాడినీ ఆడపిల్లలు ప్రేమిస్తారు మగపిల్లల సంగతి నాకు తెలియదు.

మన దేశంలో సమానత్వం ఎప్పుడు వస్తుంది?

* రాదు! ఎందుకంటారా? సమానత్వం యిచ్చినా - వేం యిచ్చాం, వేం యిచ్చాం, మాకు మీరు రుణపడి వుంటారు - అంటూ ఎత్తిపొడుస్తూనేవుంటారు మగవాళ్ళు - ఒకరు - యిచ్చేవారు - ఒకరు పుచ్చుకునేవారూగా వున్నన్నాళ్ళూ సమానత్వం రాదు.

మీరు టి. వి. చూస్తారా?

* అప్పుడప్పుడు.

**శ్రీకొండ నవీన, నెల్లూరు.**

ఏడ్వకండి, ఏడ్వకండి.... చూశారా? ఇది దర్శించిన సినీనటి జమున తన సహకారాన్నిచ్చారట!

* మద్రాసుపట్నంలో - కల్చర్ అంటే సినిమాలు వేయడం, నాట్యం పెట్టడం, నాటకంవేస్తే జనం రారు. ఇక్కడ ఔత్సాహిక నాటకసంఘాలు-బ్రతికి బట్టకట్టవు. ఉట్టినే నాటకం చూపిస్తామన్నా రాని రసికులిక్కడ పుట్టలున్నారు! నాటకరంగం అభివృద్ధిపై ఉపన్యాసాలేగాని కాంక్రీటుగా పనిచేయనివారు చాలామంది ఉన్నారు-బాధపడవలసిన విషయం ఏమిటంటే - ఇటు తమిళ నాటకరంగాన్ని చూసైనా నేర్చుకుందామనుకోని మూర్ఖత్వం! ఆరుద్ర సురభివారి నూరేళ్ళ చరిత్రలో - వారి తొలినటి రంగస్థలంపై పుట్టిందని చెప్పినప్పుడు ప్రముఖ దర్శకురాలు, భావుకురాలు శాయిపరంజిపె ఇంతకంటే థ్రిల్లింగ్ విషయం వుండదు మనం దీన్ని టి వి. కి మలుద్దాం అంది ఈ విషయం ఆరుద్ర వ్యాసపీఠంలో రాశారుకూడా కాని ఎవరో యీమధ్య నాటకరంగానికి ప్రాణం పోయాలన్న తపనతో పని ప్రారంభించారని విన్నా చూద్దాం - ఏంచేస్తారో. 'ఎక్స్'లు ఏంచేయలేరు

**మత్రి భాస్కర్, మెట్‌పల్లి.**

తను ప్రేమించిన మగవాడిలో ఆడది కోరుకునేది?

* సహజీవిపై గౌరవం చూపగల మనసు.

వీరశైవ వాఙ్మయం అంటే?

* నా కెలా తెలుస్తుంది? నేనేం పిహెచ్‌డి విద్యార్థినా? మేధావినా?!

ఆధునిక సాహిత్యంపై మీ అమూల్యమైన అభిప్రాయం ఏమిటి తెలపండి.

* అభిప్రాయమేకదా! తెలిపితే పోయె! ఈనాటి సాహిత్యం - సాహిత్యంకాదు - రచన. ఇది పది కాలాలు నిలువడానికని కాదు - తక్షణానంద పరనానికి. పత్రికలకి ప్రకటనలు కావాలి. ప్రకటనలు రావడానికి - సంఖ్యాబలం కావాలి. సంఖ్యాబలం రావాలంటే -మసాలా రచనలు వేయాలి. అవి వేయాలంటే రాసేవారిని ఉత్తరాల శీర్షికల ద్వారా అందలం ఎక్కించాలి. పొగేసినట్టు పనిచేస్తుంది - శీర్షిక - పూనకం పూనినట్టు రాసేస్తారు పాపులర్ రచయితలు. మరి వీటిని వారి పిల్లలు, భార్యలు, సన్నిహితులు చదివి ఏమంటారన్న భయంలేని ధీరులు వీళ్ళు

**బి. రాజేష్, వెల్లుల్ల.**

మంచితనం ఎక్కడుంది?

* మనిషి మనసులో అందుకే కనిపించదు.

ప్రేమించిన ఆడది ద్వేషించేదెప్పుడు?

* మోసగించబడినప్పుడు. అప్పుడూ మాటపడేది ఆడదే - అదీ మీరు ఆశ్చర్యపడవలసిన విషయం!

**వి. ధనరాజ్, పాకాల.**

పట్టుదల వుంటే కానిది లేదు అనే సూక్తి వుందికదా? విద్యార్థులంతా తమకే ఫస్టురేంకు రావాలని పట్టుపడితే? అది సాధ్యమా?

* సాధ్యమే - పట్టుపట్టవచ్చు. కాని కర్మ - పట్టి విడువరాదు - అన్నమాట మరిచిపోతూనే వుంటారు - విద్యార్థులు! అంచేత ప్రమాదంలేదు తమ్ముడూ.

**చలపాక ప్రకాష్, విజయవాడ.**

మన తెలుగు చిత్రాల టైటిల్స్ జరుగుతున్నప్పుడు స్క్రిన్‌ప్లే అని చూస్తూంటాము దీని అర్థం ఏమిటి?

* మీరు చూస్తూన్న సినిమా సాగే ఆర్డరు - స్క్రిన్‌ప్లే. కథ జరిపేవిధానం అన్నమాట. ఇది ఎవరు రాసినా సాధారణంగా దర్శకుడి కా ఘనత దక్కుతుంది!

విదేశీ స్త్రీలలో లేనిది భారత స్త్రీలో ఉన్న గొప్పతనం ఏమిటి డియర్ సిస్టర్?

* ఏం లేదు మైడియర్ బ్రదర్ పడివుండడం. దీన్నే మనం ఓర్పు అంటాం!

**వి. రాధాకృష్ణమూర్తి, సికింద్రాబాదు.**

త్రాగుడు వ్యసనంపై మీ అభిప్రాయం ఏమిటి రామలక్ష్మిగారూ?

* మీ ఊళ్ళో ఉంటూ యింకా అడగడం దేనికయ్యాబాబూ. వినలేదా - మనిషి మొదటి పెగ్ - దాహం తీరడానికి, రెండో పెగ్ శక్తికోసం, మూడో పెగ్ సరదాకోసం - ఇక నాల్గోది - పిచ్చిపట్టి లాగిస్తాడని ప్రతీతి! కాఫీకి బదులు తాగేవాళ్ళని ఆంధ్రలోనే చూ—!

# నెస్టమ్® బేబీ సిరియల్ – రైస్

## మీ పాపాయి యొక్క ఆదర్శప్రాయమైన తొలి ఘన ఆహారం

35762

### వాడి చూడండి!

నెస్టమ్ బేబీ సిరియల్‌ని పాలలో కలిపినప్పుడు అది అన్నానికి గల తేలిగ్గా జీర్ణమయ్యే గుణం పరిపూర్ణ పోషకాహారపు మంచితనం అందజేస్తుంది 4 నెలలు వయసు వచ్చాకా పాపాయి ఆహారంలో మీరు ఘన పదార్థాలు ప్రవేశ పెట్టేటప్పుడు నెస్టమ్‌తో ప్రారంభించండి బియ్యంతో తయారు చేయబడిన నెస్టమ్ తేలిగ్గా జీర్ణయం అయ్యేందుకు ప్రత్యేకంగా రూపొందించబడింది అంతేకాదు నెస్టమ్ ఇనుము విటమిన్‌లతో మరింత బల వర్ధకం చేయబడింది



నెస్టమ్‌ని తయారు చేయడం ఎంతో సులువు దీనిని ముందుగా కాచిన వెచ్చటి పాలల్లో కలపండి అంతే పాపాయికి తినిపించేందుకు ఆహారం తయారు!

నెస్టమ్ పాలు లేకుండా అందుబాటులో ఉన్న ఒకే ఒక సిరియల్ మీరు మీ పాపాయి ఆహారంలో వివిధ రుచులు తెచ్చేందుకు ముందుగా ఉడికించి యింట్లోనే తయారు చేసిన మెత్తటి గుజ్జుగా చేసిన కూర ముక్కలు పప్పు పండ్లు నెస్టమ్‌లో కలపండి

**కేవలం రూ 9/-* కే డబ్బాలో 200 గ్రా. సంచీ**

* స్థానిక పన్నులతో సహా




**ఉచితం !**

నెస్టమ్ రెసిపి బుక్ లెట్ ఈ చిరునామాకు వ్రాయండి
నెస్టమ్
పోస్ట్ బాక్స్ నెం 6016
న్యూ ఢిల్లీ 110 008

Nestlé

ప్రస్తుతం ఒక్క ఆంధ్ర ప్రదేశ్ లోనే దొరుకుతోంది

R K SWAMY FSL 327 TEL



# మెన్నమాటలు

## ముద్దంశెట్టి హనుమంతరావు

**రా**త్రి పదిగంటలు దాటింది.

అప్పుడే భోజనం ముగించుకుని వచ్చి, మంచం మీద ఒరిగాడు, వెంకటేశం.

మగన్నుపడుతూ వుండే తలుపు తట్టిన చప్పుడు వినిపించి చప్పున లేచాడు వెంకటేశం. ఈ సమయంలో యెవరొచ్చారోనని, ఆరాటంగా తలుపు తెరిచాడు. ఎదురుగా బామ్మర్ది శ్రీనివాసరావు, చిన్న సూట్‌కేసుతో ప్రత్యక్షమయ్యాడు.

"ఓ! నువ్వేనా?" అన్నాడు వెంకటేశం, తాపీగా.

"ఔను బావా! నీ వుత్తరం అందిన తక్షణం బయుల్దేరిపోయాను." అన్నాడు శ్రీనివాసరావు.

"మంచిపని చేశావు. లోపలికిరా..." అంటూ, బామ్మర్ది లోపల అడుగు పెట్టగానే తలుపు మూశాడు, వెంకటేశం.

అదో చిన్నగది. ఒకే ఒక్క మంచం వుంది. వెనక్కి బాత్రూమ్ లాంటి దేదో చిన్న గది. తక్కువ అద్దెలో కావాలంటే, నగరాల్లో అంతకంటె పెద్దిల్లు దొరకదు కూడాను."

"భోంచేశావా?" అడిగాడు వెంకటేశం.

"ఆ! భోజనం చేసే బైలుదేరాను బావా."

"మావయ్య, మీ అక్కా వాళ్ళంతా బావున్నారా?"

"బావున్నారు బావా! నువ్వేదో, నా కోసం వుద్యోగం యేర్పాటు చేసి వుంటావని, నాన్నేమో వెంటనే నాచేత ప్రయాణం కట్టించాడు..."

వెంకటేశం గొంతులో, వెలక్కాయ పడినట్టయ్యింది. తనకే, ఓ స్థిరమైన వుద్యోగం లేదు.. అట్లాంటిది బామ్మర్దికి చేయించేదేవిటి!... అనుకున్నాడు, మనసులోనే.

"అబ్బే! అదేం కాదులే శ్రీనూ. ఈ రోజుల్లో యేదేనా ఓ స్థిరమైన వుద్యోగం దొరకడ మంటె యెంత కష్టమో, నీకు తెలీందికాదు. నేనో బ్రాందీ షాపులో సేల్సుమాన్‌గా పన్జేస్తున్నానని చెప్పాను గుర్తుందా?"

"గుర్తుంది...."

"అక్కడే, నీకూ టెంపరరీ వుద్యోగం. నేను సెలవులో వెళ్ళాలనుకుంటున్నాను. ఇవేం గవర్నమెంటు వుద్యోగాలు కావుకదా-

మనం సెలవు మంచి వచ్చి అక్కడే చేరడానికి! ప్రయివేటు వుద్యోగాలు. మనకి గత్యంతరం లేక, యిటువంటి వుద్యోగాలు చేస్తుంటాం. నేను సెలవులో వెళ్ళాక, యింకెవర్నో పైవాళ్ళని నా స్థానంలో యజమాని చేర్చుకున్నాడనుకో... నేను తిరిగి వచ్చేసరికి, నాకు మళ్ళీ ఆ అవకాశం దొరక్కపోవచ్చు. అందుకనే, నిన్ను రప్పిస్తున్నానని, మా యజమానితో చెప్పాను... నేను సెలవులో వున్నన్ని రోజులూ నువ్వే పని చేస్తావని." అంటూ వివరంగా చెప్పాడు, వెంకటేశం.

"ఏపాటి జీతం యిస్తారు బావా?" ప్రశ్నించాడు, శ్రీనివాసరావు.

"జీతం యేమంత యెక్కువ వుండదులే. నెలకి మూడొందలే. అయితే, రోజుకో పది, పదిహేను రూపాయలు అదనంగా సంపాదించుకోవచ్చు.." అంటూ కాస్తంత ఆశ చూపించాడు, వెంకటేశం.

"అదెలా బావా?" ఆశ్చర్యంగా అడిగాడు, శ్రీనివాసరావు.

"అది యెలాగో, నేను చెబుతాలే. నువ్వు యీ ఇంట్లోనే వుండొచ్చు. నేను తిరిగి వచ్చాక, నిన్ను మరోచోట వుద్యోగంలో పెడతాను." చెప్పుకుపోయాడు, వెంకటేశం.

"సరే బావా! ఈ నగరంలో జీవితం గడిపేందుకు, ఢోకా లేకపోతే అంతే చాలు." తృప్తిగా అన్నాడు, శ్రీనివాసరావు.

"అటువంటి భయం యేమీ పెట్టుకోకు... రేపు వుదయాన్నే మా యజమాని దగ్గరికి తీసుకుని వెళ్తాను... బాగా రాత్రయ్యింది పడుకో" అన్నాడు వెంకటేశం బామ్మర్దికి చాప, తలగడ అందిస్తూ.

శ్రీనివాసరావు, చాప మీద హాయిగా నిద్రపోయాడు, ఆ రాత్రి.

* * * * *

ఆ బ్రాందీషాపు యజమాని పేరు, సింహాచలం. ఎక్సైజు డిపార్టుమెంటులో పన్జేసి, రిటైరయ్యాక, అందులోని మెళుకువలు తెలిసినవాడు గనక, బ్రాందీషాపు పెట్టాడతను. అయితే, షాపులో కూచోవడం నామోషీగా ఫీలై, అమ్మకానికి చురుకైన యిద్దరు కుర్రాళ్ళని పెట్టుకున్నాడు. అప్పుడప్పుడూ వచ్చి, తనిఖీ చేస్తూ పోతూ వుంటాడు.

ఆ యిద్దరు కుర్రాళ్ళలో, వెంకటేశం సీనియరు. మాంచి చురుకైనవాడు. వ్యవహారాలన్నీ అతడే చూస్తూ వుంటాడు.

మర్నాడు వుదయం యేడున్నర గంటలకి, బామ్మర్దిని తీసుకుని యజమాని సింహాచలం దగ్గరికి వెళ్ళాడు, వెంకటేశం.

అభివందనాలు అయ్యాక, "మీకు చెప్పాను కదండీ, నేనూరికెళ్తానని..." అన్నాడు, వెంకటేశం.

"ఔను. చెప్పావు, మరి, నీ స్థానంలో పని చెయ్యడానికి ఓ నమ్మకస్తుణ్ణి యేర్పాటు చెయ్యమన్నాను కదా" అన్నాడు సింహాచలం సిగరెట్ దమ్ములాగుతూ.

"మీరు చెప్పారు గనకనే, మా వూర్నుంచి మా బామ్మర్దిని రప్పించానండీ. ఇదిగో వీడే! పేరు శ్రీనివాసరావు. చాలా నమ్మకస్తుడు. నా బామ్మర్ది కదా, నాలాగే వ్యవహరిస్తాడు. మీకు, యెటువంటి యిబ్బందీ వుండదండీ. నేను పదిరోజుల తర్వాత వచ్చేస్తాగా. ఆ పదిరోజులకీ జీతం మావాడికే యిచ్చేస్తారు." అన్నాడు, వెంకటేశం.

సింహాచలం శ్రీనివాసరావుకేసి యెగాదిగా చూశాడు. కుర్రాడు చురుకయినవాడిలానే కనిపిస్తున్నాడనుకున్నాడు, లోలోన.

"నమ్మకస్తుడంటావు..." గంభీరంగా అన్నాడు, సింహాచలం.

"ఔను సార్! అందులో సందేహం అక్కర్లేదు. నా మాట మీద నమ్మకం వుంచండి."

"సరే. నువ్వు చెబుతున్నావుగా బట్టి, అంగీకరిస్తున్నాను. ఏమాత్రం నాకు అనుమానం కలిగినా, తక్షణం యింటికి పంపేస్తాను. అర్థమయ్యిందా?" సూటిగా వెంకటేశం మొహంలోకి చూస్తూ అన్నాడు, సింహాచలం.

"అలాగేనండీ! అటువంటి అవకాశం రాదనే నా అభిప్రాయం" ఖచ్చితంగా చెప్పాడు



## వెన్నుపోటు

వెంకటేశం.

వెంకటేశం, బామ్మర్దికేసి చూశాడు. శ్రీనివాసరావు, బావ అభిప్రాయాన్ని అర్థం చేసుకున్నాడు.

"సార్, మా బావ చెప్పినట్టు, అటువంటి అవకాశం రానివ్వను సార్! మీరే చూస్తారుగా" అన్నాడు, శ్రీనివాసరావు సవినయంగా.

శ్రీనివాసరావు చురుకుదనానికి ముగ్ధుడయ్యాడు సింహాచలం. మంకులా మౌనంగా వూరుకోకుండా వెంకటేశం మూపుని చరువుకుని, వెంటనే మాట్లాడ్డం, అతని స్మార్ట్‌నెస్‌ని వ్యక్తం చేసిందనుకున్నాడు.

"ఓ కే. ఇటువంటి చురుకయిన వాళ్ళు, మన షాపులో యెంతో అవసరం వెంకటేశం. నువ్వు యీవాళ నుంచే సెలవులో వెళ్తావా?" అన్నాడు, సింహాచలం.

"ఔను సార్! పది రోజులైన వెంటనే రంచనుగా వచ్చేస్తాను."

"సరే! ఇతడికి ఛార్జీ యివ్వు. ఇద్దరూ సంతకాలు పెట్టండి. నేను పది గంటలకి వచ్చి చూస్తాను."

"అలాగేనండీ. మరి, వస్తా..." అంటూ వెనక్కి తిరిగాడు, వెంకటేశం.

"వస్తాను సార్..." సవినయంగా సింహాచలంకి నమస్కరిస్తూ, బావ వెంట నడిచాడు, శ్రీనివాసరావు.

తొమ్మిదింటికి ఛార్జీ యివ్వడం పూర్తి చేశాడు వెంకటేశం. ఇద్దరూ స్టాక్ కాగితం మీద సంతకం పెట్టారు. ఎలా అదనంగా సంపాదించవచ్చునో, కిటుకు చెప్పాడు బామ్మర్దికి, వెంకటేశం.

శ్రీనివాసరావు ఆశ్చర్యపోయాడు. అటువంటి అవకాశం యీ షాపుల్లో వుంటుందనే ఆలోచనే లేకపోయిందింత వరకూ అతనికి.

ఆ రోజే వెంకటేశం సెలవు మీద వెళ్ళిపోయాడు.

* * * * *

శ్రీనివాసరావు తెలివైనవాడు. అతని బావ, వెంకటేశం కంటే తెలివైనవాడు. నగర జీవితం, అతనికో రంగులకల. ఆ జీవితమంటే, అతనికి యెంతో యిష్టం. కాని యింతవరకూ అటువంటి అవకాశం రాలేదు. ఇప్పుడొచ్చింది. అందుకు, యెంతో మురిసిపోయాడు.

తన బాధ్యత నిర్వహణలో లోటు లేకుండా చూసుకోవాలనుకున్నాడు, శ్రీనివాసరావు.

సింహాచలం అభిమానాన్ని ఒక్క రోజులోనే సంపాదించాడు. అతని అదృష్టం బావుండి, ఆ రోజు షాపులో సేల్సు బాగుండటమే, అందుకు కారణం. ఆ రోజు సేల్సు చూసి ఆశ్చర్యపోయాడు, సింహాచలం.

"ఇవ్వాళ సేల్సు యింత బాగున్నాయేవిటోయ్! ప్రత్యేకమైన కారణం యేమన్నా వుందంటావా?" అడిగాడు శ్రీనివాసరావుని.

శ్రీనివాసరావు, చిన్నగా మందహాసం చేశాడు.

"కంచే చేను మేస్తే, ఆ చేనుకి రక్షణ యింకేముంటుంది సార్?" మర్మ గర్భితంగా అన్నాడు చిన్నగా నవ్వుతూనే.

సింహాచలం షాక్ తిన్నాడు. అతనికి అర్థమైపోయింది, విషయం యేవిటో! అంతవరకూ, యెంతో నమ్మకస్తుడని తాను నమ్మిన వెంకటేశం, తనని మోసం చేస్తూ వచ్చాడేమోనన్న అనుమానం మొలకెత్తిందతనిలో.

"అంటే మీ బావ వెంకటేశం, నన్ను మోసం చేస్తూ వచ్చాడంటావా?" గంభీరంగా శ్రీనివాసరావు కేసి చూస్తూ అడిగాడు, సింహాచలం.

సింహాచలం కళ్ళల్లో యెర్రని జీర యేర్పడింది. తనని మోసగించే వాళ్ళని క్షమించడతను.

శ్రీనివాసరావు, కాస్తంత తికమక పడ్డాడు. ఏం చెప్పాలో, చప్పున అతని మస్తిష్కంలోకి రాలేదు. వెంకటేశం తనకి బావే. కాని, యీ పరిస్థితుల్లో తన యీ చిన్న వుద్యోగాన్ని నిలబెట్టుకోవాలంటే, బంధుత్వం చూడకూడదు. వెంకటేశం బావకి యీ వుద్యోగం లేకపోయినా యిబ్బంది లేదు. పదెకరాల పొలం వుంది. కాని, తాను వ్యవసాయం చెయ్యలేదు. ఒకరి చేత చేయించలేడు. తమకి అంతగా పొలం లేదుకూడాను. అంచేత తనకి వుద్యోగమే ఆధారం. దీన్ని నిలబెట్టుకోవాలి... అనుకున్నాడు.

"ఏవిటోయ్ ఆలోచిస్తున్నావు ? " అడిగాడు, సింహాచలం.

"అబ్బే, ఏవీలేదండీ! మీరడిగిన ప్రశ్నకు జవాబు యేంచెప్పినా అవి, తర్జన భర్జన పడుతున్నాను సార్ ! వెంకటేశం నా బావండీ నన్ను యిక్కడకు చేర్చినవాడూ అతనే, అందుచేత, నా నోటితో అతనికి విరుద్ధంగా చెప్పడం, బావుండదు కదండీ ! మీరు అర్థం చేసుకుంటే చాలునండీ" అన్నాడు శ్రీనివాసరావు, మొహం దించుకొని.

సింహాచలానికి, శ్రీనివాసరావు చెప్పిన పద్ధతి బాగా నచ్చింది.

"నిజమే శ్రీనివాసరావ్, నువ్వు వెంకటేశానికి అప్పుడైన బామ్మర్దివి అయ్యుండి కూడా, నిజాన్ని యింత ధైర్యంగా వెల్లడి చేశావూ అంటే, నీ నిజాయితీని, నీ ముక్కుసూటిదనాన్ని, అభినందించాలోయ్. నీలాంటి వ్యక్తే నాకు అవసరం."

"మీ అభిమానానికి ధన్యవాదాలుసార్ ! మరి, నేను వెళ్లిరానా అండీ ?" నమ్రతగా అన్నాడు, శ్రీనివాసరావు.

"వూ వెళ్లవోయ్..." తృప్తిగ అన్నాడు సింహాచలం.

శ్రీనివాసరావు, నిష్క్రమించాడు. అతని హృదయం, సంతోషంతో వూగిసలాడింది. ఆ రోజు సేల్సు పెరగడానికి కారణం యేదయినా, దాన్ని ట్రంపుకార్డుగా వినియోగించుకున్నందుకు, లోలోన మురిసిపోయాడు. ఏదో ఒక జీవనాధారం సంపాదించుకోవాలంటే, బంధుత్వం, నీతి, నిజాయితీ, నిస్వార్థాలకు, నీళ్లధార వదులుకోవాలని యెప్పుడో నిర్ణయించుకున్నాడతను. ఉత్సాహంగా ముందుకు సాగాడు.

** ** **

రోజులు సాగిపోతున్నాయ్.

పదిరోజులు సెలవు పూర్తిచేసుకొని, వచ్చేశాడు, వెంకటేశం.

శ్రీనివాసరావు, వెంకటేశం కలిసి సింహాచలం దగ్గిరికి వెళ్ళారు. ఇద్దరూ అతనికి అభివందనాలు చేశారు.

"నేను సెలవు నుంచి వచ్చేశాను సార్! ఈరోజు నుంచే నా డ్యూటీలో జాయినవుతాను." అన్నాడు, వెంకటేశం.

సింహాచలం, శ్రీనివాసరావు కేసి



భారత ఉక్కు సంస్థ, మారుతీ ఉద్యోగ్ లిమిటెడ్ సంస్థల అధ్యక్షుడు శ్రీ వి.కృష్ణమూర్తికి పుదుచ్చేరి విశ్వవిద్యాలయం డి.లిట్. (డాక్టర్ ఆఫ్ లెటర్స్) ఇచ్చి సత్కరించింది. పరిశ్రమల నిర్వహణకు సంబంధించి చేసిన సేవలకి గుర్తింపుగా ఆయనకు ఈ గౌరవం లభించింది.

చూశాడు.

"శ్రీనివాసరావ్, మీ బావ యెన్ని రోజులు యీ నెల పనిచేశాడో చూసి, ఆ రోజులకి జీతం యిచ్చి పంపించేయ." అన్నాడు మెల్లగా.

వెంకటేశంకి, షాక్ తగిలినట్టయ్యింది. అచేతనంగా క్షణం వుండిపోయాడు. అతనికి, కళ్ళు గిర్రున తిరిగినట్టయ్యింది.

"అదేవిటిసార్, నేను పర్మనెంటువాణ్ణి, నేను వెళ్ళిపోవడమేమిటి?" అన్నాడు. అతని స్వరం జీరవోయింది.

సింహాచలంకి తెలుసు, వెంకటేశం ఆ ప్రశ్న వేస్తాడని. సన్నగా మందహాసం చేశాడు.

"పర్మనెంటు, టెంపరరీ, అనుకోవడానికి యిదేం గవర్నమెంటు జాబ్ కాదోయ్ వెంకటేశం, శ్రీనివాసరావు లాంటి చురుకైనవాళ్లే మాకు అవసరం. మా అవసరాన్నిబట్టే, మీ ఉద్యోగాలు. అర్థమయ్యిందా ? వెళ్లి నీ జీతం తీసుకో" నిర్మొహమాటంగా చెప్పాడు సింహాచలం.

"ఇది, చాలా అన్యాయంసార్." కాస్తంత ప్రాధేయపూర్వకంగా మళ్లీ అన్నాడు, వెంకటేశం.

"ఏదీ అన్యాయం కాదోయ్, మాకు నచ్చినవాళ్లనే మేం వుంచుకుంటాం..." అంటూ, లోపలకు వెళ్లిపోయాడు, సింహాచలం.

బామ్మర్దికేసి చూశాడు వెంకటేశం.

"ఇదేం బాగులేదు శ్రీనూ ." అన్నాడు.

"నేనేంజేసేది బావా ? నీ మొహంమీదే అతను చెప్పాడు కదా ! నన్ను మానేయమంటావా చెప్పు, నేనూ మానేస్తాను .. " అన్నాడు తెలివిగా.

వెంకటేశం యేలా చెబుతాడు, మానేయమని ?

"నువ్వెందుకు మానేయడంలే, ఈపాటి వుద్యోగం నేను సంపాదించుకోలేకపోను! పద, జీతం తీసుకుంటాను..." అన్నాడు, వెంకటేశం.

వాళ్లిద్దరూ కలిసి, అక్కణ్ణించి నిష్క్రమించారు.

వెంకటేశం, తనకు రావలసిన జీతం తీసుకొని, తన వూరుకి ప్రయాణం కట్టాడు.

తాను సెలవులో వెళ్ళినప్పుడు, పరాయివాడికెవడికయినా ఛాన్సు యిచ్చివుంటే, పరిస్థితి మరోలా వుండేదేమోనని యిప్పుడనుకున్నాడు వెంకటేశం. కాని,సొంత బామ్మర్దే వెన్నుపోటు పొడుస్తాడని యెలా వూహించగలడు!

○




**చూస్తావ్! చూస్తావ్! రాస్తావ్. చూసీ, రాసీ ఏం చేస్తావ్?**

ఇది ఓ వాగ్బాణం అనుకోండి దీన్ని మరో వాగ్బాణంతో మీరు ఉపసంహరించాలి– ఆ 'రిపార్టీ' గుచ్చుకోవాలేగాని బాధించకూడదు రసభరితంగా వుండాలేగాని అశ్లీలం కొట్టవచ్చినట్లుండరాదు కార్డు మీద మాత్రం రాయాలి ఈ వాక్యం పైన రాసి మీ ప్రతి వాక్యం దాని క్రింద రాయండి మీ పూర్తి విరునామా ముఖ్యం ప్రచురించిన రెంటికీ రు 25, రు 15 చొప్పున బహుమతి వుంటుంది'– ఈ విషయంలో సంపాదకునిదే తుది నిర్ణయం

## 12-7-'89 లోగా అందేలాగా రిపార్టీలు పంపించాలి! -సం

చాలా మంది వెంటనే "రిపార్టీ"ల వర్షం కురిపించారు కొన్ని మాత్రం ఎంపిక చేసి వేస్తున్నాం బహుమతులు పొందిన రెండూ కాక– మరికొన్ని యిక్కడ వేశాము తతిమ్మా వారి వాగ్బాణాలు స్థలాభావం చేత వేయలేకపోయాం లాటరి తీసి కొందరి పేర్లు మాత్రం వేస్తున్నాం' ఒకసారి బహుమతి రాలేదని నిరుత్సాహ పడక మళ్లీ ప్రయత్నించండి' -సం

**"పిల్ల నచ్చిందిగా ముహూర్తాలు చూద్దామా?"**

* రు. 25 బహుమతి పొందిన రిపార్టీ:

## "కాస్త ఆగు, పిల్లకు ఉద్యోగం వుందో.. లేదో అడుగు!"

-బి. రాజమణి (సంగారెడ్డి)

* రు. 15 బహుమతి పొందిన రిపార్టీ

## "అబ్బాయికి వంట చేయటంవచ్చో.. రాదో కనుక్కోమంటోందండీ అమ్మాయి..."

-బండారి శ్రీనివాస్ (కొత్తగూడెం)

మరి కొన్ని వాగ్బాణాలు

"అబ్బాయికి వో ఉద్యోగం చూడండి ముందు."

- కె. శ్రీనివాసరావు (రామచంద్రపురం)

- జె.వి. రత్నావళి (రాజమండ్రి)

"పిల్ల నాకు నచ్చింది మరి మా అబ్బాయికి నచ్చాలిగా!"

-ఉమశ్రీ (అనంతపురం)

లక్కీ పేర్లు :

ఎ. బాబురావు (సంగారెడ్డి), రామదుగుల (తిరుచ్చి), పి.ధనలక్ష్మి (బోడుప్పల్), వై.వి. సుధాకరరెడ్డి (కడప), పి. జగన్నాధరావు (విశాఖపట్నం), కె. శంకర్‌రావు (సిర్పూర్ కాగజ్‌నగర్), ఆర్. లక్ష్మణ (నందివాడ),ఎం. అరుణ కుమారి (గుడివాడ)

సీరియల్

# శత్రుసంహారం

లల్లాదేవి

(గత సంచిక తరువాయి)

జరిగిన కథ - 4 :చైనా యుద్ధంలో అసువులుబాసి పరమవీరచక్ర అవార్డు అందుకున్న మహేష్‌చంద్ర కొడుకు రాహుల్ వైమానికదళంలో పైలట్‌గా చేరతాడు. తల్లి, భార్య కారు ప్రమాదంలో మరణించారన్న వార్త అందిన రాహుల్ తన వూరువెళ్లి అంత్యక్రియలు పూర్తిచేస్తాడు. కుమార్తె సుషుమ్న వదలకుండా పట్టుకు తిరుగుతున్న ఒక ఎలక్ట్రానిక్ పరికరం గురించి మరదల్ని ఆరా తీస్తాడు రాహుల్ అటువంటి పరకరంవల్లనే సంపత్ మాస్టారి కొడుకు మరణించాడన్న విషయం తెలుసుకున్న రాహుల్ తన తల్లి, భార్య మరణానికి సంబంధించిన వివరాలను సేకరించేందుకు పోలీసు ఎస్.పి.ని కలుస్తాడు. మహాదేవి అలయన్స్ సంస్థ అధిపతి దేవీప్రసాద్ సెక్రటరీ ఛద్దా కెమికల్ వెపన్స్ ఫ్యాక్టరీని స్థాపించాలని సంకల్పిస్తాడు. దానికి కావల్సిన ఇండికేటర్‌ను ఎలాగైనా సంపాదించమని సంపత్ మాస్టారి కూతురు పీయూషను పురమాయిస్తాడు.

సుషుమ్న గదిలో ఒంటరిగా ఉంది చుట్టూ బొమ్మల కొలువు పెట్టుకుంది పప్పా కొనిపెట్టిన మిక్కీమౌస్‌ని చూచి ముచ్చటపడి పోతోంది మమ్మి, గ్రానీ గురించి అస్పష్టమయిన భావాలు కొన్ని ఆ లేత గుండెల్ని దారుణంగా తొలుస్తున్నాయి చనిపోవటమంటే ఏమిటో తెలిసే వయసు కాదు మళ్ళీతిరిగిరారని మాత్రమే అర్థమయింది మమ్మీ లేకుండా ఎలా? ఇంతకాలం మమ్మీ ఉంది పప్పాలేరు ఇప్పుడు పప్పా ఉన్నారు మమ్మి లేరు

గ్రానీ అసలు తిరిగి రానేరారు మిక్కీమౌస్‌ను పుచ్చుకొని లేవాలని ప్రయత్నించింది అది చేజారి పడిపోయి రెండు విభాగాలుగా అయింది 'పప్పా' కోప్పడతారు ప్రక్కనే ఉంచుకొన్న ఇండికేటర్‌ని ఒకభాగం లోపల ఉమర్చింది అది మమ్మి, గ్రానీ చనిపోయినపుడు తన చేతికి వచ్చింది ఆ భయంకరమైన ఆలోచనలు దీని మూలంగా జ్ఞాపకం వస్తున్నాయి మిక్కీమౌస్‌లో ఇండికేటర్ బహుచక్కగా ఇమిడిపోయింది మళ్లా రెండు పార్టు కలిపేసింది సుషుమ్న మిక్కీమౌస్ అందంగా అమరిందిప్పుడు ఇండికేటర్ దానిలోపల ఉంది ఎవరికీ కన్పించదు

ఆ ఇండికేటర్ కొన్ని కోట్ల సంపాదనకల ఒక మల్టీనేషనల్ సంస్థను దివాళా తీయించ గలదని పాపాయికి ఏం తెలుసు!

మరికాసేపు పప్పా ప్రేమగా కొనియిచ్చిన మిక్కీమౌస్‌తో ఆడుకుంది ఇంకా కొన్ని బొమ్మలతో ఆడుకుంది బాగా అలసి నిద్రపోయింది నిద్రపోకముందు ఏం చేసిందో పూర్తిగా మర్చిపోయింది నేలమీదపడి నిద్రపోతున్న సుషుమ్నని తీసుకువచ్చి మంచంమీద పడుకోపెట్టుకున్నాడు రాహుల్! బొమ్మలన్నింటిని షోకేసులో అందంగా సర్దితిరిగి వచ్చాడు

ఇంకా ఈ ప్రపంచంలో తనకంటూ మిగిలింది పాప మాత్రమే! తిరిగివచ్చి సుషుమ్నని కావలించుకొని పడుకొన్నాడు పోలీసు ఫైల్స్‌లో చదివిన సంగతులన్నీ జ్ఞాపకం వస్తున్నాయి గంట తరువాత నిద్ర లేచింది సుషుమ్న!

ఆమెను ముద్దు పెట్టుకున్నాడు. లాలించాడు.

"నీ దగ్గర ఉన్న ఇండికేటర్ ఎక్కడ దాచావు డార్లింగ్" అని అడిగాడు.

"ఏమో పప్పా! నాకు తెలియదు" అంది సుషుమ్న.

"బాగా జ్ఞాపకం తెచ్చుకోమ్మా!"

"నాకేం తెలియదంటే మీరు వినరేం?"దానిగురించిన జ్ఞాపకాన్ని పూర్తిగా కోల్పోయిన సుషుమ్న అయోమయంగా చూచింది.మరింత అయోమయంలో పడిపోయాడు రాహుల్.

★ ★ ★

"క్షమించండి పందొమ్మిది వందల ఎనభైతొమ్మిది జనవరి ఆరవతేదీన బొంబాయి నుంచి వచ్చే కారవెల్లి దారుణంగా కూలిపోయింది పడిపోయేముందుగా కేంద్రంతో వెర్‌లెస్ సంబంధాలు తెగిపోయినాయి పెలెట్ పంపిన వార్తలేవీ చేరలేదు అతను ఏదైనా మాట్లాడితే అది బ్లాక్ బాక్స్‌లో రికార్డు అవ్వాలి అదికూడా జరగలేదంటే కారణం తెలియదు

ఆ కారణం తెలుసుకోవాలంటే ఇండికేటర్‌ను క్షుణ్ణంగా పరిశీలించాలి అది పరిశీలనకు పంపాం యింకా రిపోర్టు రాలేదు సర్! పత్రిక లకు వార్తలు ఇచ్చేందుకు ఎలాంటి అవకాశం లేదు సర్, అన్నాడు ఏ ఎస్ పి కారంత్ డైరెక్టర్ జనరల్ మండిపడిపోతున్నారు

"నీవు ఇలా కథలు చెబితే నేను వింటాను కాని నేను చెబితే ప్రభుత్వం వింటుందనుకొన్నావా? ప్రజలు వింటారనుకొన్నావా? నువ్వు ఇలా మాట్లాడుతాన్నవంటే మనిద్దరి

లో ఒకరు ఈడియట్ అయి ఉండాలి"

"ఎక్స్‌క్యూజ్‌మి సర్! ఆ రిపోర్టు వెంటనే తీసుకొంటాను"

"డుది నీడ్‌ఫుల్ ఎట్‌వన్స్" కఠినంగా ఆర్డరిచ్చారు డైరెక్టర్ జనరల్

"ఎస్ సర్" అంటూ సెల్యూట్ ఇచ్చి బయట పడిపోయాడు కారంత్ వరండా లోకి వచ్చి రుమాలుతో నుదురు అద్దుకున్నాడు

"ఆర్యూ స్మార్ట్?" ఎర్రక్షరాలు వ్రాసిఉన్న అద్దంలో చూచుకొని మరోమారు క్రాప్ సవరించుకున్నాడు డి జిగారి మాటలు కొరడా ఝుళిపించినట్లుగా ఉన్నాయి ఈ డిపార్టుమెంటులో ఉద్యోగాలు చేయుట మంటే కత్తిమీద సాము

డైరెక్టు రిక్రూట్‌గా ఏ ఎస్ పి ఛార్జి తీసుకున్నది మొదలు ప్రతిరోజూ ఒక ఛాలెంజ్! ప్రభుత్వాలకన్నా చాలా సందర్భాల్లో టెర్రరిస్టులు అరాచక వాదులు బలంగా పనిచేస్తారు వారికి కొందరు అధికారులు రాజకీయ నాయకుల మద్దతు ఉంటుంది ఆ ప్రభు త్వం త్వరగా పడిపోవాలని కోరుకొనే వర్గాల వారందరూ ఇలాంటి వ్యక్తులకు రహస్యంగా పరోక్షంగా మద్దతు ఇస్తారు

పోలీసులు ఏమి చేయాలి? చేయగలిగినది చేస్తూ ఉండాలి!

ఐ ఏ ఎఫ్ వారి రిసర్చి ఇన్‌స్టిట్యూట్ వైపుగా దూసుకు వచ్చాడు కారంత్

అతనిలో నిరుత్సాహం తగ్గి పట్టుదల పెరుగుతోంది కార్యాలయంలో ఉద్యోగులు చాలా సిన్సియర్‌గా తల ఒంచుకొని పనిచేస్తున్నట్టు కనిపించారు టైపు మిషన్లు టకటక లాడుతున్నాయి

"ఎవరుకావాలి మీకు" అటెండర్ పలకరించాడు ఎవరూ తలెత్తలేదు హాలులోకి తాను అడుగుపెట్టిన సంగతి ఎవరూ గుర్తించనట్లుగానే ఉండిపోయారు

"సి ఇ గారు ఉన్నారా?"

"ఉన్నారు కాని విజిటర్స్‌ని రెండు గంటల తరువాత చూస్తారు"

"డిపార్ట్‌మెంట్ పనిమీద వచ్చాను" విజిటింగ్ కార్డ్ అందించాడు అది తీసుకొని లోపలకు వెళ్ళిన అటెండరు ఇరవై నిముషాల తరువాత వచ్చాడు అతడి ముఖం ఉదాసీనంగా ఉంది

"లోపల ఎవరో మంత్రిగారు ఉన్నారు కాసేపు కూర్చోండి తర్వాత పిలుస్తాను" అన్నాడు కారంత్ సహనానికి పరీక్ష అయింది కూర్చున్నాడు చాలా సేపు గడిచిపోయింది తలుపులు తెరుచుకొన్నాయి మంత్రిగారు మంది మార్బలంతో వెలుపలకు వచ్చారు మంత్రిగారు ఏదో



మాట్లాడుతున్నారు ఈ ప్రపంచంలో మాట్లాడే అధికారం ఆయన ఒక్కడికే ఉన్నట్టు భావించిన వాళ్లలా మిగిలిన వాళ్లు శ్రద్ధగా వింటున్నారు అలా నటిస్తున్నారు

"ఇప్పుడు మీరు లోపలికి వెళ్ళండి"

కారంత్ క్రాప్ సవరించుకొని లోనికి నడిచాడు

"ఏం కావాలి?" మంత్రిగారితో మాట్లాడి విసిగిపోయినట్లు కనిపించారు సి ఇ ఉదాసీనంగా ఉంది ఆయన వైఖరి

"ఎంక్వయిరీకి వచ్చాను ఒక కేసులో ఇన్‌ఫర్‌మేషన్ కావాలి"

"నాతోనే మాట్లాడాలా?"

"అవును మీతోనే!"

"కూర్చోండి విషయమేమిటో బ్రీఫ్‌గా చెప్పండి" అన్నారు సి ఇ

"జనవరి ఆరవ తేది కారవెల్లి కూలిపోయిందిగదా!"

"అవును దేశంలో ప్రముఖులు 36 మంది చనిపోయారు వారిలో ఒకరు అంతర్జాతీయ క్రీడాకారుడున్నాడు ప్రముఖ రాజకీయ వేత్తలు నలుగురు ఉన్నారు వారు పోవటంతో ఒక వర్గానికి నడుములు విరిగాయి పాపం ఆ సెక్షన్ మళ్లా వార్తల్లో కనిపించకుండా పోయారు షార్ సెంటర్ ఇంజనీర్లు ఇద్దరున్నారు వీరు చనిపోవటం వలన ఒక రాకెట్ ప్రయోగం రెండుగంటలు వాయిదాపడింది ఆహార ధాన్యాలు పండించే ఓ జెనిటిక్స్ ఇంజనీర్ చనిపోయారు

కొందరు ప్రముఖ వ్యాపారులు చనిపోవటంతోకొన్నివ్యాపారాలు కుప్పకూలిపోయాయి ఓ విమానం కూలి పోయిందంటే ఆ నష్టాన్ని రూపాయల్లో అంచనావేయలేం అది దేశ పురోగతికే నష్టం వాటిల్లిన సంఘటన! ప్రజలలో విశ్వాసం దెబ్బతింటుంది

ప్రమాద కారణాలను విచారించేందుకు ఓ కమిటీని వేసింది ప్రభుత్వం ఆ కమిటీ రిపోర్టు ఇంకా రాలేదు పోలీసులు కూడా చేతులు ముడుచుకు కూర్చున్నారు మీరు కూడా ఇంతవరకూ చేయగలిగింది ఏమీ లేదను కుంటాను" అన్నారు సి ఇ

ఆయన పొడిచిన ముల్లు తగిలి కారంత్ గిలగిల్లాడిపోయాడు

"సర్! మేము ఆలోచిస్తున్నాము తీవ్రంగానే!" అన్నాడు

"ఆలోచిస్తే సమస్యలకు సమాధానం దొరకదు పని చెయ్యాలి"



## పెద్దరవాణావిమానం

ఏరో స్పేస్ లైన్‌కు చెందిన ఈ సూపర్ గప్పీ విమానం చాలా పెద్దది. ఇందులో **79.38** టన్నుల బరువును మోసుకొని వెళ్ళేందుకు వీలుందట.

ఎయిర్ బస్‌ల విడిభాగాలను రవాణా చేసేందుకు దీన్ని ఉపయోగిస్తారట. ఈ విమానం రెక్కలు **156** అడుగులుంటాయట. పొడుగు **43.05** మీటర్లు వుంటుందట.

మరి విమానం విడి భాగాలు మోసుకొని వెళ్లాలంటే చిన్నవాటికి సాధ్యమవుతుందా! అందుకే స్పేస్‌లైన్ వాళ్లు ఈ విమానాన్ని రూపొందించి వుంటారు.

" ఏం చెయ్యాలని మీ అభిప్రాయం?" పోలీసు తెలివి ప్రయోగించాడు కారంత్! ఈ కేసు ఎలా పరిష్కరించాలనే విషయం మీద ఆయనకు ఒక అభిప్రాయం ఉంటుంది టెక్నీషియన్‌గా ఆయన ఈ సంఘటన గురించి పోలీసుల కన్నా ఎక్కువ అర్థం చేసుకోగలుగుతారు అది తెలుసుకోవాలనే అతని ఇగోని సంతృప్తి పరచాలని అడిగాడు

"ఏ చేయాలో మీరు ఇప్పుడు అడుగుతున్నారు ఇక్కడ విమానం ప్రమాదానికి ఖచ్చితమైన కారణాలు చెప్పగల సాంకేతిక నిపుణులుంటారనే విషయం మీకు యిప్పుడు గుర్తు వచ్చిందా? మనిషి హక్కులకి రాజ్యాంగానికి సంబంధించిన నేరాలు జరిగినప్పుడు లాయర్లను ఆశ్రయించాలి సాంకేతిక మైన నేరాలు జరిగినపుడు మిమ్మల్ని అడగాలి కదా?"

"సర్! మిమ్మల్ని అడిగి తెలుసుకొనేందుకే వచ్చాను" పోలీసు ఆఫీసర్‌గా చలాకీతనం చూపించాడు కారంత్! సి ఇ గారి ఇగోని శాంతింపచేయగలిగాడు అతని మీద సి ఇ గారికి అనుకూలమయిన అభిప్రాయాలు కలిగాయి

"అయితే చెప్తాను వినండి ప్రమాదం జరిగినపుడు విమానం రెండువేల అడుగుల ఎత్తున వెడుతోంది హఠాత్తుగా కేంద్రంతో సంబంధాలు తెగిపోయాయి పైలట్ ఏదో చెప్పి ఉంటాడు ప్రత్యక్షంగా జరుగుతున్నది ఏమిటో వివరించి ఉంటాడు కాని అది కేంద్రానికి చేరలేదు అతను ఏం చెప్పాడో తెలుసు కోగలిగితే ఈ సమస్య మబ్బులా విడి పోతుంది "

పైలట్ చనిపోయాడు విమానంలో ఎవ్వరూ మిగలలేదు మొత్తం 36 మంది చనిపోయారు మనకు అతనేం చెప్పాడో ఎలా తెలుస్తుంది సర్! ఎవరు చెప్తారు' అంటూ దీనంగా అడిగాడు కారంత్

సి ఇ గారు ఇగో పూర్తిగా శాంతించింది

"అందుకే ఇది పోలీసువారికి పూర్తిగా అర్థంకాని విషయం అన్నాను అప్పుడేం జరిగిందో తెలుసుకునేందుకు దార్లు ఉన్నాయి క్రూలు అటువంటి ఏర్పాట్లు ముందు జాగ్రత్తకోసం చేస్తాం "

"ముందు జాగ్రత్తకోసం కారవెల్లిలో ఎలాంటి ఏర్పాట్లు చేసారు?" అది సాంకేతిక సమాచారం ఆయన చెప్పాలి కనుక వినయం ఉట్టిపడే స్వరంతో అడిగాడు కారంత్

సి ఇ గారు పైపు వెలిగించి లేచి నిలబడ్డారు

"బ్లాక్ బాక్స్' అనే పేరు ఎప్పుడైనా విన్నారా మీరు?" అన్నాడు గుప్పుమని మేఘంలా పొగ వదిలి

"విన్నాను సర్! ప్రపంచ ప్రచారమైన కనిష్క ప్రమాదంలో వినిపించింది ఆపేరు కనిష్క సముద్రంలో కూలిపోయింది అప్పుడుకూడా ఇలాగే కేంద్రంతో పైలెట్‌కు సంబంధాలు తెగిపోయాయి ఆ బ్లాక్ బాక్స్ కోసం 'రోబట్'లను సముద్రంలోకి పంపి దాన్ని వెలుపలకి తీయించారు సర్" అన్నాడు కారంత్

"యా! యు ఆర్ రైట్! కారవెల్లిలో కూడా అటువంటి ఏర్పాట్లు ఉన్నాయి క్రూ బాక్స్‌లో ఈ సమాచారం అంతటిని రికార్డు చేసే ఎలక్ట్రానిక్ పరికరం ఒకటి అమర్చారు ఇండికేటర్! అది చాలా చిన్న పరికరం దాన్ని ఎగ్జామిన్ చేస్తే ఈ కేసు మబ్బులా విడిపోతుంది రహస్యాలు బయట పడతాయి' అని వివరించారు సి ఇ

"సర్! ఆ ఇండికేటర్ ఇప్పుడు ఎక్కడుంది?" అని అడిగాడు కారంత్!

"దానిని విశ్లేషణకు పంపించాం ఒక దళం దాన్ని విశ్లేషించే కార్యక్రమంలో ఉన్నారు ఫలితాలు రాగానే ప్రభుత్వానికి రిపోర్టు పంపుతాం ఈ భవనంలో గ్రౌండ్ ఫ్లోర్‌లో మరో సి ఇ ఉన్నారు వారి దగ్గర మీకు మరికొన్ని వివరాలు తెలుస్తాయి " తిరిగివచ్చి తన కుర్చీలో కూర్చున్నాడు ఆయన

"థాంక్యు సర్ !" అంటూ లేచాడు కారంత్

కేసు గురించిన కొంత అవగాహన ఏర్పడింది కొన్ని వివరాలు తెలిశాయి దాంతో అతనిలో ఉత్సాహం ఉరకలు వేస్తోంది గ్రౌండ్ ఫ్లోర్‌కి వచ్చాడు కాని అక్కడ సి ఇ గారు లేరు నాన్ టెక్నికల్ స్టాఫ్ ఉన్నారు

"మీరు వచ్చిన పనిఏమిటి?" ఒకాయన ప్రశ్నించాడు

"సి ఇ గారిని చూడాలి"

"ఆయన లేరు పనేంటో చెప్పండి నేను వారి సెక్రటీని"

"కారవెల్లీ నుంచి క్రూ బాక్స్ విశ్లేషణకు వచ్చిందికదా! ఆ వివరాలు తెలుసుకొనేందుకు డ్యూటీ మీద వచ్చాను"

" ఆవివరాలు మీకు తెలిసే అవకాశం లేదు" నవ్వాడా వ్యక్తి! కారంత్ చాలా నిరుత్సాహంతో కృంగిపోయాడు

"అవకాశమే లేదంటారా? ఎందుకని?"

"క్రూ బాక్స్‌లో ఆయువుపట్టులాంటి పరికరం ఎలక్ట్రానిక్ ఇండికేటర్! అది ప్రస్తుతం మాదగ్గిర లేదు సర్"

"మరెక్కడైనా పరిశీలన నిమిత్తం పంపించారా?"

"కాదు సర్! అది దొంగిలించబడింది "

"దొంగతనమా? అంత ప్రాముఖ్యత కలిగిన వస్తువు ఎవరు తీస్తారు? ఎలా పోతుంది? ఆర్యూ జోకింగ్"

"నో సర్! ఇట్స్ ట్రూ అది దొంగలించబడింది"

"అదెలా సాధ్యమయింది రక్షణ శాఖకు అనుబంధ సంస్థ గదా ఈ రీసెర్చ్ సెంటర్! ఎంతో ప్రాముఖ్యత కలిగిన ఆ వస్తువుని ఇక్కడ నుంచి ఎవరు ఎలా దొంగిలించగలరు?" అమితాశ్చర్యంతో అడిగాడు

"ఈ ప్రపంచంలో ఏదైనా సాధ్యమే సార్!"

"కావాలనే ఎవరైనా చేశారనా మీ అభిప్రాయం"

"అలా ఎందుకు కాకూడదని నా అనుమానం"

"ఆ వస్తువు ఎవరికి పనికిరాదుకదా!"

"ఈ ప్రపంచంలో పనికిరాని వస్తువు అంటూ ఏదీ ఉండదు సార్!"

" దాన్ని తిరిగి మరో విమానంలో ఉపయోగించ వీలుంటుందా?"

"ఉంటుంది కాని అలా ఎవరూ చేయరు"

"మరి దాని అవసరం ఎవరికి ఉంటుంది?"

"సార్! మీరు పోలీసు ఆఫీసర్ అయి ఉండికూడా ఇలా ప్రశ్నించడం చాలా అమాయకంగా ఉంది ఆ ఇండికేటర్ విశ్లేషణ జరిగితే అతి విలువైన ముఖ్యపాత్రల రహస్యం బయట పడుతుంది దొంగలెవరో ప్రపంచానికి తెలిసిపోవచ్చు ప్రజలతరఫున ప్రభుత్వము కొన్ని వందల కోట్ల రూపా యలను ఏ వ్యాపార సంస్థ మీద అయినా క్లైమ్ చేయవచ్చు దానివెనుక అలాంటి చిదంబర రహస్యాలు ఎన్నో దాగుంటాయి " అంటూ వివరించాడు ఆ ఉద్యోగి

కారంత్ కళ్ళు తెరుచుకున్నాయి ఇది రొటీన్‌గా జరిగే పరిశోధన కాదు దీని వెనుక చాలా అగాధం ఉంది ఎవరో చాలా పెద్ద వాళ్ల హస్తం కూడా ఉంది అని అతనికి అర్థమయింది

"అంత విలువైన వస్తువు పోతే మీరేం జేశారు?"

"చేసేందుకు ఏముంటుంది అది దొంగిలించబడింది అని దగ్గరలో ఉన్న పోలీసులకు తెలియజేసాము పరిశోధన ఆగిపోయిందని ప్రభుత్వానికి రిపోర్టు పంపించాం ఉద్యోగులుగా మేం చేయగలిగింది అంతే కదా!?"అనిచేతులు దులి పేసుకొని మరోవైపు తిరిగాడు కారంత్ ఆ భవనం నుంచి పరుగులాంటి నడకతో

# శత్రుసంహారం

బయటపడ్డాడు ఆ ప్రాంతానికి సంబంధించిన పోలీస్ స్టేషన్ దగ్గరలోనే ఉన్నది కేసుకు సంబంధించిన ఓ కొత్తరూపం అతని మనసులోకి రావటంతో ఇన్వెస్టిగేషన్ స్పిరిట్ వచ్చేసింది జీపు దిగి లోనికి వెళ్ళాడు

ఎ ఎస్ పిని చూసి ఎస్ ఐ కంగారు పడిపోయాడు ముందుగా సమాచారం లేదు రావలసినంత అర్జంట్ కేసులు లేవు గౌరవంగా ఆహ్వానించి చేతులు కట్టుకొని ప్రక్కన నిలుచున్నాడు

"ఈ మధ్య దొంగతనం కేసులు ఏమైనా రికార్డు అయినాయా?"

"ఇదేదో చాలా ఆశ్చర్యంగా ఉంది సార్! కేసులు లేవు ఈ మధ్య"

"ఎయిర్‌ఫోర్స్ రీసెర్చ్ సెంటర్ నుంచి కూడా ఏమీ లేవా?"

"ఒక కేసు రికార్డు అయిందిగాని వారి దగ్గరనుంచి పోయింది ఏమీ లేదు ఎందుకు పనికి రాని ఓ చిన్న ఇనుపముక్క! ప్రభుత్వ సంస్థ కాబట్టి ఆనవాయితీ ప్రకారం రిపోర్టు ఇచ్చారు" అన్నాడు ఎస్ ఐ

"యూ ఫూల్! అది చిన్న ఇనుపముక్కా? ఎందుకూ పనికిమాలినదా? ఎవరు చెప్పారు నీకు?" ఉరిమి చూచాడు

"ఇద్దరు పి సి లు వెళ్ళి కేసు రాసుకువచ్చారు వాళ్ళు చెప్పింది ఇదే!"

"ఒక గుడ్డివాడి చేయి పట్టుకొని నూరుమంది గుడ్డివాళ్ళు గోతిలో పడినట్లుగా ఉంది నీ ప్రవర్తన! ఈడియట్! అది ఈ దేశ భవిష్యత్‌కి కొన్ని వందల కోట్ల విలువచేసే వ్యాపారానికి సంబంధించిన అపురూప వస్తువు బుద్ధిమాలిన వాడా వెంటనే రికార్డ్స్ పట్టుకురా!" అని మందలించాడు ఎస్ ఐకి ముచ్చెమటలు పోసినాయి తానే స్వయంగా పరిగెత్తుకుపోయి రికార్డు బుక్ తీసుకు వచ్చాడు కేవలం నాలుగు ముక్కలు ఉపయోగించి నిర్లక్ష్యంగా వ్రాసిన కేసు బయటికి తీసాడు దాన్నిఎ ఎస్ పికారంత్ ముందుంచాడు

"దీని విషయమై నువ్వేమైనా విచారించావా?"

"సారీ సార్! దీనికి ఇంత ప్రాముఖ్యత ఉన్నదని నాకు తెలియదు రిపోర్టు ఇచ్చిన వారు కూడా ఎవ్వరూ లేరు"

"అమాయకుడా! కేసుల్లో ముఖ్యమయినవి కొన్ని, ముఖ్యముకానివి కొన్ని ఉంటాయను కొన్నావా? ఎవరి కేసు వారికి ముఖ్యమైనదే కదా? ఈ కేసులో ఎందరి భవిష్యత్తులు ఎన్ని జీవితాలు ముడిపడిఉన్నాయో నీకు ముందు ముందు తెలుస్తుంది ఈ కేసును ఇలా మూల పడేసి ఉంచినందుకు నిన్ను సస్పెండ్ చేయవచ్చు అవునా? కాదా?"

"అవును సార్! కాని పిల్లలు గలవాడ్ని ఎక్స్‌క్యూజ్‌మి!"

"నేను అడుగుతోంది క్షమాపణలు కాదు ఇలా చేయనని ఇంకెప్పుడు నిర్లక్ష్యంగా ప్రవర్తించనని మాట యివ్వాలి"

"అలాగే సార్" ముచ్చెమటలు పోసి ఒంటిమీద బట్టలుకూడా తడిసాయి త్వరత్వరగా రాసి ఇచ్చాడు తప్పు ఎక్కడ జరిగిందో కారంత్‌కి తెలుసు! కేసు ఇచ్చేవారు దాని ప్రాముఖ్య తను కొంతైనా వివరించాలి కాని ప్రభుత్వ కార్యాలయాలు బాధ్యతా రహితంగా ప్రవర్తిస్తుంటాయనటానికి ఇదో ఉదాహరణ! కారంత్ ఆకాగితాల్ని తీసుకొని ఫైలు మూసేసాడు దానిలో వివరాలేం లేవు పని చేయని ఓ ఎలక్ట్రానిక్ పరికరం దొంగిలించ బడిందని మాత్రమే ఉంది దాని విలువను ప్రాధాన్యతను గుర్తించలేదు ఇప్పుడా పరికరం ఎవరిని చేరిందో మరి?

* * *

మిక్కీమౌస్‌ని ఒక్కక్షణంకూడా విడిచి ఉండదు సుషుమ్న! తండ్రిమీద ప్రేమ అంతా ఆ బొమ్మమీద చూపెడుతుంది అది రెండుగా విడిపోతుందన్న విషయం పూర్తిగా మర్చిపోయింది అది అలా విడిపోతుందనే విషయం ఆ యింట్లో రాహుల్‌కి గాని తన్వికి కాని మరెవరికి కాని తెలియనే తెలియదు విమాన ప్రమాదం వివరాలున్న ఎలక్ట్రానిక్ ఇండికేటర్ సముద్రంలో మునిగిపోయిన బ్లాక్‌బాక్స్‌లా అయిపోయింది

భూస్థాపితమైన పిసినారివాడి నిధిలా అయిపోయింది

కాని అలాంటి వస్తువు పాపదగ్గరుండాలనే విషయాన్ని రాహుల్ మర్చిపోలేదు దాన్ని గురించి అడిగినప్పుడు ఏడ్చింది తల్లికూడా లేదు కాబట్టి పూర్తిగా దిగులుపడింద నుకున్నాడు

"అలాంటి వస్తువు పాపచేతికి ఎలా వచ్చింది?" అన్న సాధారణమైన ఉత్సుకతకి సమాధానంతరువాతఆలోచించాలనుకున్నాడు సంపత్ మాస్టారి కథ విన్న తరువాత అలాంటి వస్తువుకి కొంత బ్యాక్‌గ్రౌండ్ కూడా ఉండవచ్చు అనిపించింది దాన్ని పోలీసు అధికారులకు ఇచ్చేయటం మంచిది అని భావించాడు

"స్వీటీ! నీదగ్గర ఓ టాయ్ ఉండాలికదా ఏమైంది?" అని అడిగాడు సుషుమ్న భయంభయంగా చూస్తోంది

"ఎక్కడయినా దాచి పెట్టావా?" బుజ్జగించాడు మళ్ళీ బావురు మంది టాయ్ కేసులో గాలించాడు ఇల్లంతా వెతికాడు కాని మళ్ళా దాని ఆచూకీ కనిపించలేదు తన్వీ కూడా వెతికింది

"పాపనిన్న సాయంత్రం టెర్రస్‌లో ఆడుకుంటోంది" అని చెప్పింది ఇద్దరు వెళ్ళి టెర్రస్ మీద గాలించారు

"బహుశా ఎక్కడయినా పోగొట్టుకుందేమో" అంది తన్వీ!

"అమ్మాయిగారు! నిన్న సాయంత్రం పాత ఇనుపసామాను అంతా బజారుకు పంపించారు కదా! వాటితో పోయిందేమో!?" అన్నాడు పనికుర్రాడు

"ఏమో! వెళ్ళినా ఆశ్చర్యంలేదు అది పనికిమాలిన వస్తువు అనుకుంటున్నాం కదా!" అంటూ బదులు చెప్పింది తన్వీ

రాహుల్ బజారుకి పరుగుతీసాడు ఆ షాపు యజమానిని పట్టుకొని షాపు అంతా గాలించాడు కాని దాని ఆచూకీ కనిపించ లేదు పాప ఎక్కడో పారేసి ఉండాలి అనే నిర్ణయానికి వచ్చాడు దాని బ్యాక్ గ్రౌండ్ అతనికి తెలియదు కాబట్టి అంతగా బాధ పడలేదు

(ఇంకా ఉంది)

## నవ్వుతూ చావాలి బ్రదర్!

అమెరికాకు చెందిన విలియమ్ గిలెట్ అనేనటుడు ఒక చిత్రంలో తాను చనిపోయే ఒక విషాదకరమైన దృశ్యంలో నటించవలసి వచ్చింది కాని ఆ దృశ్యాన్ని చిత్రీకరిస్తున్నప్పుడు శ్రీ గిలెట్ నవ్వుతూ నటించడం మొదలెట్టాడు దాంతో ఆ దృశ్యాన్ని చిత్రీకరిస్తున్న దర్శకునికి శ్రీ గిలెట్ వింతపోకడ మీద తీవ్రమైన ఆగ్రహం వచ్చేసింది ఎన్నిసార్లు చెప్పినా ఈ సన్నివేశంలో మీరిలా నవ్వుతూ నటించడం ఏమంత బాగుండలేదు సహజసిద్ధంగా కూడా లేదు. మీరు దుఃఖపూరితంగా నటించాలని గట్టిగా మందలించడం కూడా జరిగింది

వెంటనే గిలెట్ ఎంతో సీరియస్‌గా అయ్యా డైరెక్టర్‌గారూ మీరిచ్చే పారితోషికంతో నిక్కచ్చంగా బ్రతకటంకన్నా ఇలా నవ్వుతూ చావడమే చాలా మేలనుకుంటున్నాను నేను అని అనడంతో ఆ ప్రాంతమంతా నవ్వులమయం అయిపోయింది

# విద్యార్థుల్లో అశాంతి ఎందుకు?

## లోభమే కారణం



ఏలూరిపాటి అనంతరామయ్య,
ప్రిన్సిపాల్,
కె వి కె సంస్కృత కళాశాల, గుంటూరు

తపస్సూ, ఇంద్రియ నిగ్రహమూ, శాంతికి కారణాలని వీటి కన్నింటి కంటే లోభాన్ని విడిచి పెట్టటం గొప్ప కారణమని మహాభారతం చెప్తున్నది

తపస్సంటే, మనస్సూ, వాక్కూ చేతలూ, అదుపులో వుండటం

ఇంద్రియ నిగ్రహమంటేనూ లోభము విడిచి పెట్టటం అంటేనూ అందరికి తెలిసినదే

ఎవరూ పరిపూర్ణంగా శాంతులు కారు, కారణం పై విషయాలతో ఎవరూ పరిపూర్ణులు కాకపోవటమే అయితే పరిపూర్ణులు కావటానికి ప్రయత్నం చేయాలి ఇప్పటి సమాజానికే పై ఆదర్శాల పట్ల లక్ష్యం లేదు ప్రతివారూ ఎవరి ఆలోచనలో అనుసరిస్తూ, ఎవరి పలుకులో, పలుకుతూ, ఎవరు చేయమన్నట్లు చేస్తున్నారు చూడకూడనివి చూస్తున్నారు, వినకూడనివి వింటున్నారు, తినకూడనివి, త్రాగకూడనివి, తింటున్నారు, త్రాగుతున్నారు దీనికంతటికీ కారణం లోభం పెరిగిపోవటం ఉద్యోగమో, వ్యాపారమో, సక్రమమో, అక్రమమో ధనము సంపాదించటం నిలవ వేసుకోవటం ఒకటే పరమార్థమయి పోతున్నది విద్యార్థులు సమాజాన్ని అనుసరిస్తున్నారు కనుక శాంతి కరవైపోతున్నది అమాయకులైన విద్యార్థులను రాజకీయ పక్షాలు ఎరలు చూపి నిర్దాక్షిణ్యంగా స్వలాభం కోసం వాడుకొని బలి చేస్తున్నాయి

పార్టీలు మారినా ప్రభుత్వాలు మారినా నాయకులు పాడుకారు పాడైపోరు పోయేది ఏ పార్టీవారైనా వీధులలో కేకలు వేసే వెర్రి మొర్రి అమాయకజనమే అలాగే విద్యార్థులకు విద్య రాకుండా అశాంతి వారిలో పెరిగేటట్లు చేసినందున పాడైపోయేది అమాయకవిద్యార్థులే పార్టీలు కాదు అన్ని రాజకీయ పక్షాలూ కలిసి దేశక్షేమం కోసం మనం విద్యార్థుల జోలికి వెళ్ళకుండా వుండాలి అని నిర్ణయించుకున్న నాడు విద్యార్థులలో శాంతి తప్ప అశాంతి వుండదు ●

# నీకిష్టమైన రంగు నీ రంగు బయట పెడుతుంది!

'శ్రీ విరించి'

సాధారణంగా మనకు రంగులంటే ఇష్టం. ఒక్కో మనిషి ఒక్కో రంగును ఎక్కువగా యిష్టపడతాడు. ఒక్కో రంగును అయిష్టంగా చూస్తాడు.

ఈ యిష్టాలు, అయిష్టాలకు మధ్య ఆ మనిషి వ్యక్తిత్వం ప్రస్ఫుటం అవుతుందా?

ఫలానా రంగు నాకు యిష్టం-అనే మనిషికి నీ మనస్తత్వం 'యీ విధం'గా వుంటుంది, అని చెప్పటానికి వీలున్నదా? ఉన్నది- అంటారు మానసిక శాస్త్రవేత్తలు.

అన్ని రంగులూ 'తెలుపు'లో నుండే పుడుతున్నాయి. అవన్నీ మళ్లీ తెలుపు లోనే లీనం అవుతున్నాయి. అయినా ఒక్కో రంగు తాత్కాలికంగానో, శాశ్వతంగానో మనకు యిష్టం-అయిష్టం అవుతోంది,ఇందులో సందేహం లేదు.

ఇష్టా యిష్టాల వెనుక దాక్కొని వున్న వ్యక్తిత్వాన్ని, మనస్తత్వాన్ని పరిశీలించడం అన్నది ప్రత్యేకమైన 'విద్య'.

ఈ 'విద్య' చెబుతున్న కొన్ని మామూలు విషయాలు ఇప్పుడు ప్రస్తావించు కుందాం.

**కింద చెప్పిన రంగులు చూడండి:**

**ఎరుపు- నీలం- ఆకుపచ్చ- పసుపుపచ్చ- బూడిద- ఊదా- గోధుమనలుపు.**

**వీటిలో మీకు ఏది ఎక్కువ యిష్టం. ఆ సంగతి ముందుగా తేల్చుకోండి.**

**ఈ రంగు లేదనుకొని మిగతా రంగుల్లో మీకు ఏది యిష్టం- అన్న సంగతి కూడా మీరు గమనించండి.**

**అన్ని రంగులలోను మీకు ఎక్కువ అయిష్టం అయిన రంగు ఏది?-**

**ఇది గూడా గుర్తించండి.**

**అంటే మీరు మూడు రంగులు ఎంచుకుంటున్నారన్నమాట.**

ఎక్కువ యిష్టమయినది, తక్కువ యిష్టం అయినది, ఏ మాత్రమూ యిష్టము లేనిది.

ఇప్పుడు ఈ మూడు 'ఎంపిక'ల అర్థం యేమిటో గమనించండి

**మొదటి ఎంపిక:**

**ఎక్కువ యిష్టం అయినది:**

ఎరుపు : మీరుఎక్కువ ఉద్వేగపరులు, తీవ్రమైన వాంఛలు వున్నవారు చురుకుగా, వేగంగా, విజయవంతంగా పనిచేస్తారు. మీరు చేస్తున్న పనికి 'తక్షణ ఫలితం' వస్తుంది మీరు త్వరగా 'నిర్ణయాలు' తీసుకుంటారు ఈ నిర్ణయాలు సమంజసం అయినవా-కాదా అనేది వేరే విషయం.

పది మందితో విచ్చలవిడిగా మెలగడం, రకరకాల అభినందనలకోసం చూడడం మీకు యిష్టం. వంటరితనం మీరు భరించలేరు మీ వైఖరి, విధానం, రాగభావాలు తరచుగా మారిపోతూ వుంటాయి. మీకు యేదయినా 'అపజయం' కలిగితే, దానికి కారణం 'యితరులు' అనే మీ ఉద్దేశ్యం.




నీలం:మీకు జీవితంలో విలువలు, నిజాయితీ, నమ్మకం అంటే ఎక్కువ శ్రద్ధ. ఎప్పుడూ సమరసము, ప్రశాంతము అయిన పరిసరాలు కావాలనుకుంటారు తెలియని వాళ్లతో కలిసికట్టుగా పని చేయడానికి జంకుతారు. రోజువారీ పనుల్లో, మాట్లాడడంలో, వ్రాయడంలో, దుస్తులు ఎంపికలో చాలా జాగ్రత్తగా వుంటారు. అన్ని పనులు తాపీగా, నిదానంగా, శ్రద్ధగాచేస్తారు మీకు 'అహంకారం', 'స్వావలంబనం' ఎక్కువ. ఇతరుల్ని నమ్ముతారు. ఈ నమ్మకాలు 'వమ్ము' అయితే సహించలేరు. కొత్త పనులు ప్రారంభం చేయడానికి ధైర్యం చాలదు. ఉన్నది చాలునుతే, ఇంతకంటె భాగ్యమా.. అన్నట్లుగా మీకు మీరే పరిమితులు విర్పరచుకుంటారు.

ఆకుపచ్చ: ధైర్య, స్థైర్యాలు, తూకం, ప్రారంభించిన పనిని పూర్తి చేయాలనే పూనిక వుంటాయి మీకు బాగా చదువుకున్న వాళ్లు, లోకవ్యవహారం ఎరిగిన వాళ్లు, ఆప్యాయత కనబరచగలవాళ్లు-అయి వుంటారు మీరు. సాంఘిక సేవ ఎక్కువ యిష్టం. పది మందికి పనికివచ్చే పనులు చేయడంలో, అటువంటి సంస్థలతో కలిసి వ్యవహరించడంలో మీకు మక్కువ. ఏ పని అయినా నైతికంగా సబబయినదా కాదా అని మీరు ఆలోచిస్తారు. నిజాయితీలేని పనులు మీరు చేయరు.

ఇతరుల నుంచి ఈ నిజాయితీ విషయంలో 'సపోర్టు' ఆశిస్తారు మీరు. కుటుంబం మీకు మంచి అసరా యిస్తుంది. మీ విజయాలకు ఆశయాల సాధనకు కుటుంబ సభ్యులు మీకు అసరా యిచ్చేట్లు చూసుకుంటారు.

పసుపుపచ్చ: తాత్విక వ్యవహారాలకు ఈ రంగు సంకేతం. మీరు ఎక్కువ వాదబలంతో వ్యవహరిస్తారు. కొత్త కొత్త ఆలోచనలు మీకు ఎక్కువ మక్కు-

వ. ఊహాలు, ఆలోచనలు, సృజనాత్మకత, కళాత్మక వ్యవహారాలు మీకు నచ్చుతా-యి. మీరు నికార్సయిన ఆలోచన-లు చేస్తారు. అయితే మీ ఆలోచనల-ను యితరులతో పంచుకోడానికి మాత్రం జంకుతారు.ఈ జంకు సంశయంవల్ల మీకు ఒంటెత్తు మనుషులు అని పేరు వస్తుంది. మీరు పైకి కనిపించే పనులు చేయడానికి ముందుకు వెళ్లలేరు ఆలోచనలు, ఊహా-పోహలు తగ్గించి, యితరులతో సంప్రదిం-చడం ఆరంభిస్తే మీకు చాలా మంచిది అవుతుంది.

గోధుమ రంగు : మీ పనులకు సర్వదా మీరే బాధ్యత తీసుకుంటారు. భక్తి శ్రద్ధలతో పనిచేస్తారు. అయితే ఇతరులు మిమ్మల్ని బాగా వాడుకుంటారు. అలవా ...ు చాలా ప్రమాదకరమైనది. మిమ్మల్ని ...ందించిన వారిని, తోసిపుచ్చినవారిని మీరు ...లికగా క్షమించేసి వాళ్ల వలలో పదేపదే ...డిపోతూ వుంటారు. వాళ్లు మీ డబ్బు ...జేస్తారు.

మీరు కుటుంబ క్షేమానికి, సౌభా-...్యానికి ఎక్కువ విలువ ఇస్తారు.

~~నలుపు : ప్రశాంతత, గాంభీర్యము~~ ...ముద్ర

ఇప్పుడు వున్న పరిస్థితులు మీకు చాలా ...నామోదకరంగా వుంటాయి.

మీరు మీ అసలు స్వరూపాన్ని అతి ...రచుగా ముసుగులోనికి నెట్టి, బయటికి ...ేరు మనిషిలాగ ప్రవర్తించాలని ప్రయత్ని-...్తారు ఇతరులను ఎక్కువగా ఆకట్టుకో-...ాలని చూస్తారు

మీరు సహజంగా తెలివయినవారు. కొన్నిమార్లు కుయుక్తులు కూడా వేస్తారు. వ్యంగ్య ధోరణి మీ సహజ ప్రవృత్తి.

ఊదారంగు : మీరు ప్రత్యేకతరహా మనుషులమనీ యితరులకంటే విభిన్న-మైనవారమనీ మీ వుద్దేశ్యం. అది సర-యినమాటే. సున్నితమయిన మనస్తత్వం, పరిశీలన శక్తి, వ్యక్తిగత విషయాలలో అతి సూక్ష్మత వుంటాయి మీకు.మీ చింత-లు, ఆలోచనా ధోరణులు ప్రధానమైన-విగా కనిపిస్తాయి మీకు అంతా సవ్యంగా జరుగుతున్నంత సేపూ సరే, ఏ మాత్రం వ్యత్యాసం అగుపించినా, మీరు విమర్శలు ప్రారంభిస్తారు. నిజంకంటే ఊహాగానం ఎక్కువ యిష్టం. ఇతరులతో సంబంధాల-తో అంటీ ముట్టనట్లుగా వుండడమే మీ




పద్ధతి కళాత్మకత అయితే వున్నదిగాని, దానిని విస్తరింపజేసుకుని పనులు సమకూ-ర్చుకొనడం మీకు చేతకాదు. అంతరంగ స్నేహితులదగ్గర అప్పుడప్పుడు మనసు విప్పి మాట్లాడుతారు. ఇతరులకు ఏ మాత్రమూ అర్థంకాని మనిషి మీరు

బూడిదరంగు : మీరు అంటీ ముట్టని మనుషులు. రోజువారీ కార్యకలా-పాల నుంచి దూరంగా వుండాలనుకుంటా-రు అనాసక్తంగా వున్నా, అన్నీ గమనిస్తూ వుంటారు ప్రశాంతత అంటే యిష్టం మీకు. పరిసరాలు నిశ్శబ్దంగా వుండాలి. జీవితంలో వచ్చే ఒడిదుడుకులు మిమ్మల్ని అతలాకుతలం చేస్తాయి

## రెండో ఎంపిక:

## అంతంత మాత్రం యిష్టం

ఎరుపు : కార్యశీలత ఎక్కువ మీకు. సాహసంతో కూడిన పనులు చేసి విజయం సాధిస్తారు

నీలం : ఎలాంటి చీకాకులు లేని,




సమరసము- ప్రశాంతము అయిన జీవన విధానం మీది.

ఆకుపచ్చ : పేరు ప్రతిష్టలమీద ఎక్కువ మక్కువ మీకు మీ అభిప్రాయా-లు, ఆలోచనలు ఇతరులు తప్పనిసరిగా ఆమోదించాలనుకుంటారు.

పసుపుపచ్చ : ప్రతిమారూ మీకు కొత్త ఆలోచనలు, కార్యరంగం అనుకూలం అనిపిస్తాయి. భవిష్యత్తుకోసం అంగలారు-స్తారు.

ఊదా : మీకు ఇష్టమయిన మను-షులను మీరు ఆకర్షించగలుగుతారు.అను-కూల వరుచుకుంటారు

గోధుమ : శారీరకంగా, మాన-సికంగా పరిపూర్ణమయిన భద్రత కోసం విపరీతంగా కృషి చేస్తారు మీరు.

నలుపు : మీకు ఇతరులు మిమ్మల్ని లోగొనాలనుకోవడం, చెప్పుచేతలలో వుంచు కోవాలనుకోవడం గిట్టదు.

బూడిదరంగు : మీరు జీవితంలో సుఖసంతోషాలను, జీవితపు ఒత్తిడులను తిరస్కరిస్తారు. సరకుచేయరు

ఇప్పుడు మీరు ఏ మాత్రమూ యిష్ట-పడక, తిరస్కరించిన రంగులు, వాటి ఫలితాలు చూడండి

ఎరుపు : మీకు జీవితంలో నిరా-శ, నిస్పృహలు ఎక్కువ ఎంత పని-చేసినా ఎవరూ మెచ్చుకోవడంలేదని మీ వాదం. నిస్సహాయత మిమ్మల్ని లోగొం-టుంది ఆదుర్దాలు, సంభ్రమాలతోనే గడుస్తుంది మీ కాలం అంతా.

నీలం : జీవితం అంటే నిరాశ, ఇంకా విస్తృతమైన సుఖకరమైన జీవితం కావాలి మీకు. హద్దులు మీరి పనిచేస్తారు. చేతకాక బోర్లా పడతారు. ఎంతో ఉబ-లాట పడతారు. నాటకీయంగా ఏమయినా పనులు చేయాలని, ఉద్యోగం వదిలివేయ-డం, మనుషులతో దూరం అయిపోవడం, యిలాంటివి. అయినా ఇలాంటి పను-లు చేయకూడదని మీ అంతరంగం మరో మూల ప్రకంపనం వుండనే వుంటుంది. మీ నిరాశలు మీకు వ్యతిరేకమయిన ఫలితాలనే యిస్తాయి

పసుపుపచ్చ : మీరు నిరాశా-వాదులు- మీ ఆశలు, కలలు ఫలించని కారణం యిది. మామూలు ఆలోచనలు, కార్యకలాపాలతోనే జీవితానందం వున్నది మీరు అందరికి అందుబాటులో వున్నా సామాన్య అంతస్తులే గమ్యంగా పెట్టు-

# నీకిష్టమైన రంగు నీరంగుబయట పెడుతుంది!

కుంటారు అయినా వాటిని అందుకోలే-మేమోనని భయపడుతూ వుంటారు

ఊదారంగు ముక్కుసూటి మనుషులు మీరు డాంబికులంటే మీకు అయిష్టం అందుకే మిమ్మల్ని యితరుల 'వేరుగా' అంచనా వేస్తారు ఏదయినా పనిలో మునిగిపోయే ముందు, ఆ పని స్వరూప స్వభావాలు ఏమిటి- దాని ఫలితం ఏమిటి- అన్నది మీరు ఆలోచిస్తారు

పచ్చరంగు మీరు 'నికా-ర్స'యినమనుష్యులమని మీ ఉద్దేశ్యం మీకు పరిగణన రావడం లేదన్న శంక కూడా ఉన్నది చుట్టుపక్కలవారిని మీరు మోస-గిస్తారు నిజాయితీగా వుండరు ఎంతో జాగ్రత్తగా వ్యవహరిస్తున్నట్లు కనిపించడంవల్ల యితరులు మీ వద్ద దూరం దూరంగావే వుంటారు. మి భయము, సందేహము, మీకు యిబ్బందులు తీసుకువస్తాయి.

గోధుమరంగు : అందరూ మిడి-మిడి జ్ఞానం కలవాళ్లని మీకు విసుగు. సంఘంలో పైకి రావాలనీ, పేరుతెచ్చుకో-వాలనీ మీకు ఎంతో ఉబలాటం. తొందర-




పాటు జాస్తి నిదానంగా వ్యవహరించేవాళ్ల పట్ల అశ్రద్ధ, చికాకు కనబరుస్తారు ప్రతి-దానికి ముందుగా వుండి, జీవితం యిచ్చే మార్గదర్శనాన్ని అందుకోవాలను కుంటా-రు.

బూడిదరంగు : మీకు ఏ పనికీ ఉత్సాహంలేదు. ఆసక్తి లేదు. మీకు ఏం కావాలో మీకే తెలియదు. ఈ అస్పష్టత మీ ప్రవర్తనలో కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది.

క్షణికోద్రేకంతో నిర్ణయాలు తీసుకుంటారు తరువాత విచారిస్తారు దురదృష్టం వెతు-క్కుంటూ ముందుకు అడుగులు వేస్తారు

నలుపు ఇతరుల అధికారం అంటే మీకు అసహ్యం మీరు దృఢనిశ్చయులు ఎవరికీ లొంగరు ఎదురు నిలిచిన వారిని కలియబడి పోరాడుతారు 'నా జీవిత-గతిని నేనే నిర్ణయించుకుంటాను' అన్నంత సూటిగా వుంటాయి మీ చర్యలు

రంగుల రకరకాలు- ప్రవర్తన తీరులు చూసాం వాటిని గమనించి మన ఆలో-చనా ధోరణిలో , ఆచరణ పద్ధతులలో ఏదయినా మార్పులు రావలసివున్నదా- అని చూచుకోడం మన పని

'నేను ఇలాగే వుంటాను' అని యే మనిషీ మడికట్టుకుని కూచోలేదు ఇత-రులకోసం, తనకోసం మారవలసిన అవస-రం 'సంఘజీవి' అయిన మనిషికి వున్నది. ఈ మార్పు యే దిక్కుగా రావాలో మన మనస్తత్వం సూచనగా తెలుపుతుంది. అంతవరకే దాని ప్రయోజనం.



## దేనికైనా 'రెడీ' అంటున్న మోనాలి

హిందీ సినిమాల్లో నటించాలనే కుతూహలంతో ఖాట్మండు నుంచి బొంబాయి మహానగరానికి వచ్చిందట నాజూకైన సెక్సీతార ఆమె పేరు మొనాలి (అసలు పేరు మంజు సింగ్)

రోషన్ తనేజ, మధుమతిల వద్దశిక్ష-ణ పొందిన ఈ తార ఏ పాత్రకైనా రెడీ అంటోంది తనకిచ్చిన పాత్రను ఛాలెంజ్ గా తీసుకొని న్యాయం చేకూరుస్తానంటోంది

నిర్మాతలు టి రామారావు, సావ్య కుమార్ తక్, పహ్లాజ్ నిహలానీ, కేవ-ల్ పి కాశ్యప్ లంటే ఆమెకు యిష్టంట తన ఒంపు సొంపులను బహిర్గతం చేసే విషయమై అడిగినప్పుడు ఆయా పాత్ర-లను బట్టి అందుకు తాను సిద్ధమేనని గ్రీన్ సిగ్నల్ యిచ్చిందట అసలు ఈ పిల్ల మామూలుగానే ఫొటోలో వున్నట్లు వుంటుంది మరి సినిమాల్లో నటించటానికి యిక అడ్డేముంది ఓ కె నే!

# నిర్ణయం

ఆమె మనసంతా తీరని వేదన, మనసు అశాంతితో నలిగిపోతోంది తన వేదన ఎవరితో చెప్పుకోగలదు? అందరూ తననిచూసి హేళనచేసేవారే తప్ప తనమీద సానుభూతి చూపించేవారెవరు? తన బాధ తనలోనే దాచుకోవాలితప్ప, నోరు విప్పి ఎవరితో చెప్పుకోగలదు! అసలు ఆత్మాభిమానంగల ఆడపిల్ల, నోరువిడిచి ఆ సంగతి చెప్పుకోగలదా!

ఆమె ఆలోచనలు గతంవైపు మళ్ళాయి అప్రయత్నంగా!

తను పుట్టిన దగ్గరనుండి దురదృష్టవంతురాలే! ఏనాడూ తనని అదృష్టం వరించలేదు పెళ్ళయి అత్తవారింటికి వెళ్ళాకన్నా తన అదృష్టం బాగుంటుందేమో అనుకుంటే, ఈ జీవితంలో తనకి పెళ్ళిజరిగే ఆశేకన్పించడంలేదు

తన వయసు ముప్ఫైవసంతాలు దాటుతున్నా తనింకా అవివాహితే తనకి పదేళ్ళ వయసులోనే తండ్రి మరణించాడు పెళ్ళికాని తననిచూసి విచారించే తల్లి, తన స్వార్థం తనుచూసుకొని వేరుపడిపోయిన అన్నయ్య, కుటుంబభారాన్ని భుజాలకెత్తుకున్న తమ్ముడు, గుండెలమీద కుంపటిలా పెళ్ళికెదిగిన చెల్లెలు యిదీ తన కుటుంబం

తండ్రిపోయాక అమ్మే కష్టపడి తనని ఇంటర్ వరకు చదివించింది అన్నయ్యకి పెళ్ళిచేసింది మమ్మల్ని పెంచిపెద్దచేసేసరికి,అమ్మకి జవసత్వాలు డిగిపోయాయి నాన్న లేరన్న బాధ అప్పుడు ఆమెను నిత్యం వేదిస్తుండేది ఇంతలో పెళ్ళికెదిగిన నన్నుచూసి మరీ బెంగపడిపోయేది అన్నయ్య ఎలాగో డిగ్రీ పూర్తిచేశాడు అమ్మ జబ్బుపడడంతో, ఇంటి బాధ్యత పూర్తిగా తన భుజాలమీదపడింది

అప్పట్లో నిరుద్యోగిగావున్న అన్నయ్య, చిన్నవాళ్లైన తమ్ముడు, చెల్లి, జబ్బుతో మంచానపడ్డ అమ్మ వీళ్ళనిచూసేసరికి తనకి పెళ్ళి విషయమే గుర్తుకివచ్చేదికాదు తనకి వయసు వచ్చినా, కానీ కట్నంలేకుండా ఎవరు పెళ్ళి చేసుకుంటారు? కట్నం ఇచ్చి పెళ్ళిచెయ్యాలంటే, అప్పటికే వున్న ఆస్తి అంతా అక్కయ్య పెళ్ళికి, మా చదువులకి సరిపోయింది

అన్నయ్య ఎక్కడో కోమటిపద్దులు వ్రాసేవాడు తమ్ముడు పదో తరగతి చదువుతుండేవాడు చెల్లి ఏడో క్లాసులోనే వుండేది అన్నయ్య తెచ్చే కొద్దిపాటి జీతంతో ఇల్లు గడవడం కష్టమయ్యేది అమ్మ జబ్బుపడడంతో మిషన్ మూలపడింది తనే బలవంతంగా అమ్మని ఒప్పించి, మిషన్‌కుట్టేది తను కష్టపడడం అమ్మకి యిష్టంవుండేదికాదు కానీ కుటుంబం గడిచేమార్గంతోచక, తను బట్టలు కుట్టడానికి అంగీకరించింది అమ్మ

అదృష్టంకొద్దీ ఆ తర్వాత, అన్నయ్యకి గవర్నమెంటు ఉద్యోగంవచ్చింది దాంతో మా కష్టాలు తీరాయనుకున్నాం రెండుపూటలా సుష్టుగా భోజనంచెయ్యొచ్చు అనుకున్నాం

కానీ ఉద్యోగం రావడంతోనే అన్నయ్య, ఒక అమ్మాయిని వెంటబెట్టుకొని ఇంటికివచ్చాడు

అమ్మా! నేను రజని ప్రేమించుకున్నాం నువ్వు ఒప్పుకోవేమోనని రిజిస్ట్రారు ఆఫీసులో ఇద్దరం పెళ్ళిచేసుకొన్నాం మమ్మల్ని ఆశీర్వదించమ్మా! అన్నాడు అన్నయ్య

ఒరేయ్ మధూ! ఏమిటి నువ్వుచేసినపని? నీ కన్నా చిన్నదైన చెల్లెలు వుందన్న సంగతి మరచిపోయావా? అంది అమ్మ కోపంగా

"అమ్మా! నేనేం అంత ఒళ్ళుమరచిపోలేదు రజనిని ప్రేమించాను పెళ్ళిచేసుకున్నాను నామూలంగా, చెల్లెలిపెళ్ళి ఆగిపోదు

ఎందుకు ఆగిపోదురా! నీకు వచ్చే కట్నంతో దాని పెళ్ళిచెయ్యాలనుకున్నాం ఇప్పుడు నువ్విలాగచేస్తే యిక దానికి పెళ్ళి ఎలాగవుతుందిరా? అంది అమ్మ ఏడుస్తూ



# రీగన్ యోధుడు



ఇదేదో స్టార్‌నైటో, సంగీత విభావరో కాదు... అమెరికా అధ్యక్షుడు శ్రీ రోనాల్డ్ రీగన్‌కు బ్రిటన్‌లోని గౌరవప్రదమైన నైట్ బిరుదు లభించిందట

ఈ బిరుదును బ్రిటిష్‌రాణి యిటీవల ప్రకటించారు రీగన్‌కు ఈ గౌరవం లభించటం అమెరికా పౌరులకు ఆనంద దాయకం కాగలదు కదూ!

'బకింగ్‌హామ్' రాజప్రాసాదంలో జరిగిన ఒక కార్యక్రమంలో శ్రీ రీగన్ సతీసమేతంగా హాజరై ఈ బిరుదు స్వీకరించారట ఈ బిరుదు ప్రదానం చేసేందుకు బ్రిటిష్‌రాణి చేసిన ఎంపిక సమంజస మైనదేనంటున్నారు ప్రముఖులు

దానికి పెళ్ళి కాదని నేను మనసిచ్చిన అమ్మాయి బ్రతుకు నాశనం చెయ్యాలా! నువ్వెప్పుడు అంతగా విచారించవలసిన పని లేనేం చెయ్యలేదు దాని పెళ్ళి నేను చేస్తాను అన్నాడు అన్నయ్య భరోసా ఇస్తున్నట్టుగా!

అమ్మా! శుభంగా పెళ్ళి చేసుకొని వచ్చిన అన్నయ్యని ఎందుకలా నీ ప్రశ్నలతో వేదిస్తావు? ఇప్పుడు నా పెళ్ళికేం తొందర? ముందు క్రొత్త కోడలిని లోపలికి తీసుకు వెళ్ళు అని హారతి పళ్ళెం పట్టుకు వచ్చి వదినకి తన చేతులతో హారతి ఇచ్చింది

ఇక చేసేది లేక అమ్మ మౌనంగా ఊరుకుంది

* * * *

అన్నయ్యకి పెళ్ళి జరిగి సంవత్సరం గడిచిపోయింది ఈ సంవత్సర కాలంలోనూ కుటుంబ పరిస్థితులు ఏమాత్రం మెరుగుపడలేదు పైగా ఇప్పుడు అన్నయ్య ఒక బిడ్డకి తండ్రి అయ్యాడు పసివాడి పాల డబ్బాలకి మందులకి అదనంగా ఖర్చు పెరిగిందే తప్ప రాబడి పెరగలేదు

చేతిలో డబ్బు లేకపోవడంతో అన్నయ్య ఎప్పుడూ చిరాకుగా ఉండేవాడు సరి అయిన మందులు లేకపోవడంతో అమ్మ అనారోగ్యం తిరగబడింది ఈ పరిస్థితిలో తమ్ముడి చదువు ఇంటర్‌తోనే ఆగిపోయింది

ఇకపోతే వదినది అందరితో కలివిడిగా ఉండే స్వభావం కాదు మీ సంపాదనంతా ఈ కుటుంబానికే ధారపోస్తున్నారు ఇక నాకు నా పిల్లలకి చిప్పే మిగులుతుందని అన్నయ్య దగ్గర ఎన్నోసార్లు అనేది

వదిన బోధల ప్రభావమో లేకపోతే అన్నయ్యలో స్వార్థం పెరిగిపోవడమో గాని అన్నయ్య పూర్తిగా మారిపోయాడు ఇప్పుడన్నయ్యకి తల్లి తమ్ముళ్ళు చెల్లెళ్ళు యమపాశాల్లా కనిపిస్తున్నారు సాధ్యమైనంత త్వరలో ఈ ఇంటి నుండి వేరుపడి పోవాలని వదిన చెప్తుంటే ఆమె మాటలకు ఏమి జవాబు చెప్పకుండా మౌనంగా ఆలకించేవాడు

ఆ తరువాత కొన్నాళ్ళకి అన్నయ్యకి ఆ ఊరు నుండి ట్రాన్స్‌ఫర్ అయ్యింది అసలు అన్నయ్యకి ఇప్పట్లో బదిలీ కాదు కానీ డబ్బు ఖర్చు పెట్టి కావాలని వేరే ఊర్లో వేయించుకొన్నాడు

అన్నయ్య తనతో మమ్మల్నందర్నీ తీసుకు వెళ్తాడనుకుంది అమ్మ కానీ అన్నయ్య తనతో పాటు ఎవ్వరిని తీసుకు వెళ్ళడానికి ఇష్టపడలేదు పైగా తమ్ముడికి ప్రైవేటు కంపెనీలో చిన్న బంట్రోతు ఉద్యోగం చూపించి మీరంతా నాతో వస్తే చాలా ఇబ్బందిపడతారు నేను వెళ్ళబోయేది పల్లెటూరు అక్కడ సదుపాయాలు ఉండవు పైగా చిన్న చెల్లెలు చదువు ఆగిపోతుంది అనడంతో అమ్మ మరి మాట్లాడలేదు

అలా అన్నయ్య వేరుపడిపోయాడు

* * * *

కాలగమనంలో మరో ఐదేళ్ళు సునాయాసంగా గడిచిపోయాయి ఈ ఐదేళ్ళ కాలంలో అన్నయ్య మరి ఇద్దరికి తండ్రి అయ్యాడే తప్ప బాధ్యతలేవీ పట్టించుకోలేదు

ఇంటి ఖర్చులకి వందా రెండు వందలు తనకు తోచినప్పుడు ఇచ్చి వెళ్తూ ఉండేవాడు

మదూ! ఏమన్నా అంటే నీకు కోపం గాని మైథిలి పెళ్ళి గురించి అసలు నువ్వు పట్టించుకుంటున్నావా! ఇప్పటికే దానికి పాతిక సంవత్సరాలు దాటిపోయాయి. రెండోది కూడా పెళ్ళికి ఎదిగివచ్చింది. ఇంకా పెద్ద దానికి పెళ్ళి చెయ్యకపోతే, లోకం ఏమనుకుంటుంది చెప్పు?" అనేది అమ్మ.

"అమ్మా! చూస్తున్నావుగా! నాకు ఆఫీసు పనితోనే తీరుబడి ఉండడంలేదు. ఇంక సంబంధాల కని నేనెక్కడికి తిరగగలను? అక్కడికీ నాకు తెలిసిన వాళ్ళతోనే చెప్తున్నాను, సంబంధాల గురించి. ఇంతకన్నా నేనేం చెయ్యగలను? దానికి మీరే ఏదయినా సంబంధం కుదిర్చితే, నా వాటాగా కట్నంలో సగం డబ్బు ఇస్తాను". అనేవాడు.

ఇక అమ్మ ఏమి బదులు చెప్పలేకపోయేది.

అక్కయ్యే తనకు ఏవో సంబంధాలు చూసేది. కానీ తనకి కల్యాణ రాత లేదో, తన దురదృష్టమో గానీ ఏ సంబంధమూ కుదరలేదు అమ్మ ఆరోగ్యం రోజు రోజుకీ దిగజారిపోసాగింది

తమ్ముడి సంపాదనతో అంతంత మాత్రంగా ఇల్లు గడిచేది చెల్లెలు పూర్ణిమ ఇంటర్ పూర్తి చేసింది ఇక ఆపైన చదివించే స్తోమతు లేక అంతటితోనే చదువు ఆపేసారు

తనకి ఇంటి పని వంట పనితో రోజంతా గడిచిపోయేది పూర్ణిమ కాన్వెంట్ పిల్లలకి ట్యూషన్స్ చెప్తూ వదో వరకో సంపాదించేది

కాలం ఎవరి కోసమూ ఆగదు తనలో వయసు తెచ్చిన వన్నెలు కళలు తరగిపోతుంటే చెల్లెలి వికసించిన యవ్వనంతో నిండుగా కన్పించేది

అప్పుడే ప్రారంభమైంది తనలో మానసి సంగ్రామం

అసలు ఈ జీవితంలో తనకు పెళ్ళి అవుతుందా అన్న ఆలోచన తనని మరింత కృంగదీసేది

దానికితోడు ఇరుగు పొరుగువాళ్ళ హేళ మాటలు తేలిక చూపులు తన మనసుని చిత్రవ చేసేవి ఎక్కడికి వెళ్ళినా నీకింకా పెళ్ళి అవలేదా అయ్యో పాపం అని ఒకరు అసలు జీవితాంత ఇలాగే ఉండిపోతావా పెళ్ళి చేసుకోవా! అ మరొకరు నీకు కాకపోతే మీ చెల్లెలి కన్నా పె చెయ్యరా! అని ఇంకొకరు తన ముఖా అడుగుతుంటే ఆ క్షణంలో తనకి చచ్చిపో లనిపించేది

పెళ్ళికాకపోవడం తన నేరమా! తను కోవాల మానేసిందా! తనకి మాత్రం పెళ్ళి చేసుకొ ఇల్లాలుగా మారాలని ఉండదూ ఈ సమాజం పెళ్ళికాని ఆడపిల్లను ఎంత చిన్న చూపు చూస్తా ప్రత్యక్షంగా తెలుసుకున్నాను కానీ కానీ స్వతంత్రించి తన పెళ్ళి తనే చేసుకోలేదు క మొదటి నుండి సత్సంప్రదాయం గల ఇంట్లో పు పెరగడం వల్లో తనకు తెగించే గుణం లేకపోవ వల్లో తనని ప్రేమించిన వాడిని కూ తిరస్కరించింది

అంతవరకు ఆడదానికి పెళ్ళి జీవితంలో ఒక బా

మాత్రమే అనుకున్నాను కానీ పెళ్ళే ఆడదానికి జీవితం అన్న నగ్నసత్యం బోధపడేసరికి, తనలో యవ్వనం అంతరించి పోసాగింది

అప్పటికే తనకి ముప్పైఏ సంవత్సరాలు దాటిపోయాయి

ఇక ఈ వయసులో పెళ్ళి జరుగుతుందన్న ఆశలేదు కానీ ఏ మూలో చిన్న ఆశ ఎప్పటికైనా తనకి పెళ్ళి జరిగి ఈ ఇల్లు దాటి వెళ్ళిపోవాలన్న ఆరాటం అన్నదమ్ముల నీడలో బ్రతకకూడదన్న ఆలోచన కానీ కానీ తన ఆశలని అడియాశలు చేస్తూ, తనని ఈ ఇంటికి శాశ్వత బందీని చేస్తున్నాను సుమా అన్నట్లు ఆ రోజు అన్నయ్య చెప్పిన సంగతి విన్న తర్వాత అర్ధమైంది

ఆ రోజు అన్నయ్య అమ్మతో చెప్తుంటే తను విన్నది

"అమ్మా! ఇంకా ఎన్నాళ్ళు దానికి సంబంధాలు చూస్తాం? ఇక దానికి జన్మలో పెళ్ళి అయ్యేటట్లు లేదు మన పూర్ణిమకి ఒక మంచి సంబంధం చూసాను పెళ్ళివారు దాన్ని చూసుకోవడానికి రేపే వస్తామన్నారు" అన్నాడు

ఆ మాట వినడంతో తన గుండె ఒక్కసారి దడ దడలాడింది అమ్మ ఏమంటుందోనని ఆత్రంగా వినసాగాను

"సరే నీ ఇష్టం ఇద్దరిలో ఎవరికి పెళ్ళి జరిగినా నాకు సంతోషమే" అంది అమ్మ

ఈ సంగతి తెలిసిన తమ్ముడు, చెల్లెళ్ళ ముఖాల్లో ఆనందం తాండవించింది ఎందుకో!

ఆ రోజు పూర్ణిమను చూడడానికి పెళ్ళి వారొచ్చారు

ఆ రోజు తనకి ఎంత ఆపుకుందామన్నా దుఃఖం ఆగలేదు మనసంతా ఏదో అలజడి తనకి ఈ జన్మలో పెళ్ళి కాదన్న నగ్నసత్యం కళ్ళెదుట నాట్యమాడుతుంటే, తన మెదడులో ఏదో తీవ్ర సంచనలం

పూర్ణిమకన్నా వయసులో ఆరేడు సంవత్సరాలు పెద్దదైన తను, ఈ ఇంటి గుమ్మం దాటక ముందే, పూర్ణిమకు పెళ్ళి జరిగి మరో ఇంటికి వెళ్ళిపోతుందన్న నిజం తన మనసుని చిత్రవధ చెయ్యసాగింది

అసలు ఆ రోజే అన్నయ్యని అడిగెయ్యాలనుకుంది

"అన్నయ్యా! పూర్ణిమకు పెళ్ళి జరిగితే, ఇక నా పెళ్ళి ఎలా జరుగుతుంది? ఇప్పటికే ఆలస్యమయిపోయిన నా పెళ్ళి ఇక శాశ్వతంగా ఆగిపోతుంది అసలు నన్ను ఏం చెయ్యదలచుకున్నావు? నా జీవితమంతా, నీకు పిల్లలకు సేవ చేస్తూనే కాలం గడపాలా!" అని

కానీ తనలో వివేకం తనని నోరెత్తనివ్వలేదు తన రాత బాగులేనప్పుడు, ఒకళ్ళని నిందించి ప్రయోజనమేమిటి? తనకి ఎటూ కళ్యాణ యోగంలేదు తన మూలంగా చెల్లెలి జీవితం కూడా నాశనం అయిపోతుంటే, చూస్తూ భరించే శక్తి తనకు లేదు

తను అన్నయ్యని నిలదీసి అడిగిన మరుక్షణం, అన్నయ్య దానికి కూడా సంబంధాలు చూడడం మానేస్తాడు పూర్ణిమ కూడా తనలాగ అమాయకురాలు సంప్రదాయాన్ని గౌరవించే మనిషి అందుకే తెగించి, దాని పెళ్ళి అది చేసుకోలేదు

తన మనసుని రాయి చేసుకొని, జీవితంలో కోరికలని శాశ్వత సమాధి కట్టి, చెల్లెలు పెళ్ళి జరిగితే, చూసి ఆనందించాలని ఆరాటపడింది కానీ కానీ జరిగిందేమిటి?

పూర్ణిమను చూడడానికి వచ్చిన పెళ్ళివారు, తనను చూసి ఈ అమ్మాయి ఎవరు? ఇంతవరకు ఆ అమ్మాయికి పెళ్ళి ఎందుకు చెయ్యలేదు? పెద్దపిల్ల ఉంటుండగా, చిన్న పిల్లకు పెళ్ళెందుకు చేస్తున్నారు?" అని నిలదీసి అడిగినప్పుడు అన్నయ్య ఏమీ చెప్పలేక మౌనం దాల్చాడు

"మా మైదిలికి సంబంధాలు చూస్తున్నాం కానీ ఇంకా ఏదీ కలిసి రాలేదు" అని నసుగుతూ సమాధానం చెప్పాడు

"అసలు ఆ అమ్మాయికింత వరకు పెళ్ళి

# మా పాఠకులకు విజ్ఞప్తి!





ప్రభుత్వం న్యూస్‌ప్రింట్ కాగితం ధరను 30 నుంచి 40 శాతం పెంచి వేయడంతో పత్రికల 'మనుగడ'యే కష్టమైపోయిందని పాఠకులకు యీపాటికే తెలుసు! చాలా పత్రికలు యీ వరకే ధరలను పెంచివేశాయి. ఆంధ్రసచిత్రవారపత్రిక రేటును కూడా తప్పనిసరి పరిస్థితులలో విడిపత్రి రు. 4 లకు పెంచక తప్పనిసరి పరిస్థితి వచ్చింది- జులై 14వ తేదీగల సంచిక నుంచి వారపత్రిక వెల రు. 4 లు. కొత్త చందారేట్లు కూడా యిక్కడ వేస్తున్నాము.

పాఠకులు, ఏజెంట్‌లు మమ్ము అర్థం చేసుకొని సహకరించాలని కోరుతున్నాము-

## ఆంధ్ర సచిత్ర వార పత్రిక

వారపత్రిక చందా వివరములు

| | ఏజెంటుద్వారా | పోస్టుద్వారా |
|---|---|---|
| 3 నెలలు | 52-00 | 56-55 |
| 6 నెలలు | 104-00 | 113-00 |
| 1సంవత్సరం | 208-00 | 226-00 |

అదే విధంగా జులై 16-31 సంచిక నుంచి "కలువబాల" విడిప్రతి వెల రు. 3-50లుగా చేయక తప్పలేదు

## కలువబాల

కలువబాల కొత్త చందా రేట్లు

| | ఏజెంటుద్వారా | పోస్టుద్వారా |
|---|---|---|
| 3 నెలలు | 21-00 | 22-50 |
| 6 నెలలు | 42-00 | 45-00 |
| 1సంవత్సరం | 84-00 | 90-00 |

ఇదివరకటి చందాదారులకు చందా కొత్తరేట్ల ప్రకారం సర్దుబాటు చేయటం-జరుగుతుంది.

-బిజినెస్ మేనేజర్





## రోదసీలో స్టేషన్

నక్షత్ర మండలాన్ని చేరుకునేందుకు మానవుడు వేయబోయే మరో ముందడుగులో భాగంగా రూపొందుతూ 1998 నాటికి సిద్ధం కానున్న అంతరిక్ష ఉపగ్రహాల స్టేషన్. 1985 అంతరిక్ష కార్యక్రమం సందర్భంగా ఈ కేంద్రం రూప కల్పనలో అనుసరించదగు సాంకేతిక పద్ధతులను నేర్చుకుంటున్న వ్యోమగామిని పై చిత్రంలో చూడవచ్చు. వ్యోమగామికి ప్రమాదం సంభవిస్తే అతన్ని ఆదుకునే "లైఫ్‌బోట్" కూడా వుంది

# నిర్ణయం

కాకపోవడానికి కారణమేమిటి? ఆ అమ్మాయి ప్రవర్తన మంచిది కాదా! అని సూటిగా అడిగినప్పుడు అన్నయ్య తల పాతాళంలోకి దిగిపోయింది

మీకు కావలసింది పూర్ణిమ దాన్ని మీరు ఇష్టపడితే పెళ్ళి చేసుకోవచ్చు లేకపోతే లేదు అంతేగాని మా మైథిలిని శంకించే అధికారం మీకు లేదు అది ఈ ఇంట సీతాదేవిలా వనవాసం చేస్తుందే తప్ప ఈ ఇంటికి కళంకం తెచ్చే పని ఎన్నడూ చెయ్యబోదు కూడా! అన్నాడు అన్నయ్య ఆవేశంగా!

ఆడపిల్ల గల వాళ్ళకే ఇంత రోషం పుట్టుకు వస్తే ఇంక మాకెంత ఉండాలి? ఆ పిల్లకి పెళ్ళి ఎందుకు జరగలేదు అని మేమడుగుతుంటే ఇలా మీరు మామీద ఎగిరిపడడం మర్యాదగా లేదు ఇక మీకు మీ సంబంధానికి ఒక నమస్కారం అని లేచి వెళ్ళిపోయాడు పెళ్ళికొడుకు తండ్రి కోపంగా

వెళ్ళండి మీలాంటి కుసంస్కారుల ఇంటికి నా చెల్లెలిని కోడలిగా పంపడం నాకూ ఇష్టంలేదు అన్నాడు అన్నయ్య ఆవేశంగా

అన్నయ్యకు నా పట్ల గల నమ్మకానికి ఒక్క క్షణం మనసు సంతోషంతో నిండిపోయింది కానీ పూర్ణిమకి వచ్చిన సంబంధం ఇలా తన మూలంగా తప్పి పోయిందనేసరికి తనకి పట్టరాని దుఃఖం వచ్చేసింది

ఆ రాత్రంతా తనకి నిద్ర పట్టలేదు తను ఈ ఇంట్లో ఉన్నందువల్లే పూర్ణిమకు కూడా పెళ్ళి జరగడం లేదు అన్న నిజాన్ని భరించలేకపోతుంది మనసులో దుఃఖం లావాలా పొంగుకు వస్తోంది

ఈ పరిస్థితిలో తనేం చెయ్యాలి? ఏ దూలానికో ఉరిపోసుకొని చావాలా లేకపోతే ఏ నల్లుల మందో తిని చచ్చిపోవాలా!

తనకి పెళ్ళి కాకపోవడం తను చేసిన నేరమా! లేక తనకు విధి విధించిన శాపమా! తన మూలంగా మరో జీవితం బూడిద కాబోతుందా! తను ఆత్మహత్య చేసుకుంటే మాత్రం ఈ లోకం తన మీద నిందలు మోపదా! తను ఏదో తప్పు చెయ్యబట్టే చచ్చి పోయిందని లోకం అడిపోసుకుంటుంటే చెల్లెలికి పెళ్ళి ఎలా జరుగుతుంది?

ఆమె బుర్రలో తళుక్కున మెరిసిందొక ఆలోచన

అది నాలుగు రోజుల క్రిందట పేపర్లో చూసిన ప్రకటన

ఒక అనాధ శరణాలయంలో పిల్లలని సంరక్షించేందుకు ఆయా కావాలని

అంతే! అప్పటివరకు కన్నీటితో తడిసిన ఆమె బుగ్గల్ని చేత్తో తుడుచుకుంది కర్తవ్యాన్ని నిర్వర్తించటం కోసం ధైర్యంగా ముందడుగు వెయ్యాలనుకుంది

ఆమె జీవితానికొక ఆధారం దొరికినట్టయ్యింది ఆమె మనసులో ఆవేదన ఒక్క క్షణం మటుమాయమైనట్టయ్యింది

చిన్నారి పాపల సంరక్షణ చూస్తూ తను జీవితాన్ని గడిపెయ్యగలదు తను ఈ ఇంటి నుండి వెళ్ళిపోతే తప్ప పూర్ణిమకు పెళ్ళి జరగదు తన మూలంగా వచ్చిన సంబంధాలు తప్పిపోతుంటే తను చూస్తూ భరించలేదు తను ఈ ఇంటి నుండి బ్రతుకుతెరువు వెతుక్కుంటూ బయటకు వెళ్తానంటే ఇంట్లో ఎవ్వరూ ఒప్పుకోరు

అందుకే తన నిర్ణయం తనే తీసుకోవాలి తన జీవితానికొక కొత్త బాట తనే ఏర్పరుచుకోవాల ఆడదాని జీవితానికి పరమావధి పెళ్ళే కాదు పసి పిల్లల్ని ప్రేమించడంలో కూడా దైవత్వముందని నిరూపించుకోవాలి

ఆలోచిస్తూ ఆ నిశిరాత్రిలో చప్పుడు చెయ్యకుండా ఆ ఇంటి గుమ్మం దాటింది మైథిలి

ఆ కటిక చీకటిలో ఆమె హృదయంలో భవిష్యత్తు పట్ల కోటి కాంతుల దివ్వెలు వెలుగుతున్నాయి

○

# ఆంధ్ర సచిత్ర వారపత్రిక



## వ్యాఖ్యాపోటీ-23

ఈ బొమ్మకి చక్కని వ్యాఖ్య రాసి పంపండి
బహుమతి పొందండి
వీక్లీ విడుదలైన వారంలోగా కార్డు మీద రాయండి

సీరియల్

# పంచశూలమ్

## విశ్వప్రసాద్

48

(గతసంచిక తరువాయి)

**జరిగిన కథ - 12** :జోషీ కేసు దర్యాప్తులో భాగంగా పంచశూలమ్ పంపిన యువకుడు ఇన్‌స్పెక్టర్ 'షా'గా చెలామణి అవుతుంటాడు. జయరాజ్ కొడుకు మోహన్‌తో పెళ్లికావల్సిన గురూజీ కూతురు మీనాక్షి అంధురాలుకాగా పంచశూలమ్ మోహన్‌ని కిడ్నాప్ చేయిస్తాడు. రక్తపు మడుగులో స్పృహతప్పి పడివున్న ఎం.ఎల్.ఎ. దీపాదేవిని ఆస్పత్రిలో చేరుస్తాడు షా. దీపాదేవి మాజీ భర్త భీమరాజు పోలీసు లాకప్‌లో హత్య చేయబడతాడు. సుభాష్, మదన్‌ల తండ్రి ఒక్కడేనని పంచశూలమ్ వారికి తెలియజేస్తాడు. పంచశూలమ్‌ను జోషీగా అనుమానించిన జయరాజ్, గురూజీలు అతన్ని హతమార్చేందుకు టైగర్ అనే వ్యక్తితో బేరం కుదుర్చుకుంటారు.

ఆకాశం ఉరుముతోంది మెరుపులు మెరుస్తున్నాయి వర్షం వచ్చేటట్లు ఉంది వాతావరణం చల్లటి గాలి వీస్తోంది

ఆ చల్లదనంలో కూడా పరిమళ ముఖం మీద చెమట పట్టింది ఉరుముల్లాగే గుండెలుదడ దడ కొట్టుకుంటున్నాయి మెరుపుల్లాగే కాళ్ళూ చేతులూ ఒణుకుతున్నాయి అయినా తనను తాను సంబాళించుకోడానికి ప్రయత్నిస్తూ కారు డ్రైవ్ చేస్తోంది కాని -

పాతికేళ్ళ క్రిందటి తన తప్పుడు జీవితం బైటపడితే, తన బతుకు కుక్క చింపిన విస్తరిలా అయిపోతుంది పాతి పెట్టబడిన ఆ పాత జీవితం బైట పడకూడదు తన వల్ల జరిగిన తప్పు జయరాజ్‌కి తెలియకూడదు కులటగా ముద్ర పడితే తన ముఖం ఎవరికీ చూపించలేదు ఒక్క క్షణం కూడా బతక లేదు

సామ భేద దండోపాయాలతో ఆ ప్రమాదంలోంచి తప్పించుకోవాలి

అదే నిశ్చయంతో, ఇందిరా గాంధీ వీధిలోని 32వ నెంబరు యింటి గేటు ముందు, రోడ్డుపక్కన కారు ఆపుజేసింది పరిమళ గుండె నిబ్బరంచేసుకుంది వేనిటీబ్యాగ్ చేత్తో పట్టుకుంది కారులోంచి కిందకు దిగిం ది గేటు లోపలకు దృష్టిని సారించింది

గేటుకు ఇరవై మీటర్ల దూరంలో ఉంది భవనం మధ్యలో రంగు రంగుల పూల మొక్కలు, లతలు ఎంతో అందంగా ఉన్నాయి ఆ పరిసరాల్లో ఎవరూ మనుషులు లేరు సింహద్వారం ముందు ఓ లైటు, లోపల గదిలో మరో లైటు మాత్రం వెలుగుతున్నాయి

గేటు తెరుచుకుని, తోటలోంచి భవనం దగ్గర కెళ్ళింది కాలింగ్ బెల్ నొక్కింది లోపలనుండి సమాధానం రాలేదు కాని, దానంతటదే కొద్దిగా తెరుచుకుంది తలుపు లోపల కెళ్ళింది పరిమళ

ఎక్కడి నుండో సన్నటి వెలుతురు ప్రసరిస్తోంది కాని, యింట్లో కూడా మనుషుల అలికిడి లేదు

కొన్ని గదులు దాటి, చివరి గది దగ్గర ఆగింది ఆ గది తలుపు కొద్దిగా తెరిచి ఉంది లోపల నుండిలైటు వెలుతురు బైట పడుతోంది గదిలోకి తొంగి చూసింది పరిమళ

ఆదే సమయంలో "లోపలకు రా" అన్న ఓ గంభీర కంఠ స్వరంవినిపించింది తలుపు మరి కొంచెం తెరిచి లోపలకు చూసింది పరిమళ

గదిలో -

ఓ సోఫాలో కూర్చుని ఉన్నాడు పంచ శూలమ్ టీపాయ్ మీద పెట్టాడు కాళ్ళు తాపీగా పైప్ పీలుస్తున్నాడు

నెరిసిన గెడ్డం, మీసాలు, తల వెంట్రుకలు, గంభీరమైన ఆకారం, ఖరీదైన బట్టలు చూడ్డానికి పెద్ద మనిషిలాగే ఉన్నాడు కాని, అతనికంఠం మహా కర్కశంగా ఉంది

"నీ కోసమే ఎదురు చూస్తున్నాను రా, లోపలకు' అన్నాడు తిరిగి

"నాతో మీకేం పని?"సూటిగా ప్రశ్నించింది పరిమళ

"నీతో నాకు పనిలేదు కాని, నాతో నీకు చాలా పనిఉంది "

"మీతో నాకేం పని?"

"ప్రాణాల మీద ఆశ ఉందా నీకు?"

"ఉంటే?"

"అవి నా గుప్పెట్లో ఉన్నాయి లోపల కొచ్చి, తీసుకెళ్ళు"

కాని, లోపలకు వెళ్ళలేదు గుమ్మం దగ్గరే నిలుచుంది "మీలాంటి గూండాలను చాలా మందిని చూశాను నన్ను మీరు బ్లాక్ మెయిల్ చెయ్యలేరు " అంది కోపంగా పరిమళ

" తల పొగరుతో, నోటి కొచ్చినట్లు వాగావో పళ్లు రాలగొడతాను నిన్ను బ్లాక్ మెయిల్ చెయ్యవలసిన అవసరం లేదు నాకు

ఫో బైటకు నీ వెనకనే నీడలా వచ్చి, నీ పాడు జీవితం తాలూకు ఫైలంతా జయరాజ్ టేబిల్ మీద ఉంటుంది " అన్నాడు గద్దిస్తూ పంచశూలమ్

"ఫైలా?" ఆశ్చర్యంగా అడిగింది పరిమళ

"ఔను ' నీప్రియుడికి నువ్వు రాసిన

ప్రేమలేఖలు మీరిద్దరూ తీయించుకున్న ఫోటోలు - అన్నీ ఓ ఫైల్లో నా దగ్గర ఉన్నాయి "

"అబద్ధం, అబద్ధం, అన్నీ అబద్ధాలో" అంటూ లోపలికు వచ్చింది

మరుక్షణంలోనే గది తలుపు దభాలున మూసుకుంది

ఉలిక్కి పడింది ఆమె అంతలోనే తమాయించుకుని, మొండిగా నిలుచుంది

"నువ్వు జోషికి ప్రేమలేఖలు రాయడం అబద్ధమా? ప్రేమించినట్లు నటించడం అబద్ధమా? బృందావన్ గార్డెన్స్‌లోను, కాశ్మీర్ బోట్ హవుస్‌లోను ఫోటోలు తీయించుకోవడం అబద్ధమా??? - ఏది అబద్ధం?" సోఫాలోంచి లేచి సూటిగా ప్రశ్నిం చాడు

మౌనం వహించింది ఆమె

"జాలీ ట్రిప్ పేరు మీద రాత్రింబవళ్ళు అతనితో కులికి కడుపు చేయించుకోవడం కూడా అబద్ధమేనా?

తల వంచు కుంది ఆమె

"కాకినాడ హాస్పిటల్లో ప్రసవించి, ఆ పసికందును విజయవాడలో ఓ భిక్షగత్తెకు ధర్మంగా పారేయడం కూడా అబద్ధమేనా?"

నెత్తిమీద పిడుగు పడ్డట్టయింది కాళ్ళ కింది భూమి దిగజారిపోయినట్లు తోచింది కాళ్ళు, చేతులు ఒణికాయి కళ్ళు తిరిగాయి ఒళ్ళు జోగింది నిస్సత్తువతో తూలి పడ బోయింది పరిమళ



మెరుపులా ఆమెను పట్టుకున్నాడు పంచశూలమ్ సోఫాలో కూర్చోబెట్టాడు గ్లాసుతో మంచినీళ్ళు యిచ్చాడు

నీళ్ళు తాగింది రెండు క్షణాలు కళ్ళు మూసుకుంది నెమ్మదిగా రెప్పలు తెరిచి అతని వంక చూసింది "మీరు మీరు జోషియా?" అని అడిగింది పరిమళ

"కాను" అంటూ కుడి చెయ్యి చూపించాడు

ఆ చేతిమీద పచ్చ బొట్టుతో 'పంచ శూలమ్' అని రాయబడి ఉంది ఆపేరు చదువుకుంది అయినా అనుమానం తీరక "మీరు జోషి కారా?" మళ్ళీ అడిగింది పరిమళ

"కాను - నా పేరు పంచశూలమ్ పాతికేళ్ళ క్రితం పరిచయం నీకు జోషితో ఈనాడు అతను ఎదురుపడినా గుర్తించలేవు నువ్వు అతను కూడా నిన్ను ఆనవాలు పట్టలేడు అతని అవసరం నీకు లేదు నీ అవసరం అతనికి లేదు కాని, ఓ భిక్ష గత్తెకు విసరేసిన నీ కొడుకు-నిన్ను వేటాడాలని వూరు వూరూ, వాడవాడా తిరుగుతున్నాడు"

"అతను బతికే ఉన్నాడా?"

"అతన్ని చంపేయమని భిక్షగత్తెకు చెప్పలేదు నువ్వు"

"నేను తన తల్లినని అతనికి తెలుసా?"

"ఇంకా తెలీదు కాని, భిక్షగత్తె చని పోతూ, నీ పోలికలు కూడా చెప్పిందట"

"అతనే నా కొడుకని మీ కెలా తెలుసు?"

"ఇలాంటి రహస్యాలు తెలుసుకోవడం నాకు హాబీ ఒకనాడు నా దగ్గరకు వచ్చాడు ఎవరి వల్ల సాధ్యం కాని నేరాలు తను చేస్తానని, తనను ఉపయోగించుకోమని చెప్పాడు అతన్ని నిలదీసి ఎన్నెన్నో ప్రశ్న లు వేశాను భిక్షగత్తె వల్ల తనకు తెలిసిన కధ, నీ పోలికలు చెప్పాడు అతని మాటల్ని బట్టి, అతనుజోషివల్ల నీకు పుట్టిన వాడేనని దృఢపరచుకున్నాను"

"నా పేరు చెప్పారా అతనికి?" కంగా రుగా అడిగింది పరిమళ

"లేదు నీ పచ్చని కాపురంలో చిచ్చు పెట్టడం నా కిష్టం లేదు" ఒత్తి ఒత్తి పలికాడు పంచశూలమ్

"థాంక్స్"

"పాపం! నువ్వు చాలా బాధలు పడ్డావు 'దేవీ ఇంపోర్ట్ అండ్ ఎక్స్‌పోర్ట్' లో నౌకరీ చేశావు అదృష్టం కలిసొచ్చింది. ఉద్యో గం మానేశావు అరచేతిలో హారతి కర్పూ రంవెలిగించుకుని పతివ్రతనని ప్రమాణం చేశావు జయరాజ్‌ని పెళ్ళి చేసుకుని, కోటీశ్వ రురాలిగా, మహా పతివ్రతగా చలామణీ అవు తున్నావు ఓ కొడుకును భిక్షగత్తెకు పారే సినా, మరో కొడుకుని కని హాయిగా బతు కుతున్నావు బంగారం లాంటి నీ జీవితాన్ని నేనెందుకు పాడు చేస్తాను!"

మెదడులోరాకెట్లు దూసుకుపోతున్న ట్లయింది పరిమళకు గుండెలు దడ దడ కొట్టుకుంటున్నాయి ఆగిపోతాయని కూడా అనుమానం వచ్చింది మరోమారు అతని వంకపరీక్షగా చూస్తూ "మీరు జోషి కాదా?" మళ్ళీ అడిగింది

"జోషి కళ్ళు నాకళ్ళలా నల్లగా ఉంటాయా?"

"ఆయనవి తేనె కళ్ళు"

"అతని ముక్కు?"

"మొనదేరి ఉండేది"

"కనుక, నేను జోషిని కానని నమ్మ వచ్చు నువ్వు"

"అయితే, ఈ విషయాలన్నీ మీ కెలా తెలిశాయి?"

"జోషి చెప్పాడు"

"ఆయన మీకు స్నేహితుడా?"

"ఔను ప్రాణ మిత్రుడు నీబిడ్డను ఓ భిక్షగత్తె కిచ్చానని అతనికి చెప్పావా?"

"చెప్పాను"

"ఆబిడ్డ కోసం ఎన్నో వూళ్ళు తిరిగాడు ఇంతలో - బ్యాంక్ దోపిడీ సంద ర్భంలో అతను బంధింప బడ్డాడు కోర్టువారు శిక్ష వేశారు కాని, జెల్లో ఉండలేక పోయాడు ఎందుకో తెలుసా?"

"ఎందుకు?"

"కేవలం నీ వల్ల పుట్టిన బిడ్డకోసం శిక్ష వేసిన మర్నాడే జెల్లోంచి పారి పోయాడు భిక్షగత్తెకోసం, బిడ్డకోసం మళ్ళీ గాలించాడు కాని, ప్రయోజనం లేక పోయింది"

"అతను ఎక్కడున్నాడు?"

"ఎవరు?" జోషియా?"

"ఆయనకు పుట్టిన బిడ్డ"

"ఇక్కడే ఉన్నాడు నీ కోసం వేటా డుతూ, రాత్రింబవళ్ళు కత్తి నూరు తున్నాడు"

"దేనికి?"

"కని పారేసిన నీలాంటి కసాయి తల్లి మీద కక్ష తీర్చుకోడానికి"

గుండెలు ఆగిపోయినట్లయింది అంత లోనే తమాయించుకుంది "రోజూ మీ దగ్గరకు వస్తుంటాడా?" అడిగింది

"అప్పుడప్పుడు కలుస్తుంటాడు"

"ఎలా ఉంటాడు?"

"నీలా పొడవుగా, అందంగానే ఉంటా డు ఇంగ్లీషు పిక్చర్స్‌లోని డిటెక్టివ్‌లా వేషం వేసుకుంటాడు అన్నీ నీ పోలికలే, నీ బుద్ధులే"

"అంటే?"

"తెలీదా? - దొంగతనాలూ, దౌర్జన్యా లూ, శృంగార లీలలూ, కామకేళీ విలాసాలూ ఇరవై నాలుగ్గంటలూ జోషి నీ పక్కలో ఉండాలనే దానివి అవే బుద్ధులు నీ కొడుక్కి వచ్చాయి ప్రతి రాత్రి ఐదారుగురు అమ్మా యిలు పక్కలో లేకుంటే నిదరపోలేడు"





దీర్ఘంగా నిట్టూర్చింది పరిమళ తనలో తాను బాధపడింది "చూడండి మీకూ, నాకూ విరోధం లేదు కాని, నా రహస్యాలన్నీ మీకు తెలుసు మనకు శత్రుత్వం వద్దు రాజీ పడదాం " అంది

"నువ్వు తెలివైన దానివని జోషి చెప్పేవాడు ఆల్‌రైట్ నీ షరతులేమిటో చెప్పు వింటాను "

"మీ వల్ల నాకు రెండు సహాయాలు కావాలి "

"ఏమిటవి?"

"మీ దగ్గర ఉన్న ఫోటోలు, ప్రేమ లేఖలు నాకిచ్చేయండి "

"రెండోది?"

"మీ అమ్మ కలకత్తా వెళ్ళిపోయిందని చెప్పి, అతన్ని హైద్రాబాదు నుండి పంపించేయండి"

"దీని వల్ల నాకు కలిగే లాభమేమిటి?"

"ఏం కావాలో చెప్పండి, యిస్తాను "

విలాసంగా గడ్డం దువ్వుకున్నాడు రెండుసార్లు పైప్ పీల్చాడు ఆమెను పై నుండి క్రింది వరకూ చూశాడు "నీ శరీరం కావాలన్నా, యిస్తావా?" సూటిగా అడిగాడు

తృళ్ళిపడింది పరిమళ అంతలోనే సముదాయించుకుంది "పతివ్రతను కాను నేను ఈ విషయం తెలుసు మీకు దాదాపు 50 సంవత్సరాల వయసు వచ్చింది ఈ శరీరంలో ఏమీ మిగల లేదు ఏ ప్రత్యేకతా, ఏ విశేషమూ లేదు మరొకటేదైనా అడగండి " అంది

"నీ తల యిస్తావా?"

అతని ప్రశ్న విని మళ్ళీ ఉలిక్కి పడింది వేనిటీ బ్యాగ్ తెరవబోయింది పరిమళ

"రివాల్వర్ తియ్యొద్దు తీశావో, నీ తల పగిలిపోతుంది " గది ప్రతిధ్వనించేటట్లు అరిచాడు పంచశూలమ్

ఆపాద మస్తకం కంపించి పోయింది తడబడుతున్న కంఠంతో "డబ్బు తీస్తున్నాను " అంది

"నాకు డబ్బు వద్దు నీ తల కావాలి లేదా, మరో పనిచేయ్ "

"ఏమిటది?"

"నా దగ్గర ఓ తలుంది దాన్ని తీసుకెళ్ళి, ఎక్కడైనా పారెయ్ "

ఫేన్ తిరుగుతోంది కిటికీ లోంచి గాలి వస్తోంది అయినా, ముఖం నిండా చెమట పోసింది పరిమళకు గుండెలు అదురు తోన్నాయి మెదడు మొద్దుబారి పోతోంది కళ్ళు తిరుగుతున్నాయి స్పృహ తప్పిపోయే టట్లు ఉంది అయినా,



## సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి ఇ.ఎస్.

సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తిగా శ్రీ ఇ.ఎస్.వెంకట్రామయ్య పదవీ బాధ్యతలు స్వీకరించారు. ప్రస్తుతం ప్రధాన న్యాయమూర్తిగా వున్న శ్రీ ఆర్.ఎస్.పాఠక్ అంతర్జాతీయ న్యాయస్థానం న్యాయమూర్తిగా ఎన్నికకావటంతో ఈ పదవి శ్రీ ఇ.ఎస్.ను వరించింది.

19వ ప్రధానన్యాయమూర్తి అయిన శ్రీ వెంకట్రామయ్య సీనియర్ న్యాయమూర్తిగా వున్నారు.

భోపాల్ గ్యాస్ దుర్ఘటన బాధితుల సమస్య పరిష్కారం సందర్భంగా న్యాయస్థానం కుదిర్చిన ఒప్పందాన్ని కొందరు విమర్శించటం పట్ల నిరసనగా రాజ్యాంగ ధర్మాసనం నుంచి రాజీనామా చేసేందుకు కూడా ఒక సందర్భంలో ఆయన సిద్ధపడి వార్తలకెక్కారు.

డిసెంబరులో ఈయన పదవీ విరమణ చేయవలసి వుంది.

నిగ్రహించుకోడానికి ప్రయత్నిస్తూ "తలా?" రెట్టించింది

"ఔను నిజం చెప్పాలంటే, నూటికి నూరు పాళ్ళు అహింసావాదిని నేను కాని, హింస తప్పలేదు నీలాగే కుట్రలూ, ద్రోహాలూ చేసిన ఓ కుర్రాడు వచ్చాడు గంట క్రితం తల బిరుసులో తిరగబడబోయాడు తప్పలేదు - అతని తల తీసేశాను దానిని తీసుకెళ్ళి ఏ కుండీలోనో, కాలువలోనో పారెయ్ "

"ఆడదాన్ని ఇంత ప్రమాదమైన పని చెయ్యలేను "

"ఇంతకంటే భయంకరమైన పనులు చేశావ్ ఇదొక పెద్ద విషయం కాదు నీకు "

"నన్నిలా చిత్రహింసలు పెట్టడం ధర్మం కాదు " దీనంగా అంది

"జోషిని నువ్వు పెట్టిన హింసలో యిది లక్షోవంతు కూడా కాదు అతన్ని ప్రేమించానన్నావ్ సిగ్గు విడిచి శరీరాన్నంతా యిచ్చావ్ నీ ఎడమ తొడ మీద ఉన్న పుట్టు మచ్చను అతను ముద్దుపెట్టుకుం టుంటే మరిసిపోయావే అతనితో రకరకా లుగా సుఖాలు అనుభవించి ఓ బిడ్డను కన్నావ్ ఆ పసికందును ఓ బిక్షగత్తెకు పారేశావ్ జోషిని జైలు పాలు చేశావ్ గుండెల మీద తగిలిన ఈ రెండు దెబ్బలకు అతను విపరీతమైన చిత్రహింసకు గురి అయ్యాడు వింటున్నావా?" ఆమె ముఖంలోకి చూశాడు

తల వంచుకుంది ఆమె

"నాకు టైమ్ లేదు త్వరగా నీ నిర్ణయం చెప్పు ఒక్కటి మాత్రం గుర్తుంచుకో నేను చెప్పిన పని చెయ్యడానికి నువ్వు నిరాకరించవచ్చు కాని, ఆ తర్వాత ఏం జరుగుతుందో తెలుసా?"

తలెత్తి దీనంగా చూసింది ఆమె

" నీ ప్రణయ చిత్రాలు, ప్రేమ లేఖలు పత్రికల్లో ప్రచురింప బడతాయి జయరాజ్, మోహన్‌లు నీ ముఖం మీద ఉమ్మివెయ్యడానికి కూడా అసహ్యించు కుంటారు పోలీసులు నీ చేతులకు సంకెళ్ళు తగిలిస్తారు ఉరికంబ మెక్కిస్తారు కాని, ఆ తల తీసుకెళ్ళి దూరంగా పారెయ్యగలిగావో, ఈ ప్రమాదాలన్నీ తప్పిపోతాయి నాదగ్గర ఉన్న ఫోటోలు, ప్రేమలేఖలు యిచ్చేస్తాను పెళ్ళి కాకుండా పుట్టిన నీ మొదటి కొడుకును హైద్రాబాద్ నుండి తరిమేస్తాను ఏ డబ్బు కోసమైతే పాతిక సంవత్సరాలక్రితం జోషిని మోసగించావో, ఆ డబ్బుతో హాయిగా, కోటీశ్వరురాలిగా చలామణీ కావచ్చు చచ్చేంత వరకు పరువు ప్రతిష్టలతో బతక వచ్చు నీ ముద్దుల మొగుడు జయరాజ్, నీ సొంత కొడుకు మోహన్, నువ్వు ఆనందంగా ఉండొచ్చు "

అతను చెప్పిన ఒక్కొక్క మాట పరిమళ చెవుల్లో శూలాల్లా దిగబడి పోయాయి భయంతో ఒళ్ళంతా చెమటలు పోశాయి ప్రతి అవయవం కంపించి పోయిం ది వివశతతో దుఃఖం పొంగిపోయింది అశ్రుధారలు కారనారంభించాయి

"నువ్వు ఏడ్చినా, తలబద్దలు కొట్టుకున్నా నా నిశ్చయం మారదు కావాలంటే, పోలీసులకు ఫోన్ చేసి, నన్ను అరెస్టు చేయించు లేదా, నీ బ్యాగ్‌లో ఉన్న రివా

ప్రముఖ హిందీనటి షబ్నాఅజ్మీ రాజకీయ ప్రవేశం చేసిన విషయం విదితమే అయినప్పటికీ రానున్న ఎన్నికలలో ఆమె పోటీ చేస్తుందా, చెయ్యదా అన్న విషయమై రాజకీయరంగాలలో సస్పెన్స్ చోటు చేసుకున్నదట. అట్టడుగు వర్గాలను ఆదుకోవాలన్న కాంక్ష గల షబ్నాకు ప్రపంచ వ్యాప్తంగా సినీగ్లామర్ వున్న విషయం తెలిసిందే. ఆమె సంఘసేవ చేయాలన్న తలంపు సరైనదే కాని ఎంతవరకు చేస్తారనేదే అనుమానమని అంటున్నారు తలనెరిసినవాళ్ళు.



నేను రాజకీయాల్లోకి రాను, ఎన్నికల్లో పోటీ చేయనని అంటున్నా మీరు పోటీ చేయవలసిందేనని పట్టుబడుతున్నారట అనుయాయులు చాలామంది. మరి చివరకు ఈమె ఏం నిర్ణయం తీసుకుంటుందోనని నిరీక్షిస్తున్నారట!

ల్వర్ బైటకు తీసి నన్ను కాల్చి చంపేయ్ లేదా, నేను చెప్పినట్లు చెయ్యి ఒక్క నిముషం టైమిస్తున్నాను" అంటూ వాచీ మీదకు దృష్టిని సారించాడు పంచశూలమ్

అతని మాట నిరాకరిస్తే, ఆ క్షణంలోనే తన బతుకు బద్దలైపోతుంది ఎంతో పరువు ప్రతిష్టలతో వెలిగి పోతున్న తన జీవితం బజారు పాలవుతుంది అంతా అసహ్యించుకుంటారు మోహన్ ఛీదరించుకుంటాడు జయరాజ్ విడాకులిస్తాడు పోలీసులు పట్టుకున్టారు

ఇలా వూహించుకునే సరికి ఆమె తల తిరిగి పోయింది ఏదో ఒక సాహసం చెయ్యాలనుకుంది

కాని, అతన్ని చంపలేదు పోలీసులకు రిపోర్టు చెయ్యలేదు తన బతుకు బజారు పాలు చేసుకోలేదు

కనుక, అతను చెప్పినట్లు చెయ్యడమే మంచిదనిపించింది చటుక్కున సోఫాలోంచి లేచింది "తలెక్కడుంది?" అడిగింది పరిమళ

"గుడ్! బతక నేర్చిన దానివి నామాట నిరాకరించవని తెలుసు ఇపట్టికే నీకారు డిక్కీలోకి వెళ్ళి పోయింది తల జాగ్రత్తగా, తీసుకెళ్ళి ఏ మారుమూల ప్రదేశంలోనో పారెయ్ నీకేదైనా ప్రమాదం జరిగితే నాకు ఫోన్ చెయ్"

"ఫోటోలు, ఉత్తరాలు ?"

"ఆ డ్రాయరు మీద ఉన్నాయి"

డ్రాయరు దగ్గర కెళ్ళింది ఫోటోలు, ఉత్తరాలు తీసుకుంది ఒక్కొక్కటి పరీక్షించి చూసుకుంది బ్యాగ్‌లో వేసుకుంది ఆ గది లోనుంచి బైటకు వెళ్ళబోయింది అడుగులు బరువుగా పడ్డాయి కాళ్ళు తడ బడ్డాయి తూలి గోడవైపు పడబోయింది పరిమళ

వెంటనే ఆమెను పట్టుకున్నాడు నెమ్మదిగా భుజం తట్టాడు "నీకేం భయం లేదు నీ ప్రాణానికి నా ప్రాణం అడ్డం వేస్తాను ధైర్యంగా వెళ్ళు" అన్నాడు పంచశూలమ్

## 49

అడుగులో అడుగు వేసుకుంటూ కారు దగ్గరకు వచ్చింది పరిమళ అదురుతున్న గుండెలతో డిక్కీవైపుకు చూసింది దానిలోపల ఉన్న తలను తలచుకునే సరికి ఆమె గుండెలు దిగజారిపోయినట్లయింది భయంతో కొన్ని క్షణాల పాటు కంపించి పోయింది

డిక్కీలో ఉన్న తల ఎక్కడైనా పారేయాలి!

ఆ పని చేస్తుండగా ఎవరైనా చూస్తే ?

ఆ సమయంలో మోహన్ గాని, జయరాజ్ గాని వస్తే ??

పంచశూలమ్ తన మీద పగ బట్టి, పోలీసులకు చెబితే ???

--- తను అధోగతి పాలై పోతుంది

తన జీవితం నాశనమై పోతుంది

తన చరిత్ర ముగిసి పోతుంది

ఇంతకూ -----

ఎవరా యువకుడు ?

ఎంత వయసువాడు ??

ఏ పాపిష్టురాలికి పుట్టిన దౌర్భాగ్యుడు ???

డిక్కీ తెరిచి చూడాలనిపించింది పరిమళకు కాని ధైర్యం చాలలేదు

వీధి దీపాలు వెలుగుతున్నాయి అపప్పుడపప్పుడు కార్లు, ఆటోలు వచ్చి పోతున్నాయి

వాచీ వంక చూసుకుంది

రాత్రి పదకొండు గంటలయింది

ఇహ, అక్కడ ఉండకూడదనుకుంది డోరు తెరచింది డ్రైవింగ్ సీట్లో కూర్చుంది పది కిలో మీటర్ల నుండి పరుగెత్తుకొచ్చినట్లు కాస్సేపు ఒగురుస్తూ ఉండి పోయింది నాలుకతో పెదవులు తడిచేసుకుంది కారు స్టార్ట్ చేసింది పరిమళ

శవాన్ని మోసుకెళుతున్నట్లే బాధగానూ, బరువుగానూ ముందుకు సాగింది ఫియెట్‌కారు!

## 50

అర్ధగంట సేపు కారులో అటు - యిటూ తిరిగింది పరిమళ

ఎక్కడా ఏకాంత ప్రదేశం దొరకలేదు డిక్కీలో ఉన్నతల పారేయడానికి అనుకూలమైన స్థలం కనిపించలేదు పదకొండు గంటలు దాటిపోయినా కార్లు, రిక్షాలు, సైకిళ్ళు వస్తూ, పోతూనే ఉన్నాయి జనం తిరుగుతూనే ఉన్నారు

ఇంతలో ఆకాశం ఉరిమింది పెద్ద మెరుపు మెరిసింది చిన్నగా వర్షం ప్రారంభమయింది

వెంటనే ఆమె మెదడులో ఓ ఆలోచన స్ఫురించింది సరాసరి టాంక్ బండ్ దగ్గర కెళ్ళి, కారు ఆపుజేసింది

వర్షం పడటం వల్ల - అంతవరకు అక్కడ కూర్చున్న జనమంతా వెళ్ళిపోయారు ఎలక్ట్రిక్ దీపాలు మినుకు మినుకు మంటూ వెలుగుతున్నాయి అప్పుడప్పుడు ఒకటి రెండు వాహనాలు వచ్చి పోతున్నాయి కారు దిగింది పరిమళ తడబడుతున్న అడుగులతో డిక్కీ దగ్గర కెళ్ళింది అప్పటికే ఆమె ధైర్యం అడుగంటి పోయింది డిక్కీతెరవాలంటేనే భయంగా ఉంది తెరిచే లోపున ఎవరైనా రావచ్చు లేదా, తల తీసుకెళ్ళి కాలువలో వేస్తుండగా ఎవరైనా చూడొచ్చు

అలా జరిగితే తనకు ఉరి తప్పదు

బతికుండగానే నరకాన్ని అనుభవిస్తున్నట్లనిపించింది వర్షపు చినుకులు మీద పడు తున్నాయి తల తడిసి పోయింది కాళ్ళు ఒణుకుతున్నాయి కళ్ళకు మైకం కమ్ముతోంది బలవంతంగా తనను తాను నిల దొక్కుకుంది ఏమైనా సరే ఆ తలను ఉస్మాన్‌సాగర్‌లోకి విసిరేయాలనుకుంది

ద్రుఢ మైన నిశ్చయంతో డిక్కీ తెరవబోయిం ది

అదే సమయంలో, ఏదో వాహనం వస్తున్నట్లు హెడ్‌లైట్స్ కాంతి కనిపించింది ఆ వెలుతురు చూసేసరికి ఆపాదమస్తకం కంపించిపోయింది తన ప్రయత్నాన్ని ఆపు జేసి, కారు ముందు కొచ్చి నిలుచుంది ఆమె

ఓ టూరర్ కారు వచ్చి సరాసరి ఆమె పక్కన ఆగింది

అందులోంచి ఓ యువకుడు దిగాడు

అతని వంక పరీక్షగా చూసింది పరిమళ

అతను సన్నగా, పొడవుగా ఉన్నాడు లాంగ్ కోటు వేసుకున్నాడు తలమీద ఫెల్ట్ హేట్ పెట్టుకున్నాడు పంచశూలమ్ వర్ణించి నట్లు ఇంగ్లీషు పిక్చర్స్‌లోని డిటెక్టివ్ లాగా ఉన్నాడు

అతనే జోషివల్ల తనకు పుట్టిన కొడుకా ???

--- అనుమానంతోనూ, ఆశ్చర్యం తోనూ ఆమె మనసు తల్లడిల్లిపోయింది అతను మదన్ !!!

కోటు జేబులో చేతులు పెట్టుకుని ఆమె దగ్గరకు వచ్చాడు " మేడమ్! అర్ధ రాత్రి కావస్తోంది వర్షం కూడా వస్తోంది ఒంటరిగా నిలుచున్నారు ఎవరికోసమైనా ఎదురు చూస్తున్నారా?" ప్రశ్నించాడు మదన్

"లేదు"

"కారు ట్రబులిచ్చిందా?"

"నో అదేమి కాదు "

"వేటకు బయలుదేరేరా?"

"అంటే ?"

"బోయ్ ఫ్రెండ్స్ కోసం వేటాడుతున్నారా?"

"నాన్ సెన్స్ మీనింగ్ లెస్ "

"మరి, యింత రాత్రి సమయంలో, వర్షంలో ఒంటరిగా నిలుచున్నారేం?"

"వర్షం అంటే నాకు చాలా యిష్టం " తల మీద నుండి కారుతున్న నీళ్ళు తుడుచు కుంటూ సమాధాన మిచ్చింది పరిమళ

ఆమెను, కారును సూటిగా చూశాడు మదన్ అతని ద్రుష్టి కార్లోనున్న ఆమె వేనిటి బ్యాగ్ మీద పడింది "మీకు వర్షమంటే యిష్టం నాకు మీ వేనిటి బ్యాగ్‌లోని డబ్బంటే మహాయిష్టం" అన్నాడు

అదిరి పడింది "వాట్?" అంది పరిమళ

కోటు జేబులోంచి రివాల్వర్ తీసాడు మదన్ ఆమెకు గురిపెట్టాడు "అరిచినా, మొత్తుకున్నా, నిన్ను రక్షించే నాధుడు లేడిక్కడ ఆ బ్యాగ్ లో ఎంత డబ్బుందో తీసి యివ్వు " అన్నాడు బెదిరిస్తూ

"నువ్వు దొంగవా?" ఆశ్చర్యంగా ప్రశ్నించింది పరిమళ

"నువ్వు వ్యభిచారివా?" ఎదురు ప్రశ్న వేశాడు మదన్

అతని ప్రశ్నను భరించలేక పోయింది "షటప్ " అంటూ అరిచింది

"అనవసరంగా అరవబోకు అర్ధరాత్రి పూట, వర్షంలో, ఒంటరిగా నువ్విక్కడ నిలబేడ్డావంటే, పచ్చివ్యభిచారిణివని అర్ధమై పోతోంది కాని, నీలాంటి ముసలమ్మ నాకక్కర్లేదు నాకు కావలసింది డబ్బు ఎంత కేష్ ఉందో అర్జంటుగా యివ్వు లేదా, నీ ప్రాణాలు తీస్తాను"

అతని మాటలు గునపాల్లా తగిలాయి ఆమెకు బాధతో, ఆవేదనతో సతమతమై పోయింది అవమానంతోనూ,ఆవేశంతోనూ కంపించి పోయింది పంచశూలమ్ వేసిన వలలోంచి తప్పించుకోవాలంటే, మరో ప్రమాదం ఎదురయింది కాని, అతనితో

# పంచశూలమ్

ఘర్షణ పడుతూ, కాలాన్ని వృధా చెయ్యడం ఆమెకు యిష్టం లేదు అతని పీడ వెంటనే తొలగించుకోవాలనుకుంది మెళ్ళోని బంగారు గొలుసు తీసింది అతని కివ్వబోయింది

ఆ గొలుసు తీసుకో లేదు మదన్ "సారీ, మేడమ్! అది అమ్మి కేష్ చేసుకునేంత టైమ్ లేదు నాకు కేష్ కావాలి" అని, కారు ముందు డోరు తెరిచాడు వేనిటీ బ్యాగ్ తీసుకున్నాడు "సారీ ఫర్ ది ట్రబుల్, మేడమ్!" అంటూ తన టూరర్ కారులో ఎగిరి కూర్చున్నాడు

"ఆ బేగ్‌లో ముఖ్యమైన ఉత్తరాలు, ఫొటోలు ఉన్నాయి కావాలంటే అందులోని డబ్బు తీసుకు పో ఆ ఉత్తరాలు, ఫొటోలు నాకిచ్చేయ్" బిగ్గరగా అరిచింది పరిమళ

"సారీ, వెరీ వెరీ సారీ! టైమ్ లేదు" అంటూ, టూరర్ స్టార్ట్ చేసుకుని వెళ్ళిపోయాడు మదన్

అంతవరకూ అణచుకున్న దుఃఖం, నిస్సహాయత ఒక్కసారిగా ఆమె హృదయాన్ని కుదిపేశాయి వర్షపు ధారకంటే ఉధృతంగా కళ్ళల్లోంచి అశ్రుధారలు కారనారంభించాయి నీరసంతో కారుకు ఆనుకుని నిలబడి, వెక్కి వెక్కి ఏడవసాగింది పరిమళ

పంచశూలాన్ని నిలువునా కొనాలనుకుని తెచ్చిన డబ్బు పోయింది! తన జీవిత రహస్యాలకు సంబంధించిన ప్రేమ లేఖలు, ఫొటోలు పోయాయి!! తన పాపానికి ఫలితంగా తన కారు డిక్కీలో ఓ తల ఉంది!!!

తన వివశతను తలచుకునే సరికి తన మీద తనకే అసహ్యం కలిగింది ఆవేశాన్ని, ఆవేదనను అణచుకోలేక భోరున ఏడవనారంభించింది

అదే సమయంలో -

మరో వాహనం వస్తున్నట్లు కనిపించింది

తన దుఃఖాన్ని దిగమింగుకోవాలనుకుంది కాని, ఆపుకోలేకపోయింది

కారులో కూర్చోవాలనుకుంది కాని, కాలు కదపలేకపోయింది

ఇంతలో, ఓ పోలీస్ జీప్ వచ్చింది అందులోంచి కిందకు దిగాడు షా

అతన్ని చూసేసరికి నఖ శిఖ పర్యంతరం ఒణికిపోయింది మెదడు మొద్దుబారిపోయింది ఆమెను పరీక్షగా చూశాడు షా గుర్తించాడు "ఇక్కడున్నారేం మేడమ్?" అడిగాడు సమాధాన మివ్వలేదు ఆమె వెక్కి వెక్కి ఏడుస్తూనే ఉంది

- పంచశూలమ్ తన కారులో ఓ యువకుని తల పెట్టాడని చెప్పుకోలేదు! ఓ దొంగ వచ్చి, తన వేనిటీ బ్యాగ్ పట్టుకుపోయాడని ఫిర్యాదు చెయ్యలేదు! ఏమి చెప్పినా, తన గోతిని తనే తవ్వుకున్నట్లవుతుంది అందుకే ఏమీ మాట్లాడలేక ఏడుస్తూ నిలబడిపోయింది




మోహన్ కనిపించక పోవడం వల్లనే ఆమె దుఃఖాన్ని భరించలేక పోతున్నదని ఊహించాడు షా ఇంట్లో - పది మంది ముందుకన్నీరు పెట్టుకోలేక, ఆ ఏకాంతంలోకి వచ్చి, ఏడుస్తున్నదని భావించాడు ఓదార్పుగా "మోహన్ గురించి ప్రతి నిమిషం ప్రయత్నిస్తూనే ఉన్నాం రెండు మూడు రోజుల్లో అతన్ని తీసుకు వస్తాం మీరు కొంచెం ధైర్యంగా ఉండాలి" అన్నాడు

అంతవరకు జ్ఞాపకం లేని మోహన్ గుర్తుకు వచ్చేసరికి ఆమె దుఃఖం మరీ ఎక్కువై పోయింది అతని టొయోటా కారు షెడ్‌లో ఉంది బొంబాయి నుండి రాగానే ఆ ఫియెట్ కారునే ఉపయోగిస్తాడు అందులో ఓ కుర్రాడి తల ఉంది! ఏడుస్తూ దుఃఖాన్ని భరించలేక చిన్నగా అరిచింది పరిమళ

కొంచెం చొరవ తీసుకున్నాడు షా ఆమె చెయ్యి పట్టుకున్నాడు కారు డోరు తెరిచాడు "మేడమ్! మానసికంగాను, శారీరకం గాను బాగా అలసిపోయారు మీరు కారులో కూర్చోండి"

ముందు సీట్లో కూర్చుంది ఆమె ఏడుస్తూ తల వెనక్కి వాల్చింది

కొన్ని క్షణాలు ఏదో ఆలోచిస్తూ నిలుచున్నాడు షా అంతలోనే ఓ నిశ్చయానికి వచ్చాడు "జెట్టీ! మేడమ్ చాలా నీరసంగా ఉన్నారు ఈ పరిస్థితిలో కారు డ్రైవ్ చెయ్యడం కష్టం వారిని యింటి దగ్గర విడిచి పెట్టిరా" అన్నాడు - పక్క కానిస్టేబుల్‌తో

"ఆర్డర్ సార్!" అని, ఫియెట్ డ్రైవింగ్ సీటులో కూర్చున్నాడు జెట్టీ

తృళ్ళిపడింది పరిమళ బలవంతంగా దుఃఖాన్ని ఆపుకుంది "నో నేను డ్రైవ్ చెయ్యగలను" అంది అస్పష్టంగా

"వద్దు మేడమ్! అర్ధరాత్రి దాటిపోయింది వర్షంలో తడిసిపోయారు దుఃఖాన్ని ఆపుకోలేక పోతున్నారు మీరు రెస్ట్ తీసుకోండి జెట్టీ మిమ్మల్నీ, కారునూ మీ యింటి దగ్గర విడిచిపెట్టి స్టేషన్‌కు వెళ్ళిపోతాడు నిశ్చింతగా ఉండండి" అన్నాడు షా

అప్పటి కప్పుడే యింజన్ స్టార్ట్ చేశాడు జెట్టీ

"ఓ మైగాడ్!" అంటూ రెండు చేతులతో తల పట్టుకుంది పరిమళ

ఫియెట్ ముందుకు కదిలింది

(ఇంకా ఉంది)

ప్రపంచ టెన్నిసు రంగంలో అగ్రగామి, ర్యాంకింగ్‌లో తృతీయ స్థానములో వున్న అర్జంటీనాకు చెందిన గాబ్రియేలా సబాటిని, మన బొంబాయి క్రికెట్ ఆటగాడు రవిశాస్త్రిని వివాహము చేసుకుంటున్నట్లు వార్త ఒకటి మరాఠీ పత్రికలలో వచ్చింది.

మొదటలో యీ వార్తను మరాఠీ దిన పత్రిక 'కేసరి' ఒక ప్రత్యేక విషయముగా ప్రచురించి క్రీడారంగంలో సంచలనం కలిగించింది.

రవిశాస్త్రి గత రెండు సీజనుల నుండి ఇంగ్లీషు క్రికెట్ కౌంటీ లీగ్ పోటీలలో 'గ్లామోర్గన్' జట్టుకు ఆడుచున్నాడు. ఈ బొంబాయి ఆటగాడు వింబుల్డన్ పోటీలను తిలకించుటకు వెళ్ళేవాడట. రవి అందానికి సబాటిని ముగ్ధురాలయి రహస్యముగా కలుసుకునేదిట! వారి మనసులు కలసి ప్రేమగా మారి వివాహమునకు దారి తీసినదట అనేది కేసరి దిన పత్రిక వార్త. ఈ విషయమును యింకా కొన్ని కథలు అల్లి యితర పత్రికలు విశేషముగా ప్రచారము చేసాయి.

రవిశాస్త్రి యీ విషయం ధ్రువపరచలేదు. సబాటిని నేడు ప్రపంచ టెన్నిసు రంగంలో విశ్రాంతిలేని క్రీడాకారిణి. నెం.1 స్టెఫీగ్రాఫ్‌తో పోటీ పడుట గెలుపు సాధించు కృషిలో యున్నది. సబాటిని వయసు 18 ఏళ్ళు మాత్రమే. ఈ వయసులో ఐరోపా దేశస్థులు పెండ్లి గురించి సాధారణముగా ఆలోచించరు. విరామములేక నిరంతరము పోటీలలో పాల్గొనుట, శిక్షణ పొందుటలో యున్న యీమె రవిశాస్త్రిని వింబుల్డన్ పోటీల సమయములో ఎక్కడ, ఎప్పుడు కలుసుకున్నది కేసరి పత్రిక తెలుపలేదు.



అర్జంటీనాలో ఫుట్‌బాల్ ఆటగాడు మరడోనా కన్నా ఎంతో మంది అభిమానులను పొంది, అధ్యక్షుని తర్వాత ద్వితీయ స్థానములో కలదు సబాటిని!

# ఎక్కడి రవిశాస్త్రి? ఎక్కడి సబాటినీ? ఈ యిద్దరికి పెళ్లేమిటి?

లిప్టన్ ప్లేయర్స్ యింటర్నేషనల్ టైటిల్ సాధించుట వలన యీమెకు 100,000 అమెరికన్ డాలర్లు లభించాయి. ఇదికాక అనేక పోటీలలో పాల్గొని భారీగా పారితోషికాలు అందుకుంది. ఇంకా 'గ్రాండ్ స్లామ్' సాధించకపోయినా ఆమె అతి కొద్ది కాలములోనే అందరి ప్రశంసలు పొందింది.

సబాటిని మంచి టెన్నిసు క్రీడాకారిణియేగాక అందకత్తె కూడా. అగ్రగామి 'యుడి కో లోన్ 4711' కంపెనీ యీమె పేరును తమ తయారుకు పెట్టుటయే గాక అనేక భంగిమలలో యీమె బొమ్మలు ప్రచార నిమిత్తం ఉపయోగించుకొనుటకు కాంట్రాక్టు తీసుకొంది. ఐరోపాలో ముఖ్యముగా పశ్చిమ జర్మనీ, ఆస్ట్రియా, స్విట్జర్లాండ్, ఇటలీలలో మొదట విడుదల చేయబడుతుంది. దీనికి కారణం ఇటాలియన్ ఓపెన్‌లో యీమె గెలుపు అమ్మకానికి తోడ్పడకలదని ఆలోచన కలిగింది. ఇంకా అనేక ఐరోపా, అమెరికా కంపెనీలు తమ ఉత్పత్తుల అమ్మక ప్రచారార నిమిత్తం యీమె పేరు, బొమ్మలు భారీ ఎత్తున పారితోషికాలు చెల్లించి ఉపయోగించుకొనుటకు ముందుకు వచ్చాయి.

వ్యాపార ప్రకటనలవలన వచ్చే ఆదాయము టెన్నిసు ఆటలో పాల్గొనుటవలన లభించే ఆదాయముకన్న ఎంతో ఎక్కువ. కాని ఆమెకు టెన్నిసు రంగంలోయున్న అభిమానము, దానివలన లభించిన కీర్తిని వదులుకొనుటకు యిష్టము లేదు. అందుకే వ్యాపార ప్రకటనలు చూచుకొనుటకు తండ్రి ఓస్వాల్డోను తన ప్రతినిధిగా నియమించుకున్నది.

నేడు అర్జంటీనా దేశములో అధ్యక్షుని తర్వాత రెండవ స్థానము సబాటినీకు యున్నది. ఆ దేశస్థులకు యీమె అంటే ఎంతో అభిమానం. తమ దేశ గౌరవం, ప్రజల అభిమానం కొరకు టెన్నిసు రంగంలో అఖండ విజయాలు సాధించే ప్రయత్నములోయున్న యీమె రవిశాస్త్రిని వివాహమాడుట అనేది నమ్మలేని సంగతి.

-ముకరమ్

మనము-మన దేహము

# కొన్ని ముఖ్యమైన ప్రాథమిక చికిత్సలు

ప్రమాదాలు జరిగినప్పుడుగాని, ఇంట్లో రోగి ఉన్న ప్పుడు గాని వారికేదైనా జరిగితే ప్రక్కన ఉన్న వ్యక్తులే వెంటనే రక్షించగలగాలి ఆ సమయంలో వారు చేసే ప్రథమ చికిత్సే ప్రాణాలను రక్షిస్తుంది ఎవరైనా ప్రథమ చికిత్స చేయవచ్చు అయితే ఏ విధంగా చికిత్స చేయాలనేది తెలిసి ఉండాలి అనిడా I డి ఎస్ ఎన్ శర్మ అన్నారు

ప్రశ్న:- శరీరంలో వివిధ భాగాలు కాలిన ప్పుడు వెంటనే ఎలాంటి జాగ్రత్తలు తీసుకోవాలంటారు?

జవాబు:- శరీరంలోని వివిధ భాగాలు కాలిన పరిస్థితిని బట్టి ప్రాథమిక చికిత్స చేయవల్సి ఉంటుంది శరీరం మొత్తం కాలినప్పుడు పరిశుభ్రమైన గుడ్డను శరీరానికి మొత్తంగా చుట్టాలి ఆ వ్యక్తిని నిటారుగా పడుకోపెట్టాలి ఎక్కువగా కదలనీయకుండా చూడాలి ముఖం మీదగుడ్డలేకుండాచూసుకోవాలి ఎందు కంటే గాలి పీల్చుకునేందుకు గుడ్డ అడ్డం లేకుండా చూడాలి శరీరానికి ఏ విధ మైనఆయింట్‌మెంట్స్ పూయకూడదు వెంటనే దగ్గర్లో ఉన్న హాస్పటల్‌కు తరలించాలి

శరీర అవయవాలలో కొద్దిభాగం అంటే కాలుగాని, చేయిగాని కొంచెం కాలినప్పుడు చల్లటి నీళ్ళలో ఆ భాగాన్ని కాసేపు ఉంచాలి అలాగే నీటిలో ముంచిన గుడ్డతో కూడా కాలిన భాగాన్ని అద్దవచ్చు ఆ తరువాత పరిశుభ్రమైన పొడిగా ఉన్న గుడ్డతో ఆ భాగాన్ని చుట్టాలి అంతేకాని సిరా పూయటం కాని పౌడరు వేయడం కాని చేయకూడదు ఆడవారికిఇంట్లోనూనెలు దగ్గర వంట చేయుచున్నప్పుడు నూనె తుంపరుల వల్ల కూడా ఒక్కోసారి చిన్న చిన్న బొబ్బలు ఏర్పడతాయి అలాంటి సందర్భంలో బర్నాల్ లాంటి ఆయింట్ మెంట్స్ వాడవచ్చు ఆ తరువాత డాక్టరుకు చూపించి మందు వాడుకోవాలి

ప్ర:- శరీరంలో ఏ భాగంలోనైనా తెగి బ్లీడింగ్ అవుతుంటే ఏ విధంగా బ్లీడింగ్ కంట్రోల్ చేయవచ్చంటారు?

జ:- చిన్న పిల్లలకు బ్లేడు, చాకులు లాంటివి అందుబాటులో ఉంటే వాటితోఆడుకోవటానికి ప్రయత్ని స్తుంటారు అలాంటి సందర్భంలో చేతులు తెగటానికి అవకాశం ఉంది అలాగే ఆడవారు కూరలు తరిగే టప్పుడు చాకు, కత్తిపీటలవల్ల, మిషనుతో బట్టలుకుట్టే వారికి సూది వలన ప్రమాదాలు జరిగి బ్లీడింగ్ అవుతుంటుంది అలా



డా. డి.ఎస్.ఎన్. శర్మ
ఎమ్.బి.బి.ఎస్.
తాడేపల్లి, గుంటూరు జిల్లాలో ప్రాక్టీసు చేస్తున్నారు.

బ్లీడింగ్ అవుచున్నప్పుడు వెంటనే ఆ తెగిన ప్రాంతంలో గట్టిగా నొక్కిపట్టాలి. ఒకటి రెండు నిమిషములలో బ్లీడింగ్ ఆగిపోతుంది. కొంచెం ఎక్కువ గాయం అయితే మంచి గుడ్డముక్కను తీసుకుని ఆగాయం చుట్టూ గట్టిగా కట్టాలి. అంతేకాని కాఫీపొడి, పసుపు లాంటివి వేసి గాయానికి కట్ట కూడదు.

ఇంకాకొంచెం ఎక్కువగా ప్రమాదం జరిగినప్పుడు రక్తనాళాలు బాగా తెగి ఎక్కువ మోతాదులో రక్తస్రావం జరుగు తున్నప్పుడు గాయం తెగిన భాగానికి పై భాగంలో చేతి రుమాలు లేదా కండువా లాంటివి ఉపయోగించి గట్టిగా కట్టవచ్చు. చేయిగాని, కాలుగాని తెగిన భాగాన్ని పైకి లేపి ఉంచాలి అప్పుడురక్తస్రావం కంట్రోల్ అవుతుంది. వెంటనే వైద్యుని దగ్గరకు తీసుకు వెళ్ళాలి.

ఒక్కొక్కసారి ముక్కువెంబడి రక్తం వస్తుంటుంది అటువంటప్పుడు ముక్కు భాగాన్ని చేతితోటి గట్టిగా నొక్కి ఉంచాలి ఆ సమయంలో నోటితోగాలి పీల్చుకోవాలి. అంతే కాని గుడ్డ ముక్కలు, దూదిలాంటివి ముక్కు లోపలకు దూర్చకూడదు అలా ముక్కు గట్టిగా నొక్కిపెట్టి వెంటనే డాక్టరు దగ్గరకు వెళ్ళాలి

అలాగే తలకు గాయమైనప్పుడు కూడా రక్తం బాగా కారుచున్నప్పుడు వెంటనే గుడ్డతో నొక్కిపట్టాలి దూది దొరికితే గాయానికి దూదిని ఉంచి తలచుట్టూ వత్తుగా గుడ్డ చుట్టండి వెంటనే దగ్గరలో ఉన్న డాక్టరు వద్దకు తీసుకు వెళ్లాలి.

ప్ర:- నీటిలో మునిగి నీరు బాగా త్రాగిన వారికి ఎలాంటి జాగ్రత్తలు తీసుకోవాలి?

జ:- నీటిలో మునిగిన వ్యక్తిని బయటకు తీయగానే ముందుగా ఆ వ్యక్తిని వెల్లికిలా పడుకోబెట్టాలి తలను కుడివైపుకు కాని, ఎడమ వైపునకుకాని వాల్చాలి పొట్టపై రెండు చేతులు ఉంచి నీటిని వచ్చేందుకు పొట్టను నొక్కుతుండాలి అప్పుడు నీరు బయటకు వచ్చేస్తుంటుంది ఆ

తరువాత ఆ వ్యక్తి గాలి పీల్చగల్గు చున్నాడా ఇబ్బంది పడుతున్నాడా అనేది గమనించి గాలి పీల్చుకోవ డంలో ఇబ్బంది ఉంటే ఆర్టిఫిషి యల్‌గాగాలిని నోటి ద్వారా ఇవ్వవల్సి ఉంటుంది అలాగే నోటిలో నాలుక వెనుకకు మడత పడి ఉంటే దానిని వేలితో మామూలుగా ముందువైపుకు లాగాలి ఆ వ్యక్తి నోటిని తెరిచి ఒక వైపుగా ప్రక్కన కూర్చొని నోటిలో నోరుపెట్టి బాగా గాలి ఊదాలి నిమిషమునకు 18సార్లు ఊదగలగాలి అలాగే ఛాతీమీద చేయివేసి నొక్కుచుండాలి

ప్ర:- చిన్న పిల్లలు ఏవైనా వస్తువులు మింగడంవలన గొంతుకు అడ్డంపడినప్పుడు ఏం చేయాలి?

జ:- పిల్లలకు ఇలా అడ్డం పడినప్పుడు మింగటానికి, గాలి పీల్చడానికి ఇబ్బందిగా నున్నప్పుడు ఆ వ్యక్తి వెనుకవైపు మీరు ఉండి ఆ అబ్బాయి తలను బాగా ముందుకు వంచాలి, సుమారు పొట్ట వరకు వంచాలి మీ రెండు చేతులను పొట్టదగ్గరకు వదుం ఇరువైపులనుంచి పోనిచ్చి గట్టిగా పొట్ట నొక్కుచుండటం వలన మింగిన వాటిని బయటకు కక్కగల్గుతారు అప్పటికి రాకపోతే వెంటనే దగ్గరలోనున్న డాక్టరు దగ్గరకు తీసుకు వెళ్ళాలి

ప్ర:- డాక్టరుగారూ, పాము కరిస్తే వెంటనే ఎటువంటి జాగ్రత్తలు తీసుకోవాలి?

పాముల్లో చాలా రకాలు ఉన్నాయి అన్ని పాములకు విషం ఉండదు కనుక ముందుగా ఆ వ్యక్తి గాబరా చెందకుండా ఉండేందుకు ధైర్యం చెప్పాలి ఆ తరువాత కరిచిన పామును వీలుగా ఉంటే చంపివేసి దాన్ని జాగ్రత్తగా ఉంచి డాక్టరుకు పామును చూపించాలి కాటువేసిన గాయాన్ని జాగ్రత్తగా పరిశీలించాలి ఆ గాయానికి పై భాగ మున తాడుతోగాని, గుడ్డతోగాని బిగించి కట్టాలి. అలా చేయకపోతే వెంటనే విషం శరీరం మొత్తం వ్యాపిస్తుంది పాము కరిచినప్పుడు పరిగెత్తడం,



ఎక్కువగా నడవడం చేయకూడదు పాము కోరల గాట్లు ఉన్నచోట నిలువుగా బ్లేడుతో కోయాలి అడ్డంగా కోస్తే నరాలు తెగుతాయి సెంటిమీటరు పొడవు అరసెంటిమీటరు లోతు గాయంకోయాలి సబ్బుతో గాయం బాగాకడగాలి. పాముకరచిన అయిదారు నిమిషాలలో ఇలా చేయాలి వెంటనే డాక్టరు వద్దకు తీసుకు వెళ్ళాలి అప్పుడు 'యాంటి స్నేక్ వీనం సీరం' ఇంజక్షన్ ఇస్తారు ఈ ఇంజక్షన్ పాము కరచిన 3గం॥ లోపే ఇప్పించాలి

ప్ర:- ఎముకలువిరిగినప్పుడు ఎలాంటి జాగ్రత్తలు తీసుకోవాలంటారు?

జ:- సాధారణంగా ఎముక విరిగినప్పుడు ఆ విరిగిన చోట చాలా నొప్పి అనిపిస్తుంది. అక్కడ ఎటువంటి కదలికలు చేసినా బాగా నొప్పిగా అనిపిస్తుంది.కాలు ఎముక గాని, చేతి ఎముకగాని విరిగిన ప్పుడు ఆ భాగాన్ని కదలకుండా చూడాలి వీలైనంత వరకు విరిగిన ఎముకను స్థిరంగా ఉంచాలి అలా చేయడం వలన విరిగిన చోట ఉండే కండరాలకి, రక్త నాళాలకి మరింత నష్టం కలగకుండా చేయగల్గుతున్నామన్న మాట ఎముకలుకదలకుండా వెదురు పుల్లలు లేదా మందపాటి అట్టతోగాని ఎముక కదలకుండా కట్టుకట్టి డాక్టరు దగ్గరకు తీసుకువెళ్ళాలి చేతి ఎముక విరిగినప్పుడు చేతిని కట్టు కట్టిన తరువాత ఆ చేతిని పొట్ట మీదుగా ఉంచి మెడ నుంచిదింపిన ఒక గుడ్డతో కట్టి ఉంచితే నొప్పిలేకుండా హాయిగా ఉంటుంది

ప్ర:- ఫిట్స్ లాంటివి వచ్చినప్పుడు ఏం చేయాలి?

జ:- సాధారణంగాతీవ్రంగాజ్వరంవచ్చినప్పుడు పిల్లలకు ఫిట్స్ వస్తుంటాయి అందుచేత జ్వరం బాగా వచ్చినట్లయితే శరీరంపై ఉన్న బట్టలనుతీసి చన్నీళ్ళ గుడ్డతో తుడుస్తూండాలి. అలాగే చల్లగా ఉన్న ప్రదేశంలో రోగిని ఉంచాలి

దెబ్బ తగలడం వలన కాని ఇంకా ఇతర కారణాల వలన కాని ఎవరైనా స్పృహకోల్పోతే ఆ వ్యక్తిని పడుకో పెట్టాలి కాళ్ళవైపు ఎత్తుగాను, తలవైపు పల్లంగాఉండేటట్లు పడుకోపెట్టాలి ఊపిరి పీల్చడం కష్టంగా ఉంటే నాలుకను బయటకు వేలితోలాగాలి. ఒకవేళ వాంతి అవుచున్నట్లయితే తల ప్రక్కకు త్రిప్పి ఉంచాలి.అలా చేయడం వలన వాంతి అయిన పదార్థం శ్వాసకోశంలోకి వెళ్ళకుండా ఉంటుంది అలా చేయకపోతే ఊపిరి ఆగిపోవచ్చు

ప్ర:- వెక్కిళ్ళు వస్తున్నప్పుడు ఏ



విధంగా జాగ్రత్త వహించాలి?

జ:- వెక్కిళ్ళు వస్తున్నప్పుడు కొద్ది సెకండ్లు ఊపిరి బిగపట్టి ఉంచినట్లయితే తగ్గిపోతాయి.అలాగేచల్లటి నీళ్ళు త్రాగించినా తగ్గిపోతాయి అప్పటికి తగ్గక పోతే డాక్టరు దగ్గరకు తీసుకువెళ్ళాలి

ప్ర:- ఒక్కోసారి చెవిలోకి చిన్న చిన్న కీటకాలు వెళుతుంటాయి అప్పుడు ఏమి చేయాలి?

జ:- నూనె కొంచెం వేడిచేసి చెవిలో వేయడం వలన అవి చనిపోతాయి కొన్ని రకాలైన కీటకాలు చెవిలోకి టార్చ్ లైట్ వేయడం వలన కూడా బయటకు వచ్చేస్తాయి ఆ తరువాత డాక్టరు దగ్గరకు తీసుకువెళ్ళి చూపించాలి.

ఇంటర్వ్యూ:
హిప్నాటిస్ట్ టి.ఎస్.రావ్

# సినిమా..సినిమా..

-జి.వి.జి.

## "బావగారు"లో డాక్టరమ్మ

రంగురంగుల జెండాలతో అలంకరించబడిఉంది ఆ ఆస్పత్రి. గుమ్మానికి ఎర్ర రిబ్బన్ సగం, నీలం రిబ్బన్ సగం ముడివేయబడిఉన్నాయి. వాటిని చూసి, "ఇదేమిటి ?" అంది డాక్టర్ జ్యోతి (గౌతమి).

"అదే డాక్టరమ్మా ! ఏదైనా కొత్తగా ప్రారంభిస్తే, రిబ్బన్ కత్తిరిస్తారు కదా ? పెద్ద రిబ్బన్ దొరకలేదు. నా సొంత రిబ్బన్ కలిపి ముడేశాను. మీకు కత్తెర అక్కర్లేదు. నేను వేసిన ముడి విప్పండంతే. కత్తిరిస్తే రిబ్బన్లు పాడైపోతాయి" అంది లక్ష్మి (మాధురి).

"ఆడపిల్ల ముడి వేయించుకోవాలేతప్ప -ముడులు విప్పకూడదు," అంటూ జ్యోతి రిబ్బన్ రెండుకొనలు తీసి లక్ష్మి మెడలో వేసింది. లోనికి వెళ్లగానే "అంతా బాగానే ఉంది. మరి వైద్యం చెయ్యాలంటే దానికి అవసరమైన సామాన్లు కావాలి కదా ? అవేం కనిపించేవేం ?" అందామె.

"డాక్టరమ్మా ! ఇప్పుడు మించిపోయింది ఏమీలేదు. ఏమేంకావాలో కాగితంమీద రాసి ఇవ్వండి. పట్నంవెళ్లి సాయంత్రానికల్లా కొనితెస్తాను. ఆ... ఇంతకీ ఎంతవుతుంది ?" అన్నాడు గోపి (సుమన్).

"పది పదేహేను వేలదాకా అవ్వొచ్చు" అంది జ్యోతి.

ఆలోచనలో పడ్డ గోపి వంక తిరిగి, "ఏమిట్రా, మిగతా పొలం కూడా అమ్మేస్తావా ?" అన్నాడు గంగరాజు (మహారథి).

"కాదు మామయ్య, మనిల్లు అమ్మేద్దాం," అన్నాడు గోపి.

"ఊరుకోండి. పొలం అమ్మిందే చాలకుండా ఉన్న ఇల్లు కూడా అమ్మేస్తావా ?" అంటూ జ్యోతి తన చేతి నుంచి గాజులు తీసి, "ఇదిగో...వీటి విలువెంతో నాకు తెలీదు. ఇవి అమ్మి, వచ్చినంత సామాను పట్టుకురా. వెళ్లు" అంది.

"ఆహాఁ. వద్దు డాక్టరమ్మ. వద్దు," అన్నాడు గోపి.

ఇంతలో ఓ పెద్దాయన "ఆగవమ్మా! ఎక్కడనుంచో ఊరుగాని ఊరు వచ్చిందే కాకుండా మా కోసం నీ వస్తువులు అమ్ముకోడానికి కూడా సిద్ధపడుతున్నావంటే, నిన్ను చూసి సిగ్గుపడుతున్నాం. ఇది ప్రజల అందరి అవసరం. గోపిగాడికున్నపాటి బుద్ధి పెద్ద మనుషులం మాకు లేకపోయింది. నా చందా రెండు వేలు ఇస్తున్నాను" అనగానే అక్కడ చేరినవారందరూ తలాకొంత చందా ప్రకటించారు.

ఎ. కోదండరామిరెడ్డి సమర్పణలో ఎమ్. సత్యనారాయణరెడ్డి నిర్మించిన మేగా మూవీ-మేకర్స్ "బావగారు" చిత్రానికి కథ, స్క్రీన్ ప్లే, మాటలు, పాటలు, దర్శకత్వం: సత్యమూర్తి.

## "ధ్రువనక్షత్రం"

"తల్లి, తోడబుట్టినవారికి దూరమై, కొన్ని పరిస్థితుల కారణంగా తనను తాను



"యముడికి యుముడు"లో అనూజా, డిస్కో-శాంతి

ఫలానా అని పైన చెప్పుకోలేని అగ్నిపరీక్ష అనుభవించే హీరో క్లిష్టమైన పాత్ర వెంకటేశ్‌ది. అతనివద్దకు విలన్స్ పంపిన మనిషిగా వచ్చినా చివరికి అతనికే సాయంచేసి అసువులుబాసే పాత్ర సోనూవాలియాది. బాధలను, కష్టాలను తనలోనే దాచుకునే ఉదాత్తమమైన పాత్ర శారదది," అన్నారు వై. నాగేశ్వరరావు. ఈయన దర్శకత్వంలో అశోక్‌కుమార్ నిర్మించిన శ్రీ ఉషా ఆర్ట్స్ "ధ్రువ నక్షత్రం" చిత్రంలో రజని, భానుచందర్, శివకృష్ణ, రోహిణి, సత్యనారాయణ, నూతన్‌ప్రసాద్, గొల్లపూడి



"స్వరకల్పన"లో ఏడిద శ్రీరామ్, సీత



మారుతీరావు ఆదిగాగలవారు పాల్గొన్నారు. పరుచూరి సోదరులు కథ, మాటలు రాశారు. చక్రవర్తి సంగీతం, ఎస్. గోపాల్‌రెడ్డి ఛాయ, చంటి శిల్పం, మార్తాండ్ కూర్పు తెరవెనుక హంగులు.

## కృష్ణ, పి.సి. రెడ్డిల "ఏరువాక"

"గ్రామీణ నేపథ్యంలో సాగే నవరసభరితమైన కథ. ఆగస్టునుంచి షూటింగ్," అన్నారు పి. చంద్రశేఖరరెడ్డి. ఈయన కథ, స్క్రిన్‌ప్లే, దర్శకత్వంలో శ్రీ అరవింద్ ఆర్ట్ క్రియేషన్స్ సత్యనారాయణ నిర్మించే "ఏరువాక" చిత్రంలో కృష్ణ సరసన శాంతిప్రియ నాయిక.



"సాహసపుత్రుడు"లో
సుమన్, అంజాద్‌ఖాన్, శివాజీరాజా

## విడుదలకు సిద్ధమవుతున్న "గురుశిష్యులు"

"ఏప్రిల్ 26 నుంచి మే 6 వరకు మైసూరు, బెంగుళూరు, నందీహిల్స్‌లో పాటలను, కీలకమైన ఘట్టాలను ముగించాం భారీవ్యయంతో వేసిన గుహ సెట్‌లో జూన్ 9 నుంచి 11 వరకు పతాక సన్నివేశాలు చిత్రీకరించాం దీనితో షూటింగ్ పూర్తయినట్లే" అన్నారు ఎస్ సాంబశివరావు ఈయన సమర్పణలో ఎం పూర్ణప్రకాష్ నిర్మించే శ్రీ లతా ఆర్ట్ ప్రొడక్షన్స్ "గురుశిష్యులు" చిత్రంలో కృష్ణంరాజు, రాజేంద్రప్రసాద్‌ల సరసన సుమలత, కుష్బూ నాయికలు గొల్లపూడి మారుతీరావు, సుధాకర్, మహర్షి రాఘవ, కోట శ్రీనివాసరావు, రామకృష్ణ, హేమసుందర్, మాజా, మనోరమ, జయలక్ష్మి, సుధ ఇతర పాత్రధారులు గణేష్‌పాత్రో మాటలు, ఆత్రేయ పాటలు, ఇళయరాజా సంగీతం, వినాయకం ఛాయ, బి చలం శిల్పం, పి సరోజ నృత్యాలు, జూడో రత్నం సాహసాలు, విఠల్ కూర్పుతో ఎస్ పి ముత్తురామన్ స్క్రీన్‌ప్లే-దర్శకత్వ బాధ్యతలు వహిస్తున్నారు

## "ఆర్తనాదం"లో ఆరా

అంతా షూటింగ్‌కు బయలుదేరే హడావిడిలో ఉన్నారు సీతవద్దకు చైతన్య (రాజశేఖర్) వచ్చి, "మీతో కాస్త పర్సనల్‌గా మాట్లాడాలి రాత్రులు మీకు బాగా నిద్ర పడుతుందా? పోనీ - నిన్న రాత్రి మీరెక్కడికైనా - అంటే , అదే రూమ్ వదలి బయటకు వెళ్లారా?" అడిగాడు

"ఆ టైమ్‌లో నేనెందుకు బయటకెళ్తానండి? రాత్రి పది గంటలకు పడుకున్నానా? మళ్లీ ఉదయం ఆరు గంటలకు ప్రొడక్షన్ వాళ్ళొచ్చి తలుపుతట్టి టీ ఇచ్చేదాకా లేవలేదు చాలా? ఇంకేమన్నా వివరాలు కావాలా! లేడీస్ ఫస్ట్ అని మీ ఎంక్వయిరీ నాతోనే మొదలెట్టారన్న మాట?" అంది సీత

చైతన్య దీర్ఘాలోచనలో నిమగ్నుడయ్యాడు కె ఎస్ రామారావు సమర్పణలో కె బెనర్జీ నిర్మించిన ప్రమోద ఆర్ట్ ఫిలిమ్స్ "ఆర్తనాదం" చిత్రానికి ఎం వి రఘు స్క్రీన్‌ప్లే, ఛాయ, దర్శకత్వ బాధ్యతలు వహించారు

# మీ పాపాయికి అందించండి సెరిలాక్ లాభం



## తొలిసారిగా ఘన పదార్థాలను ఇస్తూ

4 నెలల నుంచీ మీ పాపాయికి. పాలతోబాటు ఘన పదార్థాలు కావాలి. సెరిలాక్ లాభాన్ని అందించండి.

పోషకాహార లాభం : సెరిలాక్ ప్రతి మోతాదులోనూ మీ పాపాయికి కావలసిన పోషక పదార్థాలు. ప్రోటీన్లు. కార్బోహైడ్రేట్లు. కొవ్వు పదార్థాలు. విటమిన్లు. ఖనిజాలూ అన్నీ వున్నాయి. అన్నీ సమ పాళల్లో వున్నాయి.

రుచి లాభం : పాపాయిలకు సెరిలాక్ రుచి ఇష్టం.

సమయం ఆదా లాభం : సెరిలాక్ ముందుగా వండినది. దానిలో పాలూ పంచదార వున్నాయి. దానిని వెచ్చటి నీటితో కలిపితే చాలు.

ఎంపిక లాభం : ఎంచుకునేందుకు మూడు రకాల సెరిలాక్ వుంది.

మీ పాపాయికి సమతూకంలో పోషకాహారాన్ని అందించేందుకూ తయారుచేయటంలో పరిశుభ్రతను పాటించేందుకూ డబ్బా మీది సూచనలను జాగ్రత్తగా పాటించండి.




6 మాసాలు నించి




4 మాసాలు నించి




6 మాసాలు నించి

ఉచితం
సెరిలాక్ బేబీ కేర్ బుక్
వ్రాయండి.సెరిలాక్
పోస్ట్ బాక్స్, నెం 3
న్యూ ఢిల్లీ 110008




## సెరిలాక్ రక్షణ: పోషకాహారంతో పరిపూర్ణం-ఎంతో రుచికరం

RK SWAMY/FSL/5112/TEL

సీరియల్

# వజ్రసంకల్పం

## సాతవాహన

(గత సంచిక తరువాయి)

కలియుగ క్రౌర్యం చేతులు చాస్తే,
ధర్మక్షేత్రం శ్మశానమైతే,
కళ్ళు తెరుస్తుంది కర్మక్షేత్రం!
ఉదయిస్తుంది వజ్రసంకల్పం!!

ప్రకృతిసిద్ధంగా భూమ్మీద శిలలు ఏర్పడే ప్రక్రియ అత్యంత క్లిష్టమైంది. అయితే అతి స్థూలంగా ఆ ప్రక్రియను మూడు భాగాలుగా విభజించవచ్చు. సృష్టికి ఆదిలో జరిగిన విస్ఫోటనం వల్ల మహాగ్ని ఏర్పడడం. అలా ఏర్పడిన ఆ మహాగ్ని ద్రవ రూపంలోకి పరిణామం చెందడం. అలా పరిణమించిన శిలాద్రవం చివరికి గట్టిపడడం. ఈ విభజన సామాన్యమైన విజ్ఞానం కలవారి కోసం.

శాస్త్రీయంగా ఆలోచించే వారి కోసం చెప్పాలన్నా కూడా శిల మూడు ప్రధానమైన దశల్లో స్థూలంగా ఏర్పడుతుంది. మొదటి దశ మేగ్మాటిక్‌సైకిల్. రెండో దశ మెటమార్ఫిక్‌సైకిల్. మూడో దశ సెడిమెంటరీ సైకిల్. ఖనిజాలు కూడా ఈ మూడు దశల్లోనే ఏర్పడతాయి.

రత్నాలు సామాన్యంగా ఖనిజాలు. కొన్ని రత్నాలు మాత్రం శిలలు. అయితే పరిణామ దశలు ఒకటే అయినా అన్ని సమయాల్లోనూ అన్ని ఖనిజాలూ అన్ని శిలలూ రత్నాలుగా రూపొందవు. అదే జరిగి వుంటే సృష్టిలో అన్నీ రత్నాలే అయివుండేవి. అప్పుడు అరుదుగా దొరికే రాళ్ళకు విపరీతమైన విలువ వచ్చి వుండేది.

ఖనిజాలూ శిలలూ రత్నాలుగా ఏర్పడాలంటే పైన చెప్పిన మూడు దశలు కాక ప్రకృతి అదనంగా ఇంకా చాలా సహాయపడాలి. ఎంతో అరుదుగా తప్ప అది సాధ్యపడదు. అందుకే రత్నాలు ఎంతో అరుదుగా తప్ప దొరకవు. అరుదుగా దొరకడం వల్లనే వాటికంత విలువా, మోజూ.

ప్రకృతి ఈ అపురూపమైన సంపదల్ని భూమ్మీద కొన్ని ప్రాంతాలకు మాత్రమే వరంగా ఇచ్చింది. ఆ వరం పొందిన ప్రాంతాలలో భారతదేశం కూడా వుంది. నిజానికి భారతదేశానికి ఆ వరం కొంచెం ఎక్కువగానే లభించిందేమో! అందుకే భారతదేశానికి రత్నగర్భ అనే పేరొచ్చింది.

కొన్ని ప్రత్యేకమైన శాస్త్రీయ పద్ధతుల ద్వారా చాలా కష్టపడి ఆ రత్నాలు దొరికే గనులెక్కడున్నాయో కనిపెట్టవచ్చు. ఇక సామాన్యుల విషయానికొస్తే వజ్రాలు దొరికే ప్రదేశాల్లో ఇసుక కూడా మెరుస్తుందని ఒక నమ్మకం ప్రచారంలో వుంది.

సరిగ్గా ఆ నమ్మకమే వజ్రపాణికి విశ్వధరవర్మకు

వజ్రసంకల్పం నేపథ్యంలో

## శ్రీవారికి అపూర్వ కిరీటం!

ఇటీవలే మన ఏడుకొండలవాడి శిరస్సునలంకరించిన ఈ అద్భుత కిరీటం ప్రపంచంలో అన్నింటికంటే ఖరీదైన ఆభరణంగా గుర్తింపు పొందింది. మొత్తం 3,500 కేరెట్ల బరువున్న 28,369 వజ్రాలను 26 కిలోగ్రాముల బంగారంలో పొదిగి తయారు చేసిన ఈ శ్రీవారి కిరీటం ఆరుకోట్ల రూపాయల విలువ చేస్తుందని 1985నాటి అంచనా. కాకలు తీరిన నలభై మంది స్వర్ణకారులు ఏడు నెలలు నిర్విరామంగా పని చేసి 67.5 సెంటీమీటర్ల ఎత్తైన శ్రీవారి కిరీటాన్ని ప్రపంచంలోని అత్యుత్తమ ఆభరణంగా తీర్చిదిద్దారు. శ్రీవారికి అపూర్వమైన కిరీటం చేయించాలని సంకల్పించుకున్న తర్వాత కిరీటం డిజైన్ తయారై



ప్రాజెక్టు పూర్తి రూపు ధరించడానికి పన్నెండు సంవత్సరాలు పట్టింది. 1985 డిసెంబర్ 20వ తేదిన ధగధగాయమానంగా మెరిసిపోతున్న ఈ మహాభరణం శ్రీవారి శిరస్సునలంకరించింది.

వెలిసిన బీడు భూమిలో వజ్రాలు దొరకవచ్చుననే అనుమానం కలిగించింది. ఆ బీడు భూమిలో చిన్న చిన్న గులకరాళ్ళు కూడా మెరుస్తున్నట్టుగానే వుంటాయి కొన్ని శాస్త్రీయమైన పరీక్షలు రహస్యంగా జరిపి వజ్రపాణి తన అనుమానం ధృవపర్చుకున్నాడు అప్పట్నుంచీ అతనా బీడు భూమి మీద ఒక కన్ను వేసే వుంచాడు ఎప్పటికైనా తన దాయాది అయిన విశ్వధరవర్మను వూళ్ళొంచి తరిమేసి ఆ బీడు భూమిని తానే స్వంతం చేసుకోవాలనే వుద్దేశ్యంతో వున్నాడు అలాంటి సమయంలో విశ్వధరవర్మ ఆ బీడు భూమిలో బావి తవ్వి వ్యవసాయం చెయ్యాలనే నిర్ణయానికి రావడం అతని స్వార్థపూరితమైన హృదయాన్ని ప్రజ్వలింపజేసింది అతను విశ్వధరవర్మను బెదిరించి రావడం అకారణంగా చేసిన పనికాదు

వజ్రపాణి నివసించే పురాతన కాలం నాటి హవేలీలోని ఒక రహస్య మందిరం అత్యంత వైభవోపేతంగా వుంటుంది ఎవైపు చూసినా వజ్రాలూ వైడూర్యాలూ ఆ మందిరం నిండా వున్న నగ్న ప్రతిమలకు వజ్రాల కిరీటాలు వున్నాయి రత్నాల నగలూ వున్నాయి

రోజులో ఎక్కువసేపు అక్కడే ఆ మందిరంలోనే వుండిపోయి ఆ వజ్రవైడూర్యాలకేసి ఎచ్చివాడిలా చూసుకుంటూ గడిపేస్తాడు వజ్రాలు అతని బలహీనత లోకంలోని వజ్రాలన్నీ తనే సేకరించాలనే పేరాశ తీర్చుకోవడమే అతని జీవితధ్యేయం. వజ్రాలే అతని పంచప్రాణాలు. ఆ వజ్రాల గదిలోకి అత్యంత ఆంతరంగికులకు తప్ప ఇతరులకు ప్రవేశించే అర్హతలేదు అసలా హవేలీలో ఆ రహస్య మందిరం వున్న సంగతే ఇతరులెవ్వరికీ తెలీదు

ఆ రహస్య మందిర ద్వారం తెరుచుకునే వేళకు ఓ నగ్న ప్రతిమ తలపైని వజ్రాల కిరీటం తీసి తన తలపైన పెట్టుకుని అద్దంలో చూసుకుంటూ అనిర్వచనీయమైన ఆనందం అనుభవిస్తున్నాడు

రహస్య మందిరం తలుపు తెరుచుకుంటూనే ఒక వ్యక్తి హడావుడిగా లోపలికి ప్రవేశించాడు

వజ్రపాణి వులిక్కిపడి అతని వైపు చూశాడు

వజ్రాల కిరీటం ఇంకా వజ్రపాణి తల మీదే వుంది ధగ ధగా మెరిసిపోతున్న ఆ కిరీటం ధరించడం వల్ల ముందే ఆకర్షణీయమైన అతని ముఖం మరింత ఆకర్షణీయంగా కనిపిస్తోంది లోపలికి ప్రవేశించిన ఆ వ్యక్తి వజ్రపాణిని చూస్తూనే కళ్ళప్పగించి నిలబడిపోయాడు

వజ్రపాణి నెమ్మదిగా తన తల మీది కిరీటం తీసి అతి జాగ్రత్తగా తిరిగి నగ్న ప్రతిమ తల మీద వుంచాడు

''ఏమైనా వార్త తెచ్చావా జయరాజ్?

అతనా ప్రశ్న అడుగుతూనే ఆ వ్యక్తికి తనొచ్చిన పని గుర్తుకొచ్చింది

'యస్ బాస్!' అన్నాడు ఎలర్ట్ అయిపోతూ

'ఊఁ చెప్పు!'

''విశ్వధరవర్మ తవ్విస్తున్న బావిలో నీళ్ళు పడ్డాయ్ బాస్!

వజ్రపాణి మొహం జేవురించింది

''ఊఁ ఇంకా?

''సరిగ్గా అప్పుడే ఓ మహాద్భుతం జరిగింది బాస్!

''మహాద్భుతమా! ఏమిటది?

''మీరు చెప్పినట్లే చాటుగా వుండి అక్కడేం జరుగుతున్నదో సీక్రెట్‌గా గమనిస్తున్నాను బాస్! ఇంతలో

వజ్రపాణి మొహం చిట్లించాడు

''ఉపోద్ఘాతాలు మాని సూటిగా ఆ అద్భుతం ఏమిటో చెప్పు!' కసిరాడు

జయరాజ్ గుటకలు మింగాడు

''విశ్వధరవర్మకు బ్రహ్మాండమైన వజ్రం దొరికింది బాస్!

'ఆ మాట వింటూనే వజ్రపాణి అదిరిపడ్డాడు

ఏమన్నావ్? మళ్ళీ చెప్పు!' ఆతృత కప్పిపుచ్చుకుంటూ అన్నాడు

విశ్వధరవర్మకు వజ్రం దొరికింది బాస్ బ్రహ్మాండమైన వజ్రం! అంత పెద్ద వజ్రం నా జన్మలో చూడలేదు! ఎన్ని కారెట్లుంటుందో చెప్పలేను గానీ విశ్వధరవర్మ అయిదువేల కారెట్లుండవచ్చని అరవడం విన్నాను

వజ్రపాణికి షాక్ తగిలినట్లయింది

తల గిర్రున తిరిగిపోయినట్లైంది

అయిదువేల కేరెట్ల వజ్రం!

మైగాడ్!

అయిదు వేల కేరెట్ల ముడి వజ్రం!

ఇది సంభవమా?

జరిగిన కధ - 3 చేయని నేరానికి ఉరిశిక్ష పడి జైల్లోవున్న కొడుకును కలుసుకునేందుకు కాళ్లపారాణికూడా ఆరని తన కోడలికి అవకాశం కల్పించవలసిందిగా తనకు ఓనమాలు నేర్పిన మాస్టారు జైలర్ సత్యాన్ని అర్థించగా అందుకు అంగీకరిస్తాడు ఒకరోజు రాత్రి ఆ అమ్మాయికి భర్తను కలుసుకునే అవకాశాన్ని కల్పిస్తాడు. తమకు జరిగిన అన్యాయానికి ప్రతీకారం తీర్చుకోగల మగబిడ్డను ప్రసాదించమని భర్తను కోరుకుంటుంది ఆ యువతి విశ్వధరవర్మకు తండ్రి అనంతరం మిగిలిన బీడు భూమిని దాయాది వజ్రపాణి కాజేయాలనుకుంటాడు ఆ భూమిలో త్రవ్విన బావిలో నీళ్లుపడి అందులో అపురూపమైన వజ్రం లభిస్తుంది విశ్వధరవర్మకు

జయరాజ్ చెబుతున్న మాట నిజమే అయితే

నిజమే అయితే

ఓ మైగాడ్ !

ఓ మై గాడ్ !!

మానవజాతి కనీవినీ ఎరుగని మహా వజ్రం!!!

"విశ్వధరవర్మ ఆ వజ్రానికి సూర్యనేత్రం అన్న పేరు "

జయరాజ్ చెబుతున్న మాటలేవీ వజ్రపాణికి వినిపించడం లేదు దిగ్భ్రమపాలైన మెదడును కంట్రోల్‌లోకి తెచ్చుకుంటూ దిగ్గున లేచి నిలబడ్డాడు

"నా అనుమానం నిజమైంది జయరాజ్! నా అనుమానం నిజమైంది!" బిగ్గరగా అరిచాడు

జయరాజ్‌కు అతను చెబుతున్నదేమిటో అర్థం కాలేదు

కళ్ళప్పగించి చూశాడు

వజ్రపాణి అతని వైపు చూడ్డంలేదు

కొద్దిసేపు శిలాప్రతిమలా నిలబడిపోయి తనలో తనే ఏదో గొణుక్కుంటూ నెమ్మదిగా తిరిగి కుర్చీలో కూర్చుండిపోయాడు

అతని మస్తిష్కం తీవ్రంగా ఆలోచిస్తోంది

* * * *

అర్ధరాత్రి కావస్తోంది

రాజేంద్రవర్మ మంచం మీద దిగ్గున లేచి కూర్చున్నాడు ఎంత ప్రయత్నించినా నిద్ర పట్టడం లేదతనికి ఎందుకో తెలీదు మనసంతా మహోద్వేగ పూరితంగా వుంది ఎందుకేమిటి- సూర్యనేత్రం! సూర్యనేత్రం మూలంగానే తన మనసిలా తయారైంది!





తమిళనాడు శాసనసభ ప్రతిపక్ష నాయకురాలు, ఎ ఐ ఎ డి. ఎం. కె ప్రధాన కార్యదర్శి కుమారి జయలలితను కోర్టులో హాజరు పరచవలసిందిగా మద్రాసు హైకోర్టులో హెబియస్ కార్పస్ పిటిషన్ దాఖలయిందట

ఇటీవల ఆమె అదృశ్యం అయిందన్న వార్త సంచలనం సృష్టించటంతో ఆ పార్టీ ఉపప్రధాన కార్యదర్శి వివరణ యిస్తూ కుమారి జయలలిత అనేక వ్యాధులతో బాధపడుతుండటంతో బెంగుళూరులోని ఒక క్లినిక్‌లో ప్రకృతి చికిత్స చేయించుకుంటున్నదని, త్వరలో తమిళనాడు వస్తుందని అన్నారట

బెంగుళూరులోని యోగ కేంద్రంలో ఆమెను కలుసుకోవాలని ప్రయత్నించి విఫలమైన తమిళవార పత్రిక 'తరాసు' సంపాదకుడు శ్రీ శ్యామ్ ఆమెను కోర్టులో హాజరుపరచాలని ఈ పిటిషన్ వేశారు. ఆమె అనుచరుడు నటరాజన్ ఆమెను అక్రమంగా నిర్బంధించాడని కూడా ఆయన ఆ పిటిషన్‌లో ఆరోపించారట.

మరి ఆమెను కోర్టులో హాజరుపరుస్తారో లేక అజ్ఞాతవాసంలోనే వుంచుతారో ఎవ్వరికీ అంతుచిక్కటం లేదట!

రాజేంద్రవర్మకు తెలుసు- ఇక మీదట తమ జీవితం ఇదివరకులా వుండబోదు! ఇకమీదట తమ జీవితం ఇదివరకులా ఎన్నటికీ వుండబోదు అతని మనసే ఇప్పుడొక సూర్యనేత్రంలా వుంది అతనా వెలుగును తట్టుకో లేకుండా వున్నాడు

అదే అదే వజ్రాలకుండే ఆకర్షణ శక్తి!

దేదీప్యమానంగా వెలుగుతున్న జ్వాల శలభాన్ని ఆకర్షించినట్టు యుగయుగాలుగా వజ్రాలు మానవ హృదయాన్ని ఆకర్షిస్తూనే వున్నాయి ఆకర్షిస్తూనే వుంటాయి

రాజేంద్రవర్మ మనసులోంచి పెల్లుబుకుతున్న మహోద్వేగానికి నిలదొక్కుకోలేక చివాల్న మంచం దిగి తలుపు వైపు పోబోతూ చటుక్కున ఆగిపోయి వెనక్కి తిరిగి చూశాడు

అతని భార్య!

మంచం మీద లేచి కూర్చుని అతని వైపే జాలిగా చూస్తోంది!

ఆమెకూ తెలుసు చాలా స్పష్టంగా తెలుసు ఇక మీదట తమ జీవితాలు ఇదివరకులా ఎన్నటికీ వుండబోవు!

సూర్యుడిలా మండే ఆ వజ్రం తన భర్త నిద్రను కాల్చేస్తోంది

ఇకమీదట అతను సుఖంగా నిద్రపోలేడు

అవును ఇక మీదట తమ జీవితాలు ఇదివరకులా వుండబోవు

ఒక్క రోజులో తమ జీవితాలు మారిపోయాయి పూర్తిగా మారిపోయాయి!

మానవజాతికి ఎలాంటి ఉపయోగమూ లేని వజ్రపుతునక మీద మనిషికి ఎందుకింత వ్యామోహం!

ఆమె భర్తను జాలిగా చూస్తూనే వుంది అతను భార్యను చూస్తూనే ఒక్క క్షణం ఆలోచించి చిన్నగా నిట్టూరుస్తూ ఆమె పక్కకెళ్ళి కూర్చున్నాడు

నిద్ర పోలేదా లక్ష్మీ? అనునయంగా అడిగాడు

ఆమె తల అడ్డంగా వూపింది

లేదు మీరు నిద్రపట్టక అటూ ఇటూ కదులుతూ ఆలోచిస్తుంటే చూస్తున్నాను

అతను మరోసారి నిట్టూర్చేడు

ఇక నాకు ఎన్ని రోజులకు మళ్ళీ సుఖంగా నిద్రపడుతుందో వూహించ లేకుండా వున్నాను లక్ష్మీ! కళ్ళు మూసినా తెరిచినా ఆ వజ్రమే నాకు కళ్ళల్లో మెదులుతోంది! ఒక్కసారి వెళ్ళి మళ్ళీ ఆ వజ్రాన్ని కళ్ళతో చూడాలనిపిస్తోంది

ఎందుకు?

ఆ వజ్రం అక్కడే వుంటుందో లేదోనన్న భయం! అది దొరికిన చోటనే దాచి పెట్టి నాన్నగారు మంచి పనే చేశారా అని అనుమానం కలుగుతోంది ఎలాంటి రక్షణా లేకుండా అదా బిలిలోనే ఉండిపోవడం క్షేమం కాదేమో! అది అక్కడున్నట్టు వజ్రపాణి తెలుసు కుంటాడేమో! వజ్రం దొరికిన విషయం నాన్నగారు అతి రహస్యంగా వుంచినా నాకెందుకో వజ్రపాణికి ఈపాటికే దాని సంగతి తెలిసిపోయిందని భయం కలుగుతోంది! ఇప్పటికే వజ్రపాణి చేతులు ఆ వజ్రం మీద పడ్డాయేమో!

అతను ఒక్కసారిగా లేచి నిలబడి గోడకు వేలాడుతున్న తాతలనాటి ఖడ్గాన్ని ఒరనుండి బయటకు లాగాడు

"నేను వెళ్తున్నాను లక్ష్మీ!"

ఆమె కంగారుగా అతని చెయ్యి పట్టుకుంది

ఆగండి! ఎక్కడికి?

ఆ బావి దగ్గరికి!

ఆఁ! ఈ అర్ధరాత్రి వేళ

నన్నాపకు లక్ష్మీ! ఆ వజ్రం అక్కడుండగా నేనిక్కడ ఒక్క క్షణం కూడా నిలవలేకుండా వున్నాను

ఒక్క క్షణం ఆగండి! ఆమె అతని కళ్ళల్లోకి సూటిగా చూసింది!

వెళ్తానంటే మిమ్మల్ని నేనాపను కానీ మిమ్మల్ని ఒంటరిగా వెళ్ళనివ్వను నేనూ మీ వెంట వస్తాను

అతను అసహనంగా ఏదో చెప్పబోతూ ఆగిపోయాడు

ఆమె కళ్ళల్లో దృఢ నిశ్చయం స్పష్టంగా కనిపిస్తోంది

తన భార్యది చాలా శక్తివంతమైన వ్యక్తిత్వం ఆమె ఒక నిర్ణయానికి వచ్చిందంటే ఆ నిర్ణయం నుంచి ఆమెను మళ్ళించడం అంత సులభం కాదు

ఆమె కళ్ళలో ఏదో వెతుకుతున్న వాడిలా చూసి అతను చిన్నగా నవ్వేడు

సరే పద!

డెస్కులోంచి పెద్ద టార్చి లైట్ తీసి అతను ముందుకు పోబోయాడు

నాన్నా నేనూ వస్తాను

అతను గిరుక్కున మరోసారి వెనక్కి తిరిగి చూశాడు

# వజ్రసంకల్పం

అతని పదేళ్ళ కొడుకు అనంత్

"హారి భడవా! నువ్వూ నిద్రపోలేదా?"

అనంత్ తల అడ్డంగా వూపేడు

"నేనూ వస్తాను నేనూ ఆ వజ్రం చూస్తాను" మారాం చేస్తున్నవాడిలా అన్నాడు

ఒక పసివాడిక్కూడా వజ్రమంటే !

అది పసితనంలోని చాపల్యమా లేక సూర్యనేత్రం అయస్కాంతంలా ఈ పసివాడ్ని ఆకర్షిస్తోందా!

రాజేంద్రవర్మ ఆ పసివాడ్ని చేతుల్లోకి తీసుకున్నాడు

"నువ్వూ మీ అమ్మలాంటి వాడివేరా జగమొండీ!"

అనంత్‌నెత్తుకుని వాళ్ళిద్దరూ గుమ్మం దాటి గది బయటికొచ్చారు

బయటికొస్తూనే అతను టక్కున నిలబడిపోయి ఆశ్చర్యంగా చూశాడు

"నువ్వూ తయారయ్యావ్?!!" విస్మయంగా అడిగాడు

"అంటే ఇందాకట్నుంచీ నువ్వు !"

అతని ఎదురుగా నిలబడ్డ పద్దెనిమిదేళ్ళ చెల్లెలు వెంటనే బుంగమూతి పెట్టేసింది

"నన్నూ తీసుకెళ్ళకపోతే ఒప్పుకునేది లేదు!" ఖచ్చితంగా చెప్పేసింది

"ఇది మరీ బావుంది నా వెనక సైన్యం తయారయ్యిందే! నేనేం వనబోజనానికి వెళ్తున్నానా ఈ అర్ధరాత్రి! ఆ వజ్రం సురక్షితంగా వుందో లేదో చూడ్డానికి వెళ్తున్నాను"

"అయినా సరే, నేనూ వస్తాను"

"అది కాదు శ్రావణీ !"

"అదేం కుదర్దన్నయ్యా! దొరికిన వజ్రాన్ని దొరికినట్టే మాకెవ్వరికీ చూపకుండా దాచిపెట్టేశారు నన్నూ తీసుకెళ్ళక తప్పదు"

రాజేంద్రవర్మ నవ్వేడు

"సరే పద! ఇప్పుడు నీ మాట వినకపోతే రేపు పెళ్ళయ్యాక నీ మేనల్లుడి కోసం కూతుర్ని కనివ్వవు గదా!" అన్నాడు

విశ్వదరవర్మకు ఇద్దరు కొడుకులు- ఒక్కతే గారాల కూతురు పెద్ద కొడుకు రాజేంద్రవర్మ చిన్నకొడుకు నరేంద్రవర్మ నరేంద్రవర్మ ఏదో పనిమీద హైదరాబాదు వెళ్ళి వారం రోజులైంది అతనికి ఇక్కడ జరుగుతున్న విషయాల గురించి ఏమీ తెలీదు ఆ రాత్రి రైలుకే అతను తెల్లవారు జాముకల్లా తిరిగిరావలసి వుంది

నరేంద్రవర్మకు ఇటీవలే పెళ్ళి అయింది ప్రేమ వివాహం పెద్దలు దగ్గరుండి జరిపించిన పెళ్ళే అది దగ్గర్లో ముహూర్తం లేక శోభనం వాయిదాపడింది

విశ్వదరవర్మ కూడా ఇంట్లో లేడు

సూర్యనేత్రాన్ని కనిపెట్టగానే ఆయన దాన్ని దొరికిన చోటే బావిలో దాచేసి ప్రభుత్వానికి దాని గురించి తెలియజేయడానికి వీరన్నని వెంట బెట్టుకుని కలెక్టర్ని కలుసుకోవడం కోసం జిల్లా హెడ్‌క్వార్టర్స్‌కు బయల్దేరి వెళ్లాడు మర్నాటివరకూ ఆయన తిరిగిరాడు

విశ్వధరవర్మ ఇద్దరు కొడుకుల్లో నరేంద్రవర్మ ఆలోచనాపరుడైతే పెద్దవాడైన రాజేంద్రవర్మ తొందరపాటు మనిషి అతని స్థానంలో నరేంద్రవర్మే వుండి వుంటే ఆ అర్ధరాత్రివేళ ఒంటరిగా సహాయం లేకుండా ఆ బావి దగ్గరికి వెళ్ళి వుండేవాడు కాదు ఒకవేళ వెళ్ళినా తన వెంట లక్ష్మి, శ్రావణీ, అనంతవర్మా రావడానికి ససేమిరా ఒప్పుకొనేవాడు కాదు

రాజేంద్రవర్మ ఉద్వేగాన్ని ఆపుకోలేక అనాలోచితంగా చేసిన పొరపాటే ఆ కుటుంబానికి ఘోరమైన శాపంగా పరిణమించబోతోంది

చేతిలో ఖడ్గంతో బయలుదేరిన తనని వెనక నుంచి నిశ్శబ్దంగా ఇద్దరు వ్యక్తులు అనుసరించడం అతను గమనించలేదు

(ఇంకా ఉంది)

# నా ఆశలను ఎవరైనా చూశారా

విస్సాప్రగడ ప్రణవచక్రి



తామరాడ గ్రామం నుండి యేపూరు వెళ్ళాలన్నా
మూడు కిలో మీటర్ల దూరంలో వున్న రాజా నగరం
వచ్చి బస్సు ఎక్కాల్సిందే! మరో దారి లేదు. అక్కడికి
కాకినాడ నుండి వచ్చే బస్సు మిట్ట మధ్యాహ్నం 12
గం.కి వస్తుంది.

పదిహేను రోజుల నుండి రోజూ కృష్ణ తామరాడ నుండి
వస్తూనే వున్నాడు.
మండుటెండలో రాసుకొన్న తలనూనె చెమట కలిసి ముఖ
మంతా కారుతుంది. ముఖం కందగడ్డలా ఎరుపెక్కి పోయింది.
కాలికి చెప్పులు లేవు. లూజు చొక్కా జారుతున్న లాగుని
వకచేత్తో పట్టుకొని నిలబడ్డాడు.
కాకినాడ నుండి బస్సు సరిగా టైమ్‌కే వచ్చింది. దిగుతు-
న్నవారు దిగుతుండగా ఎక్కుతున్నవారు తోసుకొని పోతున్నారు
బండిలోకి.
కృష్ణ దీనంగా "కండక్టరుగారూ నా చెప్పులు దొరికాయాం-
డీ? అంతా తోలుతోనే చేశారండి! తెల్లగా, వుంటాయండి!
పైన ఎర్ర పువ్వుంటుందండి!
ఎవరైనా దొరికితే యిచ్చారాండీ!
మళ్ళీ రేపు రానాండీ? ఆ రోజు యిలాగే అడిగాడు.
"లేదు బాబు" విసుగుదలలోనైనా జాలిగానే జవాబు చెప్పా-
డు కండక్టరు. ఆ రోజు కూడా, దుమ్ము రేపుకుంటూ
బస్సు కదిలి పోయింది.

పన్నెండు సంవత్సరాల కృష్ణ మనసులో గ్రద్దని పెంచాలనే వాంఛ పెరిగి పోయింది.

పోయిన నెల చుట్టాలిచ్చిన పది పైసలతో షరీఫ్ కిళ్ళీ కొట్లో సీసాలో వున్న లస్‌గో-రా వుండని కొనుక్కొని, నెమ్మదిగా కొంచెం కొంచెం ఎక్కడ అయిపోతుందో అనుకుంటూ తింటూ వీధిలో వస్తూ వుంటే చేతిలో వున్న వుండని గ్రద్ద గబుక్కున ఎత్తుకు పోయింది.

ఏమిటే జరిగిందా అని తెలుసుకొని తేరు-కొనేందుకు కొంచెం సేపయింది.

గబగబా తినేసినా బాగుండును ఉండ-

# నా ఆకుజోళ్ళు ఎక్కడైనా చూశారా?

లో చాలా భాగం అలాగే గ్రద్ద తన్నుకు పోయింది గ్రద్ద గోళ్ళు చేతిని గీరేసాయి కూడా రక్తం కూడ వస్తుంది వేళ్ళను నోటిలో పెట్టుకొని రక్తాన్ని అదిమేసాడు

బాగా ఏడుపొచ్చింది కృష్ణకి గ్రద్ద గిచినందుకు గాదు నోటి దగ్గర మూడొంతులు మిఠాయి వుండను లాక్కు పోయినందుకు గ్రద్ద మీద కసి బాగా పెరిగి పోయింది

పది రోజులయాక మళ్ళీ చుట్టాలొచ్చారు కృష్ణకి అపరిమితమైన ఆనందమైంది

వాళ్లు మిఠాయి తెచ్చారు దాన్ని ఇద్దరు అక్కలకి, ముగ్గురు తమ్ముళ్ళకి, వక చెల్లికి పంచేసరికి తన భాగం పంటి కిందకి రాలేదు

కృష్ణ 'వాళ్ల నాన్నగారు అర్ధాంతరంగా చనిపోయారు గంపెడు సంసారాన్ని చూసేందుకు ఆసరా వాళ్లకున్న 40-50 బాతులు వాటి గుడ్లను, బాతుల్ని అమ్మి వాళ్లమ్మ దానితో సంసారాన్ని గుట్టుగా ఈడుతుంది

అమ్మ వక బాతు కూర వండింది దాన్ని ముందు చుట్టాలకే పెడుతుంది పిల్లల వరకు వచ్చేసరికి దుమ్ములు సేరువామే మిగిలింది. ఆ రుచికరమైన భోజనం అయినా మరి చుట్టాలొస్తేనే కదా!

పండగలకి మాత్రం బాతుగుడ్ల కూర వండేది అరగదని సగం గుడ్డే వేసేది పిల్లలకి ఎప్పుడో గాని పూర్తి గుడ్డు ఛాన్సు దొరికేది కాదు తమ్ముళ్లతో అక్క చెల్లెళ్లతో కృష్ణకి తగాదా వచ్చేది కృష్ణ ఎంత ముందుగా 'ఆ పెద్ద గుడ్డు నాద'న్నా తమ్ముడు ప్రకాష్‌గాడు నేను ముందు చెప్పుకొన్నాను అది నాది అని గొడవ పెట్టేవాడు వాళ్లమ్మ అందర్ని బాది తగువు తీర్చేదనుకోండి

ప్రక్క సందులో దుంపల బడికి చాల వరకు ఎగ్గొట్టకుండానే వెళ్ళేవాడు కృష్ణ వాడికి వచ్చిన పాఠం చరిత్ర మేష్టారు చెప్పేవారు ఎన్నెన్నో కథలు బరోడా సంస్థానాధీశులు డేగల్ని ఎలా పెంచేవారు, ఎలా తర్ఫీదు యిచ్చేవారు శత్రువుల మీదకు పంపి వాళ్ల కళ్లు వాళ్లు పీకి తిరిగొచ్చి చేతి మీద ఎలా నిలుచునేవి అనే కథ ఆ రోజు చెప్పేసరికి ఎలాగైనా గ్రద్దల్ని పట్టేయాలి, మచ్చిక చేసుకోవాలి అనే పట్టుదల పెరిగి పోయింది దాన్ని సుబ్బారావు గాడి మీదకు పంపాలి వాడిని పీకించేయాలి. వాడు గోళీకాయల ఆట దగ్గర మోసం చేసాడు.

చుట్టాలు మళ్ళీ చిల్లర డబ్బులు యిచ్చారు మిఠాయి కొని అలా చేతిలో పెట్టుకొని వెళుతూ వుంటే ఆకాశంలో వున్న గ్రద్ద ఒక్క ఉదుటున చేతిలో వున్న ఉండను తన్నుకు పోతున్నపుడు గబుక్కున దాన్ని పట్టేయాలి

మరో ఆలోచన మిఠాయి వుండను ఎరగా గ్రద్దకు పెడితే కొంపదీసి మొన్నటిలా అది తన్నుకు పోతే? అందుకు ఖాళీ సిగరెట్టు పెట్టెల్లోని తగరాన్ని కొన్నిటిని పోగు చేశాడు నిమ్మకాయంత వుండచేసి అరచేతిలో పెట్టుకొని ఆకాశం వేపు చూపుతూ, తళతళ మెరిసే ఆ వుండని పట్టుకు పోవడానికి ఏ గ్రద్దవస్తుందోనిఆకాశం వైపు చూసుకుంటూ మిట్ట మధ్యాహ్నం ఎండలో బైలుదేరాడు కృష్ణ

గ్రద్ద రాలేదు గానీ,

ఎదురుగా వస్తున్న సైకిల్ని పైకే చూస్తున్న కృష్ణ గుద్దేశాడు కంకర రోడ్డు మీద బోర్లా పడ్డాడు రెండు మోకాళ్ళు శుభ్రంగా కొట్టుకు పోయాయి కుడికాలు పాదంలోకి సైకిల్ వూచ గుచ్చుకు పోయింది కృష్ణ ఏడుపు మొదలెట్టాడు సైకిల్ అతను కృష్ణను లేపి కాలిలో వూచను తీసి చుట్టూ ఎవరూ లేకపోవటం చూసి కళ్ళు నెత్తి కెక్కాయా

## నలభీమపాకం

### కావలసిన వస్తువులు:

సొరకాయ- ఒకటి, పంచదార- అర కిలో, ములక్కాయలు- ఎనిమిది, డాల్డా- వందగ్రాములు.

## సొరకాయ హల్వా

### తయారుచేయు విధానము:

ముందుగా సొరకాయను శుభ్రంగా కడిగి పై చెక్కు, గింజలు తీసి తురుముకోవాలి. ఆ తురుమును ఒక తెల్లటి గుడ్డలో మూటగట్టి దానిపై ఏదో కొంత బరువు వుంచాలి. అప్పుడు దానిలోని నీరంతా కారిపోతుంది. ఒక మూకుడు తీసుకుని అందులో డాల్డా పోసి కాచాలి మూటగట్టి పెట్టిన ఆ తురుమును అందులో వేసి ఎర్రగా వేయించాలి నీరంతయూ యిగిరిన తరువాత పంచదార వేయాలి. పంచదార వేసిన పిదప కొంచెం నీరు వూరుతుంది. మరలా ఆ నీరంతా యిగిరిన తరువాత మంచి సువాసన వస్తుంది ములక్కాయ పొడిని అందులో వేసి, బాగా కలిపి కొంచెం సేపు స్టవ్‌పై ఉంచి దించాలి ఒక అయిదు నిమిషాలు చల్లారిన తర్వాత తింటే భలే రుచిగా వుంటుంది.

-కెయల్జీజి గురుప్రకాష్

---

ఆంధ్రసచిత్రవారపత్రిక

మగవంటలు -"నల భీమపాకం" శీర్షికకి-

ఈ కూపన్ తప్పక జత చేయాలి -----

---

అని కృష్ణని తిట్టి, సైకిలు వూడ వూడినందుకు తిట్టుకుంటూ చక్కా పోయాడు.

మోకాళ్ళ దెబ్బలకి రోడ్డు మీద మట్టి అదిమాడు. భయం భయంగానే యింటికి వచ్చాడు. అనుకున్నట్టే అమ్మ కొరకంచెతో బడిత పూజ చేసింది. చొక్కా లాగు జేబుల్ని తడిమి దాచుకున్న రంగు రంగు రాళ్ళని, గోళీలని, నట్టులని, బోల్టులని అన్నిటిని తీసి బైట పడేసింది.

పెదవకానా, బజారులో చెత్తంతా, మేక గొడ్డెలన్నీ నీ జేబుల్లోకే, బట్టల్ని నాశనం చేస్తావు. గట్టిగా తిట్టింది.

రెండు రోజుల్లో దెబ్బలన్నీ బాగా మోపు చేశాయి కృష్ణకి.

ఆసుపత్రికి పోయి మాత్రలు గ్రీజులాంటి మలాము రోజు తెచ్చుకొనేవాడు. రోజూ వెళ్ళలేక వక పని చేసేవాడు.

కాంపొండరుకి కిటికీలో నుంచి చీటీని చూపిస్తే కాగితంలో మడిచి కొంచెం మలాము నిచ్చేవాడు. నలుగు రైదుగురు పేషంట్లును పోనిచ్చి మళ్ళీ లైనులో చేరి చీటీని చూపించేవాడు. పరాకుగా వున్న కాంపొండరు మళ్ళీ కాగితంలో మడిచి మందిచ్చేవాడు కాని అపుడపుడూ కనిపెట్టిన అతను ఒరే కుర్రాడా అని అరిచేవాడు. చీటీని లాక్కుని వినిపించుకోకుండా పరుగెత్తుకొచ్చేసేవాడు కృష్ణ.

కాళ్ళ పుండు మానేందుకు రెండు నెలలు పైగా పట్టింది. అరికాలులో పుండు మాత్రం మానినట్లు కనుపించినా నడిచేటప్పుడు బాగా నొప్పి పెట్టేది.

అమ్మ వీడి బాధను చూసే గాబోలు కాకినాడ వెళ్ళినపుడు దయాల్భాగు స్టోరులో ఆకుజోళ్ళు కొని వేసుకోరా వీటిని అని ఆప్యాయంగా కృష్ణ కిచ్చింది

కృష్ణ ఆనందానికి అవధులు లేవు. తన తోబుట్టువుల కెవ్వరికి కాకుండా తనకీ చెప్పులు కొన్నది వాళ్ళమ్మ. గర్వంగా వుంది. ఎంతో మురిసి పోయేవాడు. వీలైనంత వరకు వాటిని చంకలోనే పెట్టుకొని తిరుగుతున్నాడు.

ఆరోజు కాకినాడలో ఫలపుష్ప ప్రదర్శనానికి తీసుకొని వెళ్ళారు కృష్ణ మాష్టారు. పిల్లలందరికి సగం టిక్కెట్లే. కృష్ణ ఆకుజోళ్ళేసుకుని దర్జాగా బయలుదేరాడు. ఉదయం కలబడి తిరిగేశారు పిల్లలంతా.

పూలు, ఫలాలు, ధాన్యాలు పురుగుల మందులు... కోసిపెట్టిన శవాన్ని మాత్రం చూసే ధైర్యం వాళ్లెవరికీ రాలేదు. ఎన్నిటినో అలా చూస్తూ తిరిగారు తామరాకు అంత అప్పడాన్ని కొనుక్కుని తిన్నాడు కృష్ణ. ఐయిస్‌క్రీమ్‌ని మాత్రం తింటున్న వాళ్ళనలా చూసాడంతే, కొనుక్కునేందుకు జేబులో డబ్బులు లేవు. రంగులరాట్నం పెద్ద చక్రం దగ్గర కూడా కళ్ళు తిరుగుతాయని డబ్బులు లేవని ఎక్కకుండా ఎక్కేవాళ్ళని అలా చూసాడు కృష్ణ.

పదకొండు గంటలకల్లా నీరసపడి పోయారు పిల్లలంతా తిరుగు ప్రయాణానికి బస్సెక్కారు మాష్టారు అజమాయిషీలో. రాజానగరం చేరేసరికి సరిగ్గా పన్నెండు గంటలైంది. బాగా ఆకలేస్తుంది. పిల్లలంతా తోసుకొంటూ బస్సు దిగిపోయారు కృష్ణ కూడా దిగాడు బస్సు కదిలి దుమ్ము రేపుకొంటూ వెళ్ళి పోయింది.

సీటు క్రింద దాచుకొన్న కృష్ణ ఆకుజోళ్ళు బస్సులోనే ఉండి పోయాయి.

"నా ఆకు జోళ్లు.. నా ఆకు జోళ్ళు" కృష్ణ అరుపులు ఎవరూ వినిపించుకోనేలేదు బస్సువెళ్ళి పోయింది.

కృష్ణ చాలాసేపు అలా నిలబడి చూస్తూ వుండిపోయాడు.

ఏడుస్తూ యింటికి వెళ్ళాడు.

మర్నాడు సరిగ్గా పన్నెండు గంటలకి బస్సాగే చోటికి వచ్చాడు

బస్సాగగానే "కండక్టరుగారు, కండక్టరుగారు నా చెప్పులండి ఆకుజోళ్ళండి దొరికాయాండి, తెల్లగా ఉంటాయండి! ముందు సూదిగా ఉంటాయండి! పైన ఎర్ర పువ్వు ఉంటుందండి! ఎవరికైనా దొరికితే ఇచ్చారాండి?" అంటూ కండక్టరువైపు పరుగెట్టాడు.

"దొరకలేదు బాబు" కండక్టరు జవాబిచ్చాడు.

"మళ్ళీ రేపు రానాండీ ఎవరైనా యిస్తే జాగ్రత్తగా ఉంచండి".

ఈలోగా బస్సు కదిలిపోయింది.

# అసంప్రేక్ష్యకారిత్వము... పంచతంత్రము ...అయిదవ భాగము

(గతసంచిక తరువాయి)





















నందూరి రామమోహనరావు · బొమ్మలు బాపు






















(ఇంకా వుంది)

7-7-89



సీరియల్

# సూపర్ గర్ల్

## వింజమూరి విజయ శాంభవి

(గత సంచిక తరువాయి)

రాణి అమెరికన్ యువతి ఆమె అసలు పేరు జోనీ ఒకప్పుడు మన దేశం లోని అమెరికన్ రాయబార కార్యాలయంలో పనిచేసే ఆమె తన దేశానికి సంబంధించిన రహస్యాలను ఓ శత్రుదేశానికి అందజేస్తోందన్న అనుమానంచేత ఉద్యోగంలో నుండి డిస్మిస్ చేయబడింది! అమెరికా గవర్నమెంటు ఆమెకి దేశబహిష్కరణ శిక్ష విధించింది!

తరువాత ఆమె అమెరికా నుండి ఇండియా వచ్చేసి తనపేరు రాణిగా మార్చుకుని ఢిల్లీలో ఓ ఇల్లుకొనుక్కొంది! మొదట ఆమె తన దగ్గరున్న డబ్బుతో నీతిగానే బ్రతకాలనుకున్నది! కానీ ఆమెకి పాకిస్తానీ యువకుడైన మజర్‌తో పరిచయం అయింది! ఆ పరిచయం ప్రణయంలోకి దారి తీసింది!

రాణికి భారత గవర్నమెంటులో ఉన్నత కీలకమైన పదవుల్లో వున్న అధికారుల దగ్గర మంచి పలుకుబడి ఉండేది! వారితో ఆమె చాలా కలివిడిగా స్నేహంగా వుండేది! రాణి మంచి అందగత్తెకావటం ఆమెలోని చురుకుదనం పుట్టుకతో సహజంగా వచ్చిన చొరవ వీరికి ప్రత్యేక ఆకర్షణలు అయ్యాయి! పైగా రాణిని వుద్యోగంలో నుండి తొలగించిన విషయాన్ని అమెరికా ప్రభుత్వం రహస్యంగా వుంచింది! ఇది పరువు ప్రతిష్టలకి సంబంధించిన విషయం కావడంతో! రాణి మాత్రం తన ఇష్ట పూర్వకంగా ఉద్యోగాన్ని వదులుకున్నట్టు ఫ్రెండ్స్‌తో చెప్పేది!

రాణికి సహజంగా ధనదాహం జాస్తి! డబ్బుపట్లగల ఈ వ్యామోహంతోనే తన మాతృదేశానికి సైతం ద్రోహంతలపెట్టను ఆమె వెనుకాడలేదు! డబ్బుకోసం ఎంత సాహసానికైనా దుర్మార్గానికైనా పాల్పడగలదు రాణి! అక్షరాలా ఆమె గుణగణాల్ని పుణికి పుచ్చుకున్న మజర్ ఆమెకి తోడుగావడంతో ఇక ఆమెకి ఈ ఆశ అధికమయింది! ఇద్దరూ కలిసి పకడ్బందీగా ఒక ప్లాన్ రూపొందించుకున్నారు!

ఆ ప్లాన్ ప్రకారం రాణి తన హొయలు వగలూ చూపించి గవర్నమెంటులో కీలకమైన శాఖల్లో వున్న ఉన్నతాధికార్లని వలలో వేసుకుంటుంది! వారితోశారీరక సంబంధాలు పెట్టుకొంటుంది! నీడలా ఆమెని వెన్నంటి వుండే మజర్ ఆమెతో ఆ అధికారులు జరిపే శృంగార క్రీడల్ని ఫొటోలు తీస్తాడు!

తరువాత ఇద్దరూ కలిసి వాళ్ళని బ్లాక్ మెయిల్ చేసి అతి ముఖ్యమయిన దేశ రహస్యాలను రాబట్టి వాటిని ఏ శత్రుదేశానికో (అది పాకిస్తాన్ కావచ్చు చైనా కావచ్చు మరేదైనా కావచ్చు) అమ్ముకుంటారు! ఇలా ఒక పెద్ద మొత్తం సంపాదించాక ఏ స్విడ్జర్లాండ్‌కో వెళ్ళిపోయి హాయిగా బ్రతికేస్తారు! ఈ ప్లాన్‌ని వాళ్ళు అమలులో పెట్టారు!

రహస్యాలను సంపాదించటం వరకూ నిర్విఘ్నంగా నిరాటంకంగా వారు అనుకున్నది అనుకున్నట్లుగా పకడ్బందీగా ముగించ గలిగారు! ఆ తరువాతే వారికి తమ అదృష్ట దేవత వదిలి పెట్టి పోయిందా అన్నట్టు ఒకటి తరువాత ఒకటిగా జరిగాయి ఆ దుర్ఘటనలు!

వారియొక్క ఈ ప్లాన్‌ని మొదటే పసిగట్టి వారిని నీడలా అంటిపెట్టుకుని తిరిగిన ఢిల్లీ స్మగ్లర్ ధర్మరాజ్ వారి దగ్గర్నుండి ఆ రహస్యాలను కాజేసి తను సొమ్ముచేసుకోవాలని చూశాడు! ఈ విషయాన్ని రాణి మజర్‌లు పసిగట్టేశారు!

ధర్మరాజ్‌ని గురించి మజర్‌కి బాగా తెలుసు! ఒక్క స్మగ్లింగ్ బిజినెస్ లోనే గాక అనేక సంఘ విద్రోహక కార్యకలాపాల్లో ధర్మరాజ్‌కి సంబంధాలున్నాయి! వాటిని గురించి ఇక్కడ ప్రత్యేకంగా ఏమీ చెప్ప నక్కరలేదు!

అతడి దగ్గరున్న శంకర్ సంజన్ చండీరాజ్‌ల్లాంటి అనుచరులు పరమ దుర్మార్గులు! వీరి బారి నుండి తప్పించుకుని తాము దేశాన్ని వదిలి వెళ్ళడం అంత సులభంకాదని గ్రహించిన మజర్ కొంత కాలం పాటు వారి కళ్ళుగప్పి వార్ని తప్పుదారి పట్టించడానిగ్గానూ రాణిని రహస్యంగా హైదరాబాదు పంపేశాడు! ఈ లోపల ఈ విషయం ఢిల్లీలోని కొన్ని క్రిమినల్ గాంగ్స్‌కి తెలిసిపోయింది! ఎవరికి వారే ఈ రహస్యాలను చేజిక్కించుకోవడానికి ఆత్రుత పడసాగారు!

మజర్ వీరెవరికీ కనబడకుండా అండర్‌గ్రౌండ్‌లోకి వెళ్లిపోయాడు! రాణి హైదరాబాదులో రహస్య జీవితం గడుపుతోందన్న విషయం తెలుసుకున్న రెండు క్రిమినల్ గాంగ్స్ ఆమె కోసం హైదరాబాదుని జల్లెడ పట్టడం ప్రారంభించారు! ఆ గాంగ్‌లకి చెందిన వారే సోఫియా పాండే!

ధర్మరాజ్ మాత్రం ఈ గాంగ్ మనుషులు రాణిని బయటికి లాక్కువస్తారన్న విషయాన్ని ముందుగా వూహించి వినోదం చూస్తూ కూర్చున్నాడు! రాణి బయటికి వచ్చిన మరుక్షణం ఆమెని తను కొట్టుకు పోవాలన్నది అతడి ఉద్దేశ్యం! అంటే తన చేతులకి తడి అంటించుకో దలచుకోలేదు అతడు! ఈ సమయంలోనే అతడితో పేచీ వచ్చి విడిపోయిన అతడి వుంపుడుగత్తె కనకం అతడి కుడి భుజంలాంటి చండీరాజ్‌లు ఎవరికివారే ఆ రహస్యాలను తామే చేజిక్కించుకోవాలనే ఆత్రుత పడసాగారు! వీళ్ళ ఆరాటాల్ని ప్రయత్నాల్ని చిరునవ్వుతో గమనిస్తూ రాణి బయటికి వచ్చే క్షణం కోసం ఎదురు

జరిగిన కథ 24 :రాణికి సహాయం చేద్దామని కంకణం కట్టుకున్న కార్తికి అడుగడుగునా శత్రువుల ముఠాలు ఆటంకాలు కల్పిస్తుంటాయి. రోజ్‌ద్వారా సమాచారం తెలుసుకొని కార్తిని వెతుకుతూ మద్రాసు చేరిన చైతన్య నిరాశకు గురవుతాడు బావ అర్జున్ కళ్లుగప్పి తప్పించుకుపోయిన కార్తి వేరే హోటల్‌లో దిగుతుంది రాణి అత్తగారినంటూ ఒకావిడ వచ్చి ఆమె తాలూకు రెడ్ సూట్‌కేసును యివ్వమంటుంది. అది పసిగట్టిన శత్రువుల ముఠా కార్తిని కిడ్నాప్‌చేసి ఢిల్లీకి తీసుకువెళ్తుంది. ఆ ముఠా నాయకుడు తనను చంపాలని పథకంవేస్తున్న విషయాన్ని పసిగట్టి అక్కడినుంచి తప్పించుకున్న కార్తిని చైతన్య రక్షిస్తాడు.

చూడసాగాడు ధర్మరాజ్!

అతడు వూహించినట్టే రాణి ఓ క్రిమినల్ గాంగ్‌కి చెందిన హైదరాబాదు ఏజంట్ సోఫియా చేతికి చిక్కిపోయిందని ఆమెని బంధించి ఆమె దగ్గరున్న ఆ రహస్యాలను ఎక్కడ దాచిందో తెలుసు కోవడానికి సోఫియా ప్రయత్నిస్తోందని తెలిసింది అతడికి ! అయినా ధర్మరాజ్ తొణకలేదు!

" ఆ రహస్యం బయటపడనీ! తన చేతికి చిక్కకుండా ఎక్కడికి పోతుంది?" అనుకున్నాడు తను తాపీగా!

రాణి సోఫియా చేతికి చిక్కిపోయింది అన్న విషయం తెలిపిన వెంటనే తన బిగ్ బాస్‌ల నుండి పాండేకి చివాట్లూ అక్షింతలూ పడ్డాయి! అతడు సోఫియా దగ్గరున్న రాణిని తను చేజిక్కించుకోవడానికి ప్రయత్నాలు ప్రారంభించాడు! ఈ విషయమూ ధర్మరాజ్‌కి తెలుసు!

సోఫియా ఎంత టార్చర్‌కి గురిచేసినా రాణి ఆ రహస్యాన్ని గురించి చెప్పకపోవడం తరువాత తన ప్రాణాలు పోయినా సరే రహస్య పత్రాలున్న సూట్‌కేస్‌ని తన ప్రియుడు మజర్‌కి అందించాలన్న పట్టుదలతో ఆ అవకాశం కోసం ఎదురు చూస్తున్న రాణి తను బందీగా వున్న ఇంటికి ఎదురుగా వుండే ఇంటికి ప్రతినిత్యం వచ్చివెళ్ళే కార్తిని గమనించసాగింది!

అప్పుడే నౌఖరు ద్వారా కార్తిని గురించి అన్ని వివరాలు తెలుసుకుంది! ఆ నౌఖర్ ఒకప్పుడు కార్తి ఇంట్లో పని చేశాడు! కార్తిని గురించి వినగానే రాణి బుర్రలో ఓ బ్రహ్మాండమైన అయిడియా ఫ్లాష్ అయింది! దాని ప్రకారం ఆమె తనని ఎల్లవేళలా నీడలా అంటిపెట్టుకుని వుండే సోఫియా మనిషి జానీ కళ్ళుగప్పి కార్తి సహాయం అర్థించింది! పరోపకార గుణం కలిగిన కార్తి అందుకు ఒప్పుకుని ఆ బాధ్యతని నెత్తిన వేసుకోవడం జరిగింది! అంతకుముందే ఈ విషయాన్ని విజయవాడలో వుండే తమ ఫ్రెండ్ రంగనాయకికి తెలియజేసింది రాణి నౌఖర్‌కి తన డైమెండ్ రింగ్ ఇచ్చి అతడితో ఈ వార్త పంపింది రంగనాయకికి!

ఆ సూట్‌కేస్‌ని తన ప్రియుడు మజర్‌కి అప్పగించవలసినదిగా రంగనాయకిని కోరింది రాణి! అక్కడ రంగనాయకి రహస్య పత్రాలున్న సూట్‌కేస్‌తో రాబోయే కార్తి కోసం ఎదురుచూడసాగింది!

రాణి కార్తిని సహాయం అర్థిస్తూ వ్రాసిన ఉత్తరాన్ని జానీ అంతకుముందే చదవటం మూలాన అందులో



సూట్‌కేస్ దాచిన రహస్య ప్రదేశాన్ని గురించి రాణి తెలివిగా ఫ్రెంచి లాంగ్వేజిలో రాయడంతో ఆ భాష అర్థం గాని జానీ తనకళ్ళుగప్పి రాణి ఈ ఉత్తరాన్ని కార్తికి అందజేసిన తరువాత ఈ విషయాన్ని తమ నాయకురాలు సోఫియాకి తెలియజేసింది!

ఆ సూట్‌కేస్ కోసం రాబొయ్యే శాల్తీకోసం ఆపాడుబడ్డ పెంకుటింటి దగ్గర కాపు వేశారు సంజయ్ బృందం! అక్కడ వారికి టోకరా ఇచ్చి పారిపొయ్యి రాణి ఉన్న ఇంటిదగ్గరికి చేరుకుంది కార్తి! సరిగ్గా అదే సమయంలో రాణి ఆచూకీని పసిగట్టి అక్కడికి చేరుకున్న రెండో గాంగ్‌కి చెందిన పాండే మనుషులు రాణి నుండి రహస్యాలు రాబట్టడానికి ప్రయత్నించి అది కుదరక పోవడంతో ఆ కోపంతో ఆమెని కాల్చి చంపేశారు!

అప్పుడే సంజయ్ జాకబ్‌లు వారిని గుర్తించి జీపుతో గ్రుద్ది చంపేశారు! రాణి తన రహస్యాన్ని ఎవరికో అప్పగించిన విషయం పాండేకి తెలిసిపోవడం అక్కడ్నుంచి రెండు ముఠాలవారూ కార్తిని వెంబడించడం ప్రారంభ మయింది! సరిగ్గా ఇప్పుడే కార్తి ఇంటి సమీపంలో ఈ రెండు ముఠాలకి జరిగిన ఘర్షణలో పాండే అనుచరుడు ఒకడ్ని హత్య చేశాడు జాకాబ్!

పాండే కుడి బుజమైన రంజన్ కార్తి వచ్చి కలుసుకోబోయే లాయర్ రంగనాధ్‌గా భావించి అక్కడ కాపువేస్తే ఆ రంగనాధ్ సోఫియా మనిషి! కార్తి కూడా పారబడి అక్కడికి వస్తే ఆమెని నమ్మించి ఆ సూట్‌కేస్‌ని తమకి అందజేసే బాధ్యతని అతనికి అప్పగించింది సోఫియా! అయితే కార్తి మధ్యలోనే రంజన్ చేతికి చిక్కిపొయ్యి తనపొరపాటు గ్రహించి రంగనాయకి ఇంటికి బయలుదేరింది!

ఈ విషయాన్ని గురించి ఢిల్లీలో కూర్చునే ఎప్పటికప్పుడు వార్తలు సేకరిస్తున్న ధర్మరాజ్ రంగనాయకికి డబ్బు ఆశచూపించి ఆ సూట్‌కేస్‌ని తమకి అప్పగించేలా ఒప్పందం చేసుకున్నాడు! అయితే ఇంతలో సంజయ్ ఈ సూట్‌కేస్ ఎక్కడ తమ చెయ్యిజారిపోతుందో నన్న భయంతో రంగనాయకి ఇంటిని డైనమెట్‌తో పేల్చేశాడు! రంగనాయకి చావు దప్పి కన్ను లొట్టబొయ్యి హాస్పిటల్లో చేరింది!

అక్కడే కార్తి రంగనాయకిలా ఇంజనీర్ గారి ఇంటినుండి ధర్మరాజ్ మనిషితో మాట్లాడింది! అప్పుడు రంగనాయకిలా నటిస్తూ తమతో మాట్లాడిన వ్యక్తి కార్తి అన్న సత్యం తరువాత తెలిసింది వారికి!

ఫోన్లో మాట్లాడిన వ్యక్తి ఇచ్చిన సూచనల ప్రకారం కార్తి మెడ్రాస్ వచ్చి హొటల్ సుధారలో దిగడం ఈ విషయాన్ని అంతకు ముందే పసిగట్టి కస్తూరీబాయి ఉరఫ్ కనకం ఛండీరాజ్ ఒకరితరువాత ఒకరుగా ఇద్దరూ ఆ సూట్‌కేస్ తమకి చెందవలసినదేనంటూ రావడం ఛండీరాజ్ ఆవిడ్ని హత్య చేసి కార్తిని వెంటబెట్టుకు పోతున్న సమయంలో శంకర్ అతడ్ని మర్డర్ చేసి కార్తికి స్పృహ తప్పింది ధర్మరాజ్ దగ్గరికి ఢిల్లీ తీసుకురావడం జరిగింది!

అయితే రకరకాల వ్యక్తుల తాకిడికి తనలో ఏదో అనుమానం ప్రవేశించగా కార్తి అసలు సూట్ కేస్‌ని మెడ్రాస్‌లోనే దాచేసి డూప్లికేట్ సూట్‌కేస్‌తో శంకర్ వెంట రావడం జరిగింది అక్కడ నిజంగా తనో విషవలయంలో చిక్కుకున్నదన్న విష యాన్ని గుర్తించి తన ప్రాణాలకే అపాయం అన్న విషయం గుర్తించి కూడా ఆ రహస్య పత్రాలు దుర్మార్గుల చేతిలో పడితే దేశానికి తీరని నష్టం భయంకరమైన అపకారం జరగరాని ఘోరం ఏదో జరుగుతుందని గ్రహించి తన ప్రాణాలకి తెగించి వారి నుండి బయట పడుతూ టైం బాంబులతో ఆ బంగ్లాని పేల్చేసి ధర్మరాజ్‌ని అతని మనుషులతో సహా సజీవ సమాధి చేసి ఎంతో సాహసంతో మృత్యువు బారినుండి ఆఖరి క్షణంలో తప్పించుకుని బయటపడగలిగింది! పేలిపోయిన పాత బంగ్లా శిధిలాల్లో కొనవూపిరితోవున్న ధర్మరాజ్ అనుచరుడు ఈ విషయాలన్నింటినీ బయట పెట్టాడు

మొదట ఆపదలోవున్న రాణికి ఏదో సహాయం చెయ్యాలన్న ఉద్దేశ్యంతో ఈ భయంకరమైన ప్రమాద భూయిష్టమైన బాధ్యతని నెత్తిన వేసుకున్నా ఆఖరి క్షణంలో తను చేతులారా తెచ్చి ధర్మరాజ్‌కి అప్పగించబోతున్న ఈ రహస్యం దేశ భద్రతకి సౌభాగ్యానికీముప్పు కలిగించేదన్న విషయాన్ని భయంకరమైన నిజాన్ని

## కొత్త సాహసం



## ముసలామెను రక్షించాను!

ఆ రోజు ఉదయం 11 30 గం॥ల సమయం బజారు పని ముగించుకొని వస్తు-న్నాను ఎక్కువ జనం కూడా రోడ్లలో లేరు. ఉన్నట్లుండి పెద్ద పెద్ద ఎద్దులతో బండి దడదడ-లాడుతూ పరుగెత్తుతోంది. దారిలో ప్రక్కనున్న వారిని కూడా కుమ్మేసి, త్రొక్కేసి పోతున్నాయా ఎద్దులు ఎద్దుల బండివారు ప్రక్కకు తప్పుకోండ-ని భయంతో అరుస్తూ పరుగెత్తుకొస్తున్నారు. ఆ ఎద్దులు పల్లెలో ఉండేవంట, ఎప్పుడూ టౌన్‌కు రాలేదంట. బస్సుల శబ్దాలకు, పెండ్లి బాజా-ల శబ్దాలకు భయపడి పగ్గం తెంపుకొని బండి వాడిని కూడా క్రిందకు తోసేసి పరుగెత్తుతు-న్నాయట. ఒక పల్లెటూరి ముసలావిడ సినిమా వాల్ పోస్టర్ చూస్తూ తన్మయత్వంలో ఉంది. ఈ శబ్దాలను, అరుపులను వినే స్థితిలో లేదు. ఆ ఎద్దులు ఆమెపైకి వెళ్లేటట్లున్నాయి. వెంటనే నేను ముందుకు పరుగెత్తి అక్కడే ఉన్న మెట్లెక్కి ఆమెని ఒక అంగడిలోకి లాక్కొచ్చాను. వెంటనే ఆ ఎద్దులు ఆమె మొదట నుంచున్న తావు పైనే పోయాయి. ఈ హఠాత్ పరిణామానికి ఆ ముసలామె భయపడి పోయింది. రెప్పపాటులో ప్రమాదం తప్పింది. అసలు విషయం అర్థమై ఆమె నా వైపు కృతజ్ఞతతో చూసిన చూపు ఈ జన్మలో మరచిపోలేను.

**- కసవరాజు పద్మావతి**

గ్రహించి తన ప్రాణాలకి తెగించి కార్తి చేసిన ఈ సాహసాన్ని ప్రభుత్వమూ ప్రభుత్వాధికారులూ వేయినోళ్ల కొనియాడారు!

రాణి వలలో చిక్కుకుని ఆమెకి రహస్యాలు అప్పగించిన ఉన్నతాధికార్లంతా అరెస్ట్ చెయ్యబడ్డారు! సోఫియా పాండేలకు కూడా ఈ గతే పట్టింది ఈ రహస్యాల్ని చేజిక్కించుకోవడానికి ప్రయత్నించిన క్రిమినల్ గాంగ్‌కి చెందిన నాయకులు సైతం జైల్లో కూర్చున్నారు అండర్ గ్రౌండ్‌లోవున్న మజర్ కూడా ఆత్మహత్య చేసుకున్నాడు

★ ★ ★

ఆ రెండో రోజు స్పృహలోకి వచ్చిన కార్తి చైతన్య వివరంగా చెబుతున్న విషయాలన్నింటినీ శ్రద్ధగా విని చివర్లో నిట్టూరుస్తూ అంది

ఎలాగైతేనేం నా మూలంగా గ మాతృదేశానికి ఒక మహాపరాధం తీరని ద్రోహం నష్టంజరగకుండా ఆఖరి క్షణంలో ) శక్తో నా కళ్ళు తెరిపించింది! అందుకు నేనెంతో ఆనందిస్తున్నాను అని అంది

అప్పుడు అడిగింది కార్తి సంజయ్ దుర్మార్గుడు ఏమయ్యాడు? అతడ్ని రంజన్‌ని కూడా పోలీసులు అరెస్ట్ చేశారా? సంజయ్ మీద నాకెంతో కష్టవుంది! అది తీర్చుకునే అవకాశమే లేకపోయింది ఆ బాస్టర్డ్ నన్ను చాలా అవమానపూర్వకంగా మాట్లాడాడు !

బాడ్‌లక్ బేబీ నీ కోరిక తీరే అవకాశం లేదు! ఇక రాదు కూడా పెదవి విరచినవ్వాడు చైతన్య!

ఎందుకని? సంజయ్ జైల్లో కూర్చున్నాడా ఏమిటి ?

అదేంకాదు నువ్వు అతడి మీద రివెంజ్ తీసుకునే అవకాశాన్ని నీకు మిగల్చలేదు సోఫియా! సంజయ్‌ని ఈ లోకం నుండే తరిమి కొట్టింది

అంటే? యూమీన్ సందేహంగా చూసింది కార్తి అతడి మాటలు అర్థమయీ కానట్టుగా వున్నాయి ఆమెకి!

చైతన్య నిట్టూర్చి చెప్పాడు ఆ రోజు రంగనాయకి ఇల్లు పేల్చేసిన తరువాత

నువ్వు అక్కడికి రావచ్చు నన్న ఉద్దేశ్యంతో ఎదురు చూస్తూ కాచుకూర్చున్న సంజయ్ బృందానికి రంజన్ బృందం తారస పడింది అంత క్రితం నిని తప్పు దారి పట్టించి మోసం చేసిన రంజన్‌ని అలా అంత సమీపంలో చూడగనే మండి పడ్డాడు సంజయ్

అలా ఒక్కసారిగా ఎదురు పడిన తమ ప్రొఫెషన్‌లో బద్ధ విరోధులైన ఆ ఇద్దరు యంగ్ బాస్టర్డ్స్ మధ్య బ్రహ్మాండమైన యుద్ధం ప్రారంభమయింది

అంటూ ఆగాడు చైతన్య

కార్తికి చప్పున ఆ రోజు తను ఇంజనీర్ ఇంట్లో ఫోన్లో మాట్లాడి బయటికి రాగానే రంజన్ వాహనం కనిపించడం అతని దృష్టిలో పడకుండా తప్పించుకునే ప్రయత్నంలో సంజయ్ బృందంవున్న పాడుబడ్డ ఇంటి ఆవరణలోకి వెళ్ళడం అక్కడ కనిపించిన సంజయ్ జీపుని కసికొద్దీ తగలబెట్టడం గుర్తు వచ్చిందామెకి!

తరువాత ఏమయింది? ఆత్రుతగా అడిగింది కార్తి

సంజయ్ అసమర్ధత వలనే నువ్వు చెయ్యి జారిపోయావని మండిపడుతూ తనే స్వయంగా విజయవాడ చేరిన సోఫియా వారిని వెదుక్కుంటూ రంగనాయకి ఇంటి వైపు రావడం అక్కడ ఈ పోరాట దృశ్యం ఆమె కళ్ళబడటం నువ్వు మళ్ళీ వాళ్ళ కళ్ళుగప్పి పారిపొయ్యావన్న విషయం అర్థం చేసుకుని ఆగ్రహాన్నిపట్టలేక రాక్షసిలా మారిన సోఫియా హేండ్ గ్రనేడ్స్ ఆ గుంపు మధ్యకి విసరటం అటు సంజయ్ బృందం ఇటు రంజన్ బృందం నామరూపాల్లేకుండా చావడం జరిగిపోయింది అంటూ ముగించాడు

ఉలిక్కిపడ్డ కార్తి మౌనం వహించింది

(ఇంకా వుంది)

## భళారే చిత్రం



### బంగారం కేక్!

మెరిసేదంతా బంగారం కాదేమోగాని ఫోటోలో మనకు కనపడేదిమాత్రం అసలు సిసలైన మేలిమి బంగారమే! బంగారం యేమిటీ తినటమేమిటీ అనుకుంటారేమో వెండి పూతతో వుండే స్వీట్లు మనం తినటంలేదూ! ఇదీ అంతే. ఈ బంగారం లోపలికిపోయినందువల్ల ప్రమాదమేదీ లేదట

రాజుల కాలంలో తమ రాచరికపు హోదా పుట్టిపడడానికి బంగారం పూతతో తయారైన ఆహారాన్ని భుజించేవారట రాజులు నాకుమటుకేం తక్కువ నేనూ రారాజునే నంటూ, ఆనందంగా బంగారు పూత వేసిన కేక్‌లు తింటున్నాడు ఫొటోలోని వ్యక్తి పళ్లెంలోని కేక్ 23 క్యారెట్ల బంగారం పూతతో తయారు చేయబడిందట మరి యీ బంగారం కేక్ తిని ఎలా హరాయించుకుంటాడో?




# "ఈ ఊరికి ఆ ఊరు"

## బి. జ్యోతి

'ఇంకా నిద్రపోలేదేమిటి పిల్లాడు? అరగంటయింది వాడిని పడుకో బెడుతున్నానని' ఉలిక్కి పడింది సీత అత్తగారికేకతో.

నిజమే చాలాసేపయింది వాడ్ని ఒళ్ళో వేసుకుని జోకొడుతూ అలసిపోయి తనూ అలా నిద్రలో పడిపోయింది పిల్లాడు మాత్రం ఆ కేకకి మళ్ళీ లేచి కూర్చున్నాడు

ఊరుకోబెడుతుంటే సరేలే వాడెలాగూ లేచిపోయాడు నాకిచ్చి కాస్త ఆ పెసరపప్పు సంగతి చూడు మీ మామగారు నిద్రలేచారు అని ఒక రెక్కతో వాడ్ని లేపి ఎరా వేలెడెంత లేవుగానీ వూరంత గొంతుక ఎక్కడ్నించి వచ్చింది బాబూ ఈ పోలిక? అంటోంది వాడికన్న పెద్ద గొంతుకతో ఆవిడ

చేతులు కడుక్కొని పప్పు రుబ్బడానికి కూచుంది కాస్సేపు ఏడ్చి వాడే వూరుకున్నాడు పెసరట్ల వాసనకి ఆడబడుచు వచ్చి ప్లేట్లు తీసింది వరసగా వేస్తుంటే తింటున్నారు

వీడు చూడు కాస్త పెసరట్టు ముక్క పెట్టేసరికి పెంకు లెగిరిపోయేలా అరుస్తున్నాడు' అంటూ పిల్లవాడిని తెచ్చి ఒళ్ళో కుదేసింది అత్తగారు ఇంక చాలు మాకు కాఫీ పెట్టు వాడొస్తే మళ్ళీ వేద్దువుగానీ అంది

స్టౌ దగ్గర వేడికి తన మొహమే కమిలిపోయింది మిరపకాయి ముక్కతో పెట్టేసి వుంటారు చూసుకోకుండాను అలాగే అవస్థపడి యింత పిసరు పంచదార వాడి నోట్లో పోసింది ఊరుకున్నాడు తనూ ఒక చుక్క కాఫీ తాగి లేద్దామనుకుంటుంటే వీధిలో మాటలు వినిపించాయి ఒకటి భర్త గొంతుకే ఇంకొకటి తెలియడంలేదు

వాడొచ్చేశాడు సీతారామయ్య కూడా వచ్చాడు పిండి వుంటే యింకో రెండు వెయ్యి అని పురమాయించి వెళ్ళింది అత్తగారు ఏ సీతారామయ్యో తెలియడంలేదు ఒళ్ళో పిల్లాడు నిద్రపోతున్నాడు

ఏమిటి? ఆ వేడిలో వాడిని పడుకోబెట్టావు? బుద్ధుందా? అంటూ పిల్లాడిని తీసుకుని బయటకి వెళ్ళిపోయాడు సత్యం

మొహం కడుక్కుని ఒకసారి బయటకు రా మీ వూరి సీతారామయ్య ఒకసారి పలకరించు అంటూ వచ్చింది అత్తగారు

ఏం అమ్మాయి కులాసానా? పనిమీద వచ్చాను అనుకోకుండా అయింది లేకపోతే మీ నాన్నని కలిసేవాడినే రిటైరయిపోయాడు ఇంక అంతా ఖాళీయే ఆ బాపతు డబ్బు పెట్టి యిల్లు బాగుచేయిస్తున్నాడు అన్నాడతను

ఏపాటి వచ్చిందేమిటి? తీరిగ్గా అడుగుతున్నారు మామగారు

ఏం వస్తుంది? ఆడపిల్లలవాడు మధ్య మధ్యలో చాలా తీసేసి వుంటారు

అయినా కాస్తో కూస్తో కళ్ళ చూసే వుంటారు కదా అల్లుడికేం ముచ్చటగా కొనిచ్చేది లేదా?' అంటూ గట్టిగా నవ్వారు అదేదో పెద్ద జోకులాగ.

ఇంక నువ్వు వెళ్ళి పని చూసుకో అన్నాడు సత్యం

వెళ్ళగానే మీ నాన్నని కలుస్తాను చెప్తాను అంతా బాగున్నారని అన్నాడతను అతనే వాళ్ళ పెళ్ళి కుదిర్చిన పెద్దమనిషి సీతా వాళ్ళ వూరివాడే.

సీత మళ్ళీ వంట ప్రయత్నంలో పడింది. పది నిమిషా లయిందో లేదో 'అమ్మా! ఆయనొచ్చారే!" అంటూ వచ్చింది దుర్గ

అల్లుడొచ్చాడండోయ్! రా నాయనా!" అంటూ మొహం మీద నవ్వు పులుముకుని ఎదురెళ్ళింది అత్తగారు కాఫీ కలపమను పదిన్ని గబుక్కున కాస్త ఉప్మా చెయ్యమను అని అరిచింది

అప్పే వద్దండీ నేను చేసే వచ్చాను అన్నాడు సూర్యం వాచీ చూసుకుంటూ

ఎక్కడికన్నా వెళ్ళాలా నాయనా?

అహా! తయారుగా వుంటే సినిమాకెళ్దామని" అంటూ నసిగాడు

ఇప్పుడు టిక్కెట్లు దొరుకుతాయా?" అంది అనుమానంగా దుర్గ

ఇంకా టైముంది దొరకొచ్చు నువ్వు అయిదు నిముషాలలో తెమిలితే

ఎంతసేపు? మొహం కడుక్కునే వున్నావు కదుటే చీర మార్చుకుని రా అబ్బాయి సరదాపడుతున్నాడు అని తొందరచేసి లోపల వున్న సత్యాన్ని చూసి ఏరా అతన్ని పలకరించవేం?" అంది

రోజూ వచ్చేవాడిని ఏం పలకరించాలి? పెళ్ళాన్ని పుట్టింట్లో పడేసి హాయిగా తిండిఖర్చు లేకుండా మజా చేస్తున్నాడు అని ఈసడించాడు సత్యం.

వాళ్ళు తోడబుట్టిన వాన్ని అనవలసిన మాటలే. ఎవరికి నాయనా అంత ఆనందం పుట్టింట్లో పడి ఉండడానికి? దాని కాపురం అలా తగలడింది కానీ" అంటూ నెమ్మదిగానే అంటించింది ఆవిడ.

కూతుర్ని అల్లుడ్ని సాగనంపి ఏమిటి? దొండ కాయలా తరుగుతున్నావు? అతనికి బంగాళా దుంపలు వేపుడు యిష్టం అంది కోడలితో

ఇంట్లో లేవండి అన్న కోడలి మాటలు రాత్రికి తిండి నిద్ర యిక్కడే కాబోలు అని గొణు క్కుంటున్న కొడుకు మాటలు అంత పట్టించు కోకుండా నువ్వూ నేను ఆ దొండకాయలు తిందాంలే మిగతా అందరికీ దుంపలు వేయించు ఈ సంచి తీసుకుని ఒక కేజీ దుంపలు పట్రా మీ నాన్నగారు చీకట్లో అన్నీ చెత్త ఏరుకొస్తారు అని పురమాయించింది నేనే దొండకాయలు తింటాను మీ రంతా తినండి దుంపలు అని విసురుగా సంచీ తీసుకుని బయటపడ్డాడు దాని ఖర్మ అలా ఏడిసింది అని సణుక్కుంటూన్న అత్తగారి వైపు ఒకసారి చూసి యింకొంచెం బియ్యం వేసింది ఏరడానికి సీత 'రెండు కూరలా బాబూ మళ్ళీ" అనుకుంటూ

పెళ్ళయి నాలుగైదేళ్ళు అవుతున్నా – దుర్గకి పిల్లలు లేరు ఊళ్ళోనే కాపురం భర్త అత్తగారితో ఎలాగో రోజులు గడుస్తుంటే ఆడపడుచు తన కూతుర్ని వేసుకుని తమ్ముడిని సంబంధాలు చూడమంటూ అక్కడే తిష్టవేసింది ఏవో మాటలు రేగాయి కోడలికి పిల్లలు పుట్టలేదన్న కోపం ఏమంత ఎక్కువ పెట్టుపోతలు జరగడంలేదన్న అక్కసు తను చెప్పినట్టు పడివుండటం లేదన్న ఉక్రోషం అన్నీ కలిపి దుర్గని పుట్టింటికి తరిమేశాయి ఇద్దర్నీ వెళ్ళి ఒకసారి డాక్టరుచేత పరీక్ష చేయించుకోమన్న సత్యం మాటలకి దుర్గ అత్తగారు వీళ్ళ ఏడుతరాల్ని తిట్టి వదిలిపెట్టింది నా కొడుకు ఎందుకు చేయించుకోవాలి నీ చెల్లెలు గొడ్డు దయితే" అంటూ. ఏదో కొన్ని రోజులకని చెల్లెల్ని తీసుకొచ్చాడేగానీ తిరిగి వెళ్ళడమంటూ



మీ అభిమాన హీరో రాజేంద్రప్రసాద్
మీ ప్రశ్నలకు జవాబులిస్తారు

(కూపన్ జత చేయటం మర్చిపోకండి)

ఆంధ్రసచిత్రవారపత్రిక

ప్రశ్న పంపినవారి పేరు ..................................

చిరునామా ..................................

..................................

కనపడలేదు ఆ యింట్లో వాళ్ళందరిమధ్య నేను బ్రతకలేను అంటుంది దుర్గ సూర్యం మామూలు మగవాడు అవసరం కోసం భార్య దగ్గరకే వస్తూ పోతుంటాడు తల్లికి తెలిసినా ఏమీ అనదు ఆవిడకేమి యిబ్బందిలేదుకదా ఇంట్లో కదలకుండా కూర్చున్నా అక్కనీ, కూతుర్నీ కదిలించి కాపురాన్ని సరిదిద్దుకునే ధైర్యం లేదతనికి పోనీ తనే డాక్టరు దగ్గరకి వెళ్ళి ఒకసారి పరీక్ష చేయించుకునే నిబ్బరమూలేదు తనలోనే ఏదన్నా లోపం వుంటే? ఇంకేమన్నావుందా? దొరికిపోడూ? ఎంత చులకన? ఇటు కాంతమ్మ నెమ్మదిగా అల్లుడ్ని మంచిచేసుకుని ఆ పనేదో చెయ్యాలని చూస్తోంది కూతురులో ఏమీ లోపం లేదని తెలిసిపోయింది అన్నింటినీ మించి ఆ అక్క కూతుర్ని యితనికి అంటగట్టెయ్యాలని చూస్తున్నదన్న అనుమానం ఒకటి బయపెడుతోంది పిల్లలు పుట్టలేదంటూ దుర్గని వదిలేసి ఈ లోకంలో ఏమన్నా చెల్లుతుంది ఎదిరించేవాళ్ళు లేకపోతే

ఆడబడుచు దుర్గ గురించి ఆలోచిస్తోంది సీత బంగాళా దుంపలు కుప్పగా పోసి, ఈసారినుంచి నీ అల్లుడిని దుంపలు తెచ్చుకునే రమ్మను వాళ్ళిద్దరూ టింగురంగా అంటు తిరుగుతుంటే నేనిలా చీకట్లో సంచులు పుచ్చుకుని జేబులు ఖాళీ చేసుకోలేను' అని అరిచి తండ్రి దగ్గర్నుంచి పిల్లవాడిని లాక్కుని వీదిలోకి వెళ్ళిపోయాడు

మళ్ళీ వస్తూనే బోజనం కానిచ్చి పిల్లవాడిని పెట్టుకుని గదిలో పడుకున్నాడు 'కాస్సేపు పడుకుంటాను మీ పనులన్నీ తెమిలి వంటిల్లు ఖాళీ అయ్యేసరికి తెల్లవారుతుంది' అంటూ

ఆ రాత్రికి దుర్గ, సూర్యం గదిలో పడుకుంటే సీత, సత్యంల పడక వంటింట్లోనే అయినంత మటుకు పనులు కానిచ్చి పెరటి వైపు కూచుంది సీత ఆ రోజు పేపరు తీసుకుని

'ఇవాళ ఇంకా షనులు అవలేదా?' అంటూ పలకరించింది ప్రక్క వాటా సుమిత్ర

'మా ఆడబడుచు, మొగుడు సినిమాకి వెళ్ళారు' అంది భావగర్భితంగా సీత

'ఓహో' అంటూ అర్ధమైనట్టుగా నవ్వేసింది సుమిత్ర

తొమ్మిదిన్నర అవుతుంటే వచ్చారు ఇద్దరూ 'కాసిని అప్పడాలు వేయించు' అన్న అత్తగారి పురమాయింపు పూర్తి చేసి చతికిలపడింది సీత ఈ పనులన్నీ అయ్యాక మొగుడికి మేలుకొలుపులు పాడి, ఆ నిద్దట్లో తిట్టే తిట్లన్నీ పడి, వంటింట్లోకి లాక్కు రావాలి

రెండు జంబుఖానాలు పరిచి సత్యాన్ని లేపింది 'హాయిగా కంటినిండా నిద్రపోవడానికి కూడా లేదు' అని విసుక్కుంటూ లేచాడు జారిపోతున్న లుంగీ సర్దుకుని బడేలుమని అడ్డం పడి పడుకున్నాడు లేచిపోతున్న పిల్లవాడిని గబగబా జోకొట్టి పడుకోబెట్టింది వాడుగానీ లేచిపోతే ఇపుడు పెరట్లోకి పోవాలి చీకట్లో

'ఇలా చేస్తూ ఉంటే వాడు పెళ్ళాన్ని ఎందుకు తీసుకెళతాడు? ఇదే బాగుంది' నిద్రలోనే విసుక్కుంటున్నాడు సత్యం

పిల్లవాడిని మద్యలో పెట్టుకుని కొంచెం దూరంగా పడుకొంది సీత పెరట్లోకి వెళ్ళాలంటే అదే దారి అందరికీ

మర్నాడు పొద్దున్న అల్లుడ్ని సాగనంపి, కూతురి దగ్గర ముందురోజు సినిమా కథ వింటోంది కాంతమ్మ

'అన్నట్టు అమ్మా, ఆయన రెండు వేలు పెట్టి టు-ఇన్-వన్ కొన్నారట మంచి మంచి పాటలు కూడా కొన్నారట నాకిష్టమని ఈసారి తెస్తానని చెప్పారు

'విన్నావుట్రా సత్యం మీ బావ అదేదో టుయిన్‌వన్ కొన్నాడట అన్నీ సరదాలే పాపం అతనికి తీరే అదృష్టం లేదు అంది కొడుకుతో ఇంత మొహం చేసి

కస్సుమన్నాడు సత్యం 'నాకూ ఉన్నాయి సరదాలు నా పెళ్ళాన్ని కూడా పుట్టింటికి పంపేస్తే మిగిలిన డబ్బులతో అన్నీ కొనుక్కుంటాను అవేవీ



## కొత్త శీర్షిక

# ఆంధ్రసచిత్రవారపత్రిక

"న్యాయపీఠం" శీర్షిక క్రింద పాఠకుల సందేహాలకు సమాధానాలు ప్రారంభించ దలిచాము !

మీ ప్రశ్నలు క్లుప్తంగా - సూటిగా - సాధ్యమైనంత చిన్నవిగా వుండాలి. ఈ క్రింది కూపన్ నింపి మీ ప్రశ్నకి జతచేయాలి. ప్రశ్న క్రింద కూడా మీ పేరు, పూరిపేరూ రాయాలి- మీ పూర్తి చిరునామా, పిన్‌కోడ్ వెయ్యాలి. జవాబులు ఇవ్వదగిన ప్రశ్నలకు ప్రముఖ న్యాయవాది - న్యాయశాస్త్ర విషయాల గ్రంథకర్త అయిన - శ్రీ బి. బి. రావు - జవాబులు ఇస్తారు.

- - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - -

## న్యాయపీఠం - ప్రశ్నోత్తరాలు

ప్రశ్న పంపినవారి పేరు...........................................

చిరునామా..................................................

\- సం.

ఇంటికి తేవద్దు ఇంక సంసారం అంతా ఇక్కడికి చేరుస్తాడేమిటి?''

వింటున్న సీత గతుక్కుమంది అదేదో అపశకునంలా వినిపించింది కాపురం సరి చేసుకోలేని కూతుర్ని ఒంటరిగా ఉన్నప్పుడు తను తిడుతుంది గానీ, కాంతమ్మ మిగతా వాళ్ళెవరు ఏమన్నా ఊర్కోదు అందరూ కలిసి దుర్గని ఎక్కడ లోకువ కడతారో అన్న బయం

నామీద ఎగురుతావేరా? అంతా నీ చేతకానితనం మీ మామగారికి బోలెడు డబ్బు వచ్చిందట కానీ తెచ్చుకోగలిగావా? పెళ్ళిలో ఎలాగూ అలగనే లేదు ఏదో ఒకటి కొనిపించుకో ఇపుడే ' అంది ఎక్కడ దెబ్బ కొట్టాలో ఆవిడకి తెలుసు పెళ్ళాం దగ్గర మగాడ్ని చేతకానివాడివి అనేస్తే ఎక్కడ లేని పౌరుషం వచ్చేస్తుంది అతనికి

'నిజమే సుమా వాళ్ళ నాన్న అప్పటికే ఏడుపు మొహం పెట్టాడు ఇంక అలక ఒకటి తక్కువయింది నువన్నట్టు పోనీ అపుడు అలగలేదు గదా ముచ్చటగా అల్లుడికి ఏమన్నా ఇచ్చుకోకూడదా అంటూ తండ్రి కూడా శ్రుతి కలిపాడు

'దేనికయినా అచ్చటా, ముచ్చటా తెలియాలి అంతా నంగరి సంత ఇపుడయినా మించి పోయిందేముంది? డబ్బున్నపుడే అలుగు వాళ్ళకీ ఇబ్బంది ఉండదు మంత్రోపదేశం చేసింది కాంతమ్మ

సత్యం వెంటనే ఇటు తిరిగిపోయాడు అవును సీతా మీ నాన్నకి ఒక ఉత్తరం రాయి ఇలాగని నాలుగు వేలు పంపిస్తే ఏదో ఒక చిన్న బండి కొనుక్కుంటాను సైకిల్ మీద మహా చికాగ్గా ఉంది ఏ లూనానో అయితే సుఖంగా ఉంటుంది అన్నాడు

ఉరుము ఉరిమి మంగలం మీద పడిందట తన విషయం వచ్చేసరికి అందరూ ఏకమయ్యారు సీతకి ఏం మాట్లాడాలో తోచలేదు ఆ అవాంతర పరిస్థితిలో సాదారణంగా ఏ మాటకీ కూడా ఎదురు మాట్లాడదు అందుకే అత్తగారు అస్తమానం ముంగిలా మాట్లాడదు ఏమన్నా అని విసుక్కుంటుంది ఇపుడు మాత్రం నోరు పెగుల్చుకుని

'మీరు లోను తీసుకుని కొంటానన్నారు అంది

'తర్వాత తీసుకోవచ్చు ఇంకేం అపసరాలు రాకుండా పోతాయా? అయినా మీ వాళ్ళు నోరు విప్పి అడిగించు కుంటున్నారు అడగకుండానే అంతో ఇంతో ఇయ్యాల్సింది పోయి కొడుకు బదులు తల్లే సమాదానం చెప్పింది

సీతకి నిస్త్రాణ వచ్చింది డబ్బు వచ్చిన మాట నిజమే కానీ దానికి మించిన ఖర్చు ఉంటుంది ఆ పాత ఇంటికి ఒక ఆకారం తెస్తే పది ఉండచ్చు నిశ్చింతగా అన్నయ్యకి మాత్రం ఏం సంపాదన [illegible] గానీ నా ప్రాణం మిదికి తెచ్చాడు ఈ కబురు మోసుకొచ్చి' అనుకుంది

వారం రోజులు గడిచాయి రోజూ మళ్ళీ ఎక్కడ ఈ ప్రస్తావన తెస్తారో అని పీచుపీచుమంటూనే ఉంది అనుకున్నట్లుగానే ఆ రోజు,

'ఉత్తరం రాసేవా మీ వాళ్ళకి' అన్నాడు సత్యం

ఎలా రాస్తాను? ఏం రాస్తాను? ఆ మాత్రం ఇంగితం లేదా వీళ్ళకి ఇంట్లో తన సొంత చెల్లెలుతో బాద పడుతున్నారు కదా అలా కాక మనం కాస్త శుద్ధంగా ప్రవర్తించాలని అనిపించదా? ఆ బాద తెలిసిన వాళ్ళు కూడా ఇలా ప్రవర్తిస్తారా?

సీతకి ఉక్రోషంతో గొంతు పూడుకుపోయి కళ్ళ నీళ్ళు వచ్చినంత పనయింది ।

ఉత్తరంలో ఏమని రాస్తుందితే వాళ్ళేం పట్టించుకోరు డబ్బేదో కరిగి పోక ముందే దాన్ని పంపిస్తే సరి ముఖాముఖి చెప్పుకోవాలి ఇలాంటివి వాళ్ళూ పిల్లని చూసుకున్నట్టు ఉంటుంది ' తల్లి మాటలు నచ్చాయి సత్యానికి

ఎంత తెలివైనది ఈవిడ' అనుకోకుండా ఉండలేక పోయింది సీత కాలికేస్తే మెడకి. మెడకేస్తే కాలికి

నువ్వు చెప్పిందీ బాగానే ఉంది ఇపుడు పంపించడానికి డబ్బు చూసుకోవాలి అట్నుంచి వాళ్ళు పెట్టి పంపించినా?'

అదేదో తొందరగా చూడు ఇంకా ఆలస్యమయితే ముందరే ఎందుకు అడగలేదు అంటూ మొండి చెయ్యి చూపిస్తారు ఉన్నదంతా కరిగిపోయి అందరూ కలిసి తన చుట్టూ కుట్ర పన్నుతున్నారు బలిపశువులా ఉంది సీత పరిస్థితి

ఆ రోజు బోజనాలవగానే తల్లీ కూతురు సినిమాకి బయలు దేరారు పిల్లవాడు గొడవ పెడతాడని సీత వెళ్ళదు ముసలాయన ఎవరో దూరపు బంధువుల పరామర్శకని బయలుదేరాడు వాళ్ళ తోటే సీత పనులు కానిచ్చి గాలి వస్తుందని పెరటి తలుపు తీసుకుని నడుం వాల్చింది పిల్లవాడితో ఇంతలో సుమిత్ర వాటా వైపు తలుపు తీసిన చప్పుడు అయింది

'ఈ వేళప్పుడు వచ్చేశారేం?' అంది

'తల పగిలి పోతోంది సీతా స్కూల్లో పర్మిషన్ అడిగి వచ్చేశాను ఇంట్లో ఎవరూ లేరేమిటి? సందడి లేదు తీరిగ్గా కూచున్నావు '

సినిమాకి వెళ్ళారు కొంచెం కాఫీ పెడతానుండండి వేడిగా తాగి మాత్ర వేసుకుంటే తగ్గిపోతుంది

నువు కూచో ఎపుడూ ఆ వంటింట్లోనే ఉంటావు నేను పెట్టి తెస్తాను హాయిగా తాగుతూ కబుర్లు చెప్పుకుందాం ' పరాయి మనిషయినా ఎంత ఆప్యాయత? ఏడుస్తున్న పిల్లవాడిని ఒళ్ళో వేసుకుంది సీత కాఫీ గ్లాసులు తెస్తూ పెద్ద వాడవుతున్నాడు ఇంక ఆ అలవాటు మాన్పించు బాబూ బాగుండదు ' అంది సుమిత్ర

నవ్వి ఊరుకుంది సీత ఆ అలవాటు మాన్పిద్దామనే ఎంత ఏడుస్తున్నా ఊరుకుంటే, ఏమిటమ్మా ఇంతోటి అందం తరిగి పోతుందనా? వాడ్ని అలా ఏడిపిస్తున్నావు చాల్లే పాలియ్యి ముందర వాడికి' అని ఇంట్లో అందరి ముందరా అత్తగారు అంటే తలకొట్టేసినట్టయింది సీతకి ఏం చేస్తుంది?

'ఏమిటి ఇవాళ అంత మౌనంగా ఉన్నావు? ఏం

కబుర్లు లేవా?' అంది సుమిత్ర

'ఎందుకు లేవు? చెప్పమంటారా?'

'చెప్పు. మన సంసారాల్లో నిత్య నూతనమైన గొడవలు ఏవో ఉంటూనే ఉంటాయి '

సుమిత్ర భర్తకి ఆ ఊరు నుంచి ట్రాన్స్‌ఫర్ అయింది. ఇద్దరూ ఉద్యోగం చేసి మరిదిని చదివిస్తున్నారు ఆడబడుచు పెళ్ళి చెయ్యాలి అత్తగారు ఉండి ఉన్న ఉద్యోగం వదులుకో లేక సుమిత్ర అక్కడే ఉండిపోయింది అత్తగారు ఆడబడుచు భర్త దగ్గరే ఉంటున్నారు మరిది తను ఎల్లలు ఒక్క గదిలో కాలక్షేపం చేస్తున్నారు గుట్టుగా

విషయమంతా టూకీగా చెప్పింది సీత సుమిత్ర మనసు అదోలా అయిపోయింది ఆ పక్కన ఉన్న శ్యామల వాళ్ళ అమ్మలాగే వరసగా ఆడపిల్లలని కంటోందని వెధవ సంతని చేసుకున్నాం అంటూ రోజూ తిట్లు ఈ పక్కన ఉన్న రాధ మొగుడు మొదటి సారి పండగకి ఉత్త గుడ్డ ముక్కలే పెట్టారంటూ కొడతాడట సరే దుర్గని ఏకంగా పుట్టింట్లోనే వదేశారు ఇపుడు సీత కథ ఈ లోగిలిలోనే ఇన్ని కథలున్నాయి ఇన్ని కన్నీళ్ళు కారుతున్నాయ్ ఇన్ని గుండెలు మండుతున్నాయ్ – ఆడవాళ్ళు పురోగమించేశారు, వాళ్ళ బతుకులు బాగయి పోయాయి అంటే ఎలా నమ్మడం?'' ఆలోచనల్లోంచి తేరుకుని,

అదేం మూర్ఖత్వం సీతా అయినా ఆ డబ్బుమీద వీళ్ళకేం హక్కు ఉందని? ఇంట్లో మీ ఆడబడుచుతో అవస్థ పడుతున్నారు గదా మళ్ళీ మనమూ అలాగే ప్రవర్తించడ మేమిటి అనిపించదా?'

సీత నవ్వింది. 'మనదేశంలో అల్లుళ్ళకి లేని హక్కేమిటి చెప్పండి పెళ్ళాన్ని కాల్చి పారేసే హక్కు కూడా ఉంది '

'ఎలా నవ్వుతున్నావు బాబూ? ఇలా అన్నీ సహిస్తూ ఉండాల్సిందేనా? ఏమీ దారి లేదా?'

'ఏముంది? సినిమాల్లోలా మిషనుకుట్టి, బుట్టలల్లి పిల్లల్ని కలెక్టర్లు, డాక్టర్లు చేసే నమ్మకముంటే ఆపని మొదలెట్టాలి ' హాస్యంగా అనేసి, అయినా మన కాళ్ళ మీద మనం నిలబడి, కాస్త దక్షతగా మీదగ్గర ఉండనివ్వండి అంటే ఎంతమంది తల్లిదండ్రులు ఒప్పుకుంటారు చెప్పండి? అయ్యో నా కూతుర్ని కాల్చి పారేశారు అని తర్వాత కోర్టుకెళ్ళడం, అక్కడ నాలుగేళ్ళు కేసు జరిగి కొట్టిపారెయ్యడం ఈ లోపల అందరూ అన్నీ మర్చిపోతారు అతగాడికి మళ్ళీ పెళ్ళి అవడం ఇంతేగా మనం చూస్తున్నది అందరూ ఇళ్ళు వదిలి రోడ్లమీదకి వస్తే ఉద్యోగాలు పోగు పోసుకుని కూర్చున్నాయా? ఎక్కడా ఆధారం లేనిది 'ఆడది' అని అందరికీ తెలుసు అందుకే అందరూ ఆడిస్తారు ముగించింది సీత

'నీ మాటలు వింటూ వుంటే ఉన్న మతి కూడా పోతోంది అందుకే ఈ 21వ శతాబ్దంలో అడుగు పెడుతున్నా కూడా మనవాళ్ళు ఆడపిల్ల పుట్టిందంటే ఏడుస్తున్నారు '

'ఇంకో ఇన్ని శతాబ్దాలు కూడా ఏడుస్తారు ఏం మార్పుందదు ఇన్నేళ్ళలో మన పరిస్థితుల్లో ఏం తేడా వచ్చిందని

'నేను కాస్సేపు పడుకుంటాను 'లేచి, నిన్ను చూస్తే జాలేస్తోంది సీతా ఇంత తెలివైన దానివి అవన్నీ ఈ వంటింటి నాలుగు గోడల్లో ఆవిరయి పోతున్నాయి' అంటూ లోపలికి వెళ్ళిపోయింది సుమిత్ర

సీత నిజంగానే తెలివైంది మాటల్లోనే కాదు, చదువులో కూడా ఇద్దరు ఆడపిల్లలకి పెళ్ళి చేసి పంపించే సరికే తండ్రికి నడుం విరిగిపోయింది సీత మూడోది ఉన్న ఒక్క కొడుక్కి చదువు అబ్బలేదు సరికదా సీతకన్నా వెనకపడిపోయాడు వయసులో పెద్దవాడయినా చెల్లెలి చేత చదువు మానిపించక పోతే ఇంట్లోంచి పారిపోతానని బెదిరించాడు మంచి మార్కులతో స్కూల్ ఫైనల్ పాసయిన సీత చదువు ఆగిపోయింది ఆ రోజుల్లో సీతకి ఏవో చిన్న కోరికలుండేవి తన క్లాసు టీచరు భర్త – ఇద్దరూ టీచర్లే ఎంతో అన్యోన్యంగా ఉండేవారు వాళ్ళ ఇంటికి వెళితే ఎంతో బాగుండేది సీతకి తనూ అలాగే టీచరు కావాలని, ఇంకో టీచర్ని పెళ్ళి చేసుకోవాలని – సంతోషంగా ఉండాలని ఇవే కోరికలు సీతకి అవేమంత పెద్దవి కావు అయినా తీరలేదు ఇంట్లో ఊర్కెనే రెండేళ్ళు కూచో బెట్టి పెళ్ళి చేసేశారు ఏ విషయంలోనూ తనకంటే ఎక్కువ కాని అన్నని అస్తమానం సమర్థించే తల్లంటే ఇప్పటికీ కొంచెం కోపమే అట్టే చదువు లేకపోయినా ఏమంత పెద్ద ఉద్యోగం కాకపోయినా చక్కగా కట్నం తీసుకుని అతనికి పెళ్ళి కూడా చేశారు

పది రోజుల తర్వాత సీతని నిజంగానే ప్రయాణం చేయించారు కీ ఇచ్చిన బొమ్మలా రైలెక్కింది సీత చేతిలో పాతిక రూపాయలు పెట్టి అక్కడా ఇలా ముంగిలా కూచోక సాధించుకుని రా అడగందే అమ్మయినా పెట్టదు ఆ సూర్యం దగ్గర నన్ను అమ్మ అంతలా చిన్నతనం చేస్తుంటే నాకెలా ఉంటో తెలుసా? ఆ దుర్గ చూడు తెలివితేటలుగా అమ్మా, నాన్నలని మంచి చేసుకుని ఎలా పని సాధించుకుంటుందో? అన్నాడు సత్యం

అతని మాటలు చేదు మింగినట్టున్నాయి సీతకి 'అంటే మా పిల్లకి మేము చేస్తున్నాం కదా, నువ్వు మీ వాళ్ళని అడిగి చేయించుకో అనా? ఇదెక్కడి న్యాయం? ఒకళ్ళు చేసే తప్పు మనమూ చెయ్యాలా? ఇలా చేస్తూ పోతే ఈ గొలుసు తెగేదెక్కడ?' ఏమీ అర్థం కాలేదు సీతకి

స్టేషనుకి వచ్చిన అన్న 'ఏమే? మా మీద ఇంత అభిమానం వచ్చింది మీ వాళ్ళకి. పిలవకుండానే పంపించారు.' అంటూ పిల్లవాడిని ఎత్తుకున్నాడు.

రిక్షా ఎక్కి 'అచ్చం నీ పోలికనే వీడు'' అంటూ ముద్దులాడాడు

'తను వచ్చిన పని చెప్తే ఈ ముద్దులూ, మురిపాలు ఎగిరిపోతాయి' అనుకుంది తల్లీదండ్రీ కుశల ప్రశ్నలు వేశారు

'ఇంకా నీ చాకిరీ అలాగే ఉందా? ఆ ఆడబడుచు కాపురానికి వెళ్ళదా? నీ నెత్తిమీదే స్వారీ చేస్తోందా? అయినా నీ నోట్లో నాలిక లేదే' అందుకే అలా ఆడిస్తున్నారు మీ ఆయన మరీ మొద్దు స్వరూపం. అలాగే ఉన్నాడా? ఏమన్నా తెలివితేటలు వచ్చాయా? తల్లి మాటలు వింటూ,

'ఆ' బోల్డు తెలివితేటలు వచ్చాయి నాకు నోట్లో నాలిక పెట్టి పంపించారు ' అనుకుని 'వదిన





కనిపించదేం అమ్మా? అంది

వాళ్ల చెల్లెలు పెళ్లికని వెళ్లింది

ఎప్పుడేమిటి? ఎన్నాళ్లయింది వెళ్లి

వస్తుందిలే ఆవిడగారికి రావాలనిపించినప్పుడు.' అని కసిగా అంది తల్లి మాట దూకుడు తెలిసిన సీత పట్టించుకోలేదు

ఆ సీతారామయ్య వచ్చాడట కదమ్మా చెప్పాడులే నాకు అన్నాడు తండ్రి

పాపం మంచివారు నిన్ను చూసి వచ్చాడు మేము చెప్పకపోయినా అభిమానపడతాడు రాగానే మాకు కబురు చెప్పాడు బాగున్నారని అని మెచ్చుకుంది తల్లి

భోజనాలయ్యాక తీరిగ్గా అసలు విషయం చెప్పింది సీత ఇద్దరూ రాతి బొమ్మల్లా ఉండిపోయారు

తల్లి తేరుకుంది అనుకుంటూనే ఉన్నాను. మీ అత్తగారు మామగారు ఆ మాటకొస్తే మీ ఆయన మాత్రం తక్కువ వాళ్లేమీ కారు ఊర్కినే ఎందుకున్నారంటే నా మనసు పీకుతూనే ఉంది. ఎంత ప్లాను వేశారు అయినా మాకు డబ్బు వస్తే వాళ్లకెందుకివ్వాలి పెళ్లి లాంఛనాలు అన్నీ వాళ్లడిగినట్టు చేశాంకదా

బాగుంది పెళ్లిలో మీ దగ్గర డబ్బు లేదని అలగడం మానేశారు ఇప్పుడు మీ దగ్గర ఉంది. అలుగుతున్నారు సీత నవ్వింది వెర్రిదానిలా

అయినా ఆ సీతారామయ్యకి బుద్ధి లేదు. తగుదునమ్మా అని వెళ్లి ఈ కబురు ఎవరు చెప్పమన్నారుట తన మాటలకి అడ్డు చెప్పా.

బాగుంటే అత్తకేం తెలుసు ఇలా తిరుగుతారని అన్నాడు తండ్రి

అయినా ఇప్పుడు డబ్బు ఇస్తేనే గానీ కుదరదన్నమాట ఇలా మొదలెడితే రేపెక్కడి నుంచి తెస్తాము ఎలా తీరుతారో నమ్మకం ఏమిటి అన్నది తల్లి

డబ్బు వచ్చిన మాట నిజమేనమ్మా దానిమీద ఆశ పెట్టుకునే ఉన్నాను ఇన్నాళ్లు ఇల్లు కొంచెం సరి చేయించవచ్చుని నా తర్వాత కొన్నాళ్లయినా మీ అన్నయ్యకి బెంగ ఉండదు వాడి సంగతి నీకు తెలుసు ఏమి సంపాదన ఉందని డబ్బు వస్తుందనుకున్నంత సేపు సంతోషం ఉండటంలేదు అది చితికిలే తండ్రి మాటలకి

నాకు మాత్రం తెలియదా నాన్నా! కానీ ఇవన్నీ వాళ్లకి అర్థమవుతాయా వాళ్ల ధోరణే వాళ్లది ఈ సారి నాకు ఎటూ సమర్థించడానికి వీలు లేకపోయింది మీ దగ్గర డబ్బు కనిపిస్తోంది ఈసారి ఎప్పుడన్నా ఇలాంటిది జరిగితే వాళ్ల దగ్గర డబ్బు లేదు మీ ఇష్టం ఏం చేసుకుంటారో చేసుకోండి అంటాను కోపం వచ్చి పంపించడం మానేస్తారు అంతేగా ఇప్పుడు వచ్చినందుకు మీ కేమీ సంతోషంగా ఉందా? అంది సీత కళ్ల నీళ్లు తిరుగుతుంటే.



వైశ్యాబ్యాంక్ ఛైర్మన్ శ్రీ రమేష్‌గెల్లి బ్యాంక్ నూతన గృహ నిర్మాణ పథక నివేదికను ముఖ్యమంత్రి శ్రీ ఎన్.టి. రామారావుకు సమర్పిస్తున్న దృశ్యం. శ్రీ సి.వి. మోహన్‌రాజ (హైదరాబాద్ డివిజనల్ మేనేజర్), శ్రీ పి.ఎస్.ఆర్. మూర్తి (డెవలప్‌మెంటు ఆఫీసరు)లను కూడా ఈ చిత్రంలో చూడవచ్చు.

## వైశ్యాబ్యాంక్ వారి గృహనిర్మాణ పథకం

ఇటీవల హైదరాబాద్‌లో ముఖ్యమంత్రి శ్రీ ఎన్.టి. రామారావుకి వైశ్యా బ్యాంక్ ఛైర్మన్ శ్రీ రమేష్ గెల్లి 1989 జూలై ఒకటవ తారీకు నుండి ప్రారంభం కాబోతున్న బ్యాంకు నూతన గృహ నిర్మాణ పథకం గురించి నివేదికను సమర్పించారు. ఈ పథకం మధ్య, తక్కువ ఆదాయం గల వర్గాల వారికి ప్రోత్సాహకరంగా ఉండగలదని శ్రీ రమేష్‌గెల్లి అన్నారు.

అన్నింటికన్నా మించిన 'షాక్' సీతకి తర్వాత కలిగింది తల్లి నోట వదిన పుట్టింటికి ఎందుకు వెళ్లిందో తెలిసి.

అదేమిటమ్మా! ఇంతవరకూ మా అత్తవారిని ఆడిపోసుకున్నావు మీరు చేసేందేమిటి? అంది

బాగుందేవ్ దీనికీ దానికీ పోలికేమిటి మన వాడికేం తక్కువని ఆ రోజుల్లో అంత పీద ఏడుపులు ఏడ్చారు ఈ ఆర్నెల్లలో ఇంత తేడా వచ్చేసిందేమిటి మనకి ఎంత చిన్నతనం తల్లి మాటలు వినబుద్ధి కాలేదు సీతకి వదిన వస్తే ఒకసారి చూసి తనూ వెళ్లిపోవాలని నిశ్చయించుకుంది తను ఇక్కడ ఉన్నా ఎవరికి సంతోషం — —

రేవతి వచ్చానే ఆడబడుచుని ఆదరంగా పలకరించి పిల్లవాడిని ఎత్తుకుంది పెళ్లిలో చూడటమే తప్ప ఇద్దరికీ పరిచయం లేదు అయినా రేవతి ఎంతో చనువు ఉన్నదానిలా ప్రవర్తించింది తల్లి సణుగుడు సీతకి నచ్చలేదు

ఎలాగయితే సగం డబ్బు కక్కారు మిగతాది ఇచ్చేరా చచ్చేరా? దక్కిందే దక్కుడు కర్ణకఠోరంగా ఉన్నాయి ఆ మాటలు

'డబ్బుకోసం కాదమ్మా. నా పరువు మర్యాదల 'క్వొశ్చన్' అయిపోయింది. ఆ రోజుల్లో నాకివ్వ లేని వాళ్లు ఇప్పుడు అంత డబ్బు ఎక్కడినుంచి తెచ్చారు.' అన్నగారి మాటలకి నవ్వొచ్చింది సీతకి. 'నీ పరువు ఖరీదు రెండు వేలు' అనుకుంది

రేవతి తండ్రి వీళ్లు అడిగిన పదివేలు కట్నం ఇచ్చుకోలేనంటే ఆరువేలకి తగ్గి చేసుకున్నారు అయితే ఏడాది తిరగకుండా రేవతి చెల్లెలుకి పదివేల కట్నంతో సంబంధం కుదుర్చుకున్నారు గవర్నమెంటు ఉద్యోగం సొంత ఇల్లు ఉన్న సంబంధం అది తమకి చాలా చిన్నతనంగా లెక్కవేసుకొని రేవతిని భర్త, అత్తగారు కలిసి మాకు మూడు వేలన్నా ఇవ్వాలి అడిగి పట్టుకు రమ్మని పంపించేశారు ఎలాగో రెండు వేలు ఇచ్చి పంపించారు

ఎంతో ఆప్యాయంగా మాట్లాడుతున్న రేవతి దగ్గర తల్లి అన్న చేసిన పనికి చాలా సిగ్గనిపించింది సీతకి ఆ రెండు రోజుల్లో పెరిగిన చనువుతో ఇదేం విచిత్రం వదినా అక్కడ కూతురుతో అవస్థ పడుతున్న మా అత్తగారు నా విషయంలో ఇలాగే ప్రవర్తించింది మా అత్తగారిని తిట్టిపోసిన అమ్మా ఇలాగే ప్రవర్తించింది ఆడవాళ్లమే ఇలాగ

## దిలీప్-రాజ్



ప్రముఖ హిందీనటుడు దిలీప్ కుమార్ గుండెకు సంబంధించిన జబ్బులతో బాధపడుతూ అమెరికాలో చికిత్సపొందుతున్నాడట.

సుభాష్‌ఘయ్ తాను తీయబోయే 'సౌదాగర్' చిత్రంలో నటించమని దిలీప్ కుమార్‌కు-రాజ్ కుమార్‌కు నచ్చ చెప్పాడట. సరేనని ఒప్పుకున్నారట. కాని రాజ్‌కుమార్ కూడా అమెరికాలో వైద్య చికిత్స చేయించుకుంటున్నాడట. ఈయన గొంతు క్యాన్సరుతో బాధపడుతున్నాడు.



ఈ యిద్దరు నటులు ఎప్పుడు ఆరోగ్యాలు బాగుపడి బయటపడతారోనని కాచుకొని కూర్చున్నాడట ఘయ్ అమెరికాలో. వాళ్లు మంచం దిగడం ఆలస్యం కెమెరాలతో సిద్ధమైపోదామని చూస్తున్నాడట. మరి వారెప్పుడు కోలుకుంటారో...తనెప్పుడుసినిమా మొదలెడతాడోనంటున్నారు మిగిలిన నిర్మాతలు. యువనటులు యింతమంది వుంటే ఈముసలి నటులతో చిత్రం తీయాలని ఎందుకు ఆరాటపడుతున్నాడో అర్థం కావడం లేదట పరిశ్రమలోని వాళ్లకి. పాతవారంటే ఈ అభిమాన మెందుకో!

## ఈ ఊరుకి ఆ ఊరు

ప్రవర్తిస్తే ఇక మనకి దిక్కెవరు?' అంది.

'ఇదొక పెద ఇనప గొలుసు లాంటిది సీతా ఈ వదిన, ఆడబడుచు అత్త కోడలు తల్లీ కూతురు-రూపాలున్నాయే ఇవన్నీ ఒకే ఆడదానిలో ఉంటాయి సందర్భాన్ని బట్టి ఒక్కొక్క రూపు బయటకి వస్తూంటుంది అంతే రేపొద్దున మీ అబ్బాయి పెద్ద వాడయితే నువ్వు ఇలాగే ప్రవర్తించవచ్చు అన్నీ మర్చిపోయి' అని నవ్వింది

'నిజమే. వదిన మాటల్లో ఎంతో నిజం ఉంది కానీ ఈ గొలుసు తెగేదెలా? తెగడం మాట అలా ఉంచి మరింత బిగుసుకు పోతోంది ఆ ఉచ్చులో ఎంత మంది కొట్టుకుంటున్నారో? అనుకుంటూ 'ఆడదానిగ పుట్టడం కన్నా అడవిలో మానయి పుట్టడం మంచిదంటారు ఇందుకనే కాబోలు' అన్నది సీత

'లేకపోతే మరేమిటి? అన్నేళ్ళు పెంచి పెద చేసి కట్నం, కానుకలు అన్నీ ఇచ్చి కాళ్ళు కడిగి అల్లుడు చేతిలో పెట్టి పాలు ముంచినా నీట ముంచినా నీదే భారం నాయనా' తన్నుకుంటావో చంపుకుంటావో నీ ఇష్టం అని దేబిరిస్తాడు ఆడపిల్ల తండ్రి అలా రాశారు మన శాస్త్రాలు ఇన్నాళ్ళు పెంచి పెద్ద చేశాను. ఇంక మీదట నీ ఇంటిని చూసుకుని నీ పిల్లలకి తల్లి అవుతుంది దీన్ని జాగ్రత్తగా చూసుకో. ఏం కష్టం రాకూడదు అని ఎందుకు అనరు? అలా ఎందుకు రాయలేదు మన శాస్త్రాలు? ఆడపిల్లని కనడం నామోషీ దాన్ని ఒక అయ్య చేతిలో పెట్టడం అంతకన్న నామరా అన్నట్టుగా తేల్చారు. ఇంక మన బతుకులు ఇంతకన్న ఏం బాగుంటాయి చెప్పు

సీత ఏం మాట్లాడ లేదు ఆలోచిస్తోంది పెళ్ళి సంసారం అంటే ఎన్నో కలలు కంటుంది ఆడపిల్ల అలాంటిది పదాయి గుమ్మంలో అడుగు పెట్టిన దగ్గర్నుంచీ ఆడుకోడానికి ఒక బంతి దొరికినట్టుగా దాన్ని ఏదో ఒక సాకు పెట్టి తంతూనే ఉంటారు ఆ బంతి గోలులో పడేది ఎపుడు? పడకపోతే అలా మొద్దు బారి పోయే దాకా తన్నులు తింటూనే ఉండాలి.

బయలుదేరే ముందు రోజు తండ్రి చెక్కు చేతిలో పెట్టి, 'ఈ సాయేదో చెయ్యగలిగాను ఇకమీదట నా తరం కాదమ్మా నీ చేతుల్లోనే ఉంది' అన్నాడు

'తెలుసు నాన్న అత్తవారు అలగకుండా పుట్టింటి వారు చిన్నతనంపడకుండా చెయ్యడమే ఆడపిల్లల కర్తవ్యం అది చేతగాని ఆడపిల్లల బతుకులు ఏమవుతున్నాయో కూడా చూస్తున్నాను ఈ ఇంట్లో ఎందుకు పుట్టామో ఆ ఇంట్లో ఎందుకు జీవచ్ఛవాల్లా బతుకుతున్నామో అర్థం కాకుండానే ఆరిపోతోంది బతుకు' అనుకుంది

'తెలివి తేటలుగా నెట్టుకు రావాలిగానీ వాళ్ళు ఏదో అన్నప్పుడల్లా ఇలా పరుగెత్తుకు వస్తుంటే అదే అలవాటయి పోతుంది' అంటున్న తల్లి మాటలకి నవ్వాలో ఏడవాలో తెలియలేదు. 'నిజంగా తనూ పెద్దయితే ఇలాగే తయారవుతుందా?' అనుకుంటే గుండె ఎట్టుకున్నట్టయింది

నాన్నగారి మాటలు విన్నావుగా మీ ఆయనకి కాస్త బుద్ధి జ్ఞానం వచ్చేట్టు చేసుకో గానీ అన్నగారి మాటలకి మాత్రం సీత ఊరుకో లేక పోయింది

నువ్వూ అమ్మా ఇంకొకళ్ళని అనేంత గొప్ప వాళ్ళు కారు అన్నయ్యా! ఈ వూరికి ఆ వూరు ఎంత దూరమో ఆ వూరుకి ఈ వూరూ అంతే వదిన కూడా నాలాంటి ఆడపిల్లే అని నీకు అనిపించలేదా

సీత మాటలకి అన్నగారికి చాలా ఉక్రోషం వచ్చింది. 'నన్నంటా వేమిటి మధ్య! అమ్మే అన్నది ఇలాగ పేచీ పెట్టి డబ్బు తెప్పించుకోమని

మీ ఆడవాళ్ళ మూలంగానే ఇలాంటి వన్నీ మళ్ళీ అన్నింటికీ మగవాళ్లే కారణం అంటూ ఏడుస్తారు' అన్నాడు కోపంగా

అమ్మదే తప్పని ఒప్పుకుంటాను కానీ ప్రతీ విషయంలోనూ ఆడవాళ్ళు మీకేం తెలియదు నోరు ముయ్యండి అని అధికారం చెలాయించే వాడివి ఈ విషయంలో అమ్మని ఎందుకు ఎదిరించవు? నీకూ ఆ ఆలోచన నచ్చడం వల్లే కదా ఇక ముందు ఎపుడూ ఇలా నేను డబ్బుకోసమంటూ రాను నువ్వు కూడా వదిన్ని ఆ విషయంలో ఎపుడూ ఒత్తిడి చెయ్యనని మాట ఇవ్వు అని రేవతి వైపు తిరిగి ఎక్కడో అక్కడ ఈ ఇనప గొలుసుకి పగులు పెట్టాలి వదినా నాతోనే మొదలు పెడతాను రేపొద్దున వీడికి కానీ కట్నం తీసుకోకుండా పయాపైసా లాంచనం ఆశించకుండా కోడల్ని తెచ్చుకుంటాను ఆ పిల్ల తండ్రి ఏడుపు మొహంతో కాదు నవ్వుతూ పంపిస్తాడు కూతుర్ని నా ఇంటికి నా కొడుకు ఉత్త మొగుడు గా కాదు ఉత్తమ పురుషుడు గా అనిపించాలి ఆ అమ్మాయికి అన్నది ఆవేశంగా

సీత మాటల్లో ఉద్రిక్తతకి రేవతి కళ్ళ నీళ్ళు తిరిగాయి అప్రయత్నంగా సీతని దగ్గరకి తీసుకుని చెవిలో గుసగుసగా ఇంత మంచి అత్తగారి కోసం నేనే ఒక కూతుర్ని కంటాను చాన్సు వదులుకుంటానా అంటూంటే ఇదరికీ నవ్వొచ్చింది వాతావరణం తేలికపడింది

అరుబయట వాకిట్లో కూచున్నా వాళ్ళకి ఎపుడు చీకటి పడిందో కూడా తెలియ లేదు సీతని అలాగే వదిలి మిగిలిన వాళ్ళు లోపలికి వెళ్ళిపోయారు నవ్వు ఏడుపు కలిసి చెమ్మగిల్లిన కళ్ళకి పైకి చూస్తే ఆకాశమంతా మసకగా నల్లగా భయంకరంగా కనిపించింది సీతకి కళ్ళు గట్టిగా తుడుచుకుంటే నిర్మలంగా మెరుస్తూ కనిపించిన చుక్కలు భవిష్యత్తు మీద తను పెట్టుకున్న ఆశల్లాగే మిణుకు మిణుకు మంటున్నట్టనిపించింది




(గత సంచిక తరువాయి)

యుధిష్ఠిరుడి సభా భవనం దేదీప్యమానంగా వెలిగి పోతోంది

ఒకరోజు -

నారద మహర్షి వచ్చాడు

ద్రౌపదీ ఆమె భర్తలయిదుగురూ ఆయనకు భక్తితో మొక్కారు అర్ఘ్య పాద్యాలు ఇచ్చారు

'జయోస్తు దిగ్విజయోస్తు' అని దీవించాడు మహర్షి

'ధన్యులం స్వామీ' అని, భటులు దారి చూపగా నారదుణ్ణి సభా భవనంలోకి తీసుకు వెళ్ళాడు ధర్మరాజు

సభా భవనాన్ని చూస్తూనే నారదుడు విలాసంగా నవ్వాడు

మహారాజా యమ, వరుణ, ఇంద్ర రుద్ర బ్రహ్మ సభలను చూశాను నేను అవన్నీ చాలా అద్భుతంగా వుంటాయి కాని నీ సభా భవనం చూశాక ముల్లోకాలకే ఇప్పుడు కొత్త అందాలు అమరినట్టని పిస్తోంది

ఈ ఇంద్ర ప్రస్థంలో ఈ మయసభలో ఈ ఉద్యానవనంలో ఈ ఆకుపచ్చదనంలో, మీ అన్నదమ్ముల ఐకమత్యంలో ఏమి శక్తి వున్నదో నాకు తెలియదు

మీ రాజ్యమంతా అందంగా కళ కళ లాడుతోంది

మీ ప్రజలందరూ సుఖంగా హాయిగా వున్నారు మీరు స్వయంవరంలో గెలుచుకున్న ఈ పాంచాల పుత్రి ఖాండవ ప్రస్థంలో అడుగిడిన క్షణానే మీ అదృష్టం మారినట్టుం ది' అన్నాడు

ఆ మాటలు వినగానే ధర్మరాజుకు ఆనంద మయింది సన్నటి మేలి ముసుగు వెనుక ద్రౌపది సిగ్గు అభినయించింది

'ధర్మరాజా! ఈ భవనమంతా కృష్ణమాయ లా, మేఘంపై మెరుపు తీగలా, నల్లని వాడికి పద్మనయనమ్ముల వాడికి మయుడు చేసిన భగవతారాధనలాగా, భక్తి పూర్వకమైన ఆత్మా ర్పణంలా అని పిస్తోంది' అన్నాడు

ధర్మరాజు సంతోషించాడు

'మహర్షీ మనసులో అనుకున్నదే తడవు ముల్లోకాలూ దర్శించగల తపస్సంపన్నులు మీరు మీరు చూసిన సభలు గురించి మాకు చెప్పరూ' అని ధర్మరాజు, ద్రౌపదీ వేడి కోలుగా అడిగారు

అంతే

వాళ్ళ అభ్యర్థన విన్న మరుక్షణం నారదుడి మనస్సులో దేవసభల అందాలు కదలు కదలుగా లేచి మువ్వల కాళ్ళతో నడవటం మొదలు పెట్టాయి

వరుణ సభ అతి సుందరంగా వుంటుంది కాలగమనం కలిగిన ఆ సభను జలస్తంభన విద్యతో నీటిలో వుండి విశ్వకర్మ నిర్మించాడు నాలుగు సముద్రాలూ, గంగా, గోదా వరీ కృష్ణా మొదలైన నదులూ సెలయే ళ్ళూ చెరువులూ సరస్సులూ, దిగుడు బావులూ, దిక్కులూ పర్వతాలూ, భూదేవీ దేహాలు ధరించి వచ్చి వరుణ దేవుని సేవిస్తూ వుంటారు ఉజ్వల మణిమయమై, తెల్లని కాంతితో అతి సుందరంగా వుంటుంది వరుణ సభ దైత్య దానవ చక్రవర్తులూ నాగ ముఖ్యులూ వరుణుడ్ని కొలుస్తూవుంటారు

ఇంద్రుడిలాగే కుబేరుడు కూడా తన తపశ్శక్తితో సభా భవనాన్ని నిర్మించుకు న్నాడు వైభవంలో కూడా అది ఇంద్ర సభకేమీ తక్కువ కాదు నూరు యోజనాల నిడువూ డెబ్బై యోజనాల వెడల్పూ వుంటుంది ధవళ కాంతితో ప్రకాశిస్తూ కాలగమనం కలిగి వుంటుంది మందార పారిజాత కల్పవృక్షాల మీద నుంచి వచ్చే చల్లనిగాలి సేద తీరు స్తూవుండగా ఆ సభా భవనంలో కుబేరుడు కొలువుతీరి వుంటాడు నర కిన్నర గంధ ర్వులూ, యక్షులూ, రంభా, ఊర్వశీ తిలో త్తమా, మేనకా, ఘృతాచీ విభావరీ మొదలైన అప్సరసలు ఆయనను సేవిస్తూ వుంటారు ఆయనకు సఖుడై, ఆయుధ సహితులైన ప్రమథ గణాలతో, ప్రియసతి పార్వతితో పరమేశ్వరుడు ఎప్పుడూ అక్కడే వుంటాడు'

ద్రౌపదీ ధర్మరాజులు సంభ్రమాశ్చర్యాలతో చేతులు జోడించారు

'మహర్షీ! బ్రహ్మ సభను గూర్చి కూడా వినాలని వుంది' అన్నారు

'ఒకసారి నేను కమలగర్భుని సభను సందర్శించాను మాటలకందనంత మనో హరంగా వుంటుందా మందిరం ఆకాశమంత ఎత్తుకు నిలిచి తన అందంతో సూర్య చంద్ర మండ లాలను వెలిగిస్తూ వుంటుంది విశ్వకర్తలైన ప్రజాపతులూ వసువులూ, రుద్రులూ, సిద్ధులూ, సాధ్యులూ, మునులూ, అశ్వినులూ, పితృదేవతలూ బ్రహ్మదేవుని చుట్టి వుంటారు వేద వేదాంగాలూ, పురాణ ఇతిహాసాలూ సమస్త భాషలూ, సమస్త విద్యలూ శరీరాలు ధరించి చదువుల తల్లిని సేవిస్తూ వుంటాయి

కాని మహారాణీ ఎన్నయినా చెప్పు

జరిగిన కథ - 8 : పాంచాల రాజు ద్రుపదుడివల్ల అవమానంపాలైన ద్రోణుడు అర్జునుడిద్వారా తన ప్రతీకారం తీర్చుకుంటాడు ద్రుపదుడు చేసిన యజ్ఞం ఫలించి కొడుకు, కూతురు జన్మిస్తారు అర్జునుడు స్వయంవరంలో ద్రుపదరాజపుత్రి ద్రౌపదిని గెలుచుకుంటాడు పాండవులకు ద్రౌపదినిచ్చి పెళ్లి చేయటంలో అధర్మ మేదీలేదని వ్యాసమహర్షి ద్రుపదుడి సందేహం నివృత్తి చేయటంతో ఆ పెళ్లితంతు పూర్తిచేస్తాడు పట్టాభిషేకానంతరం ధర్మరాజు సోదరులు, ద్రౌపదిని తీసుకొని ఖాండవప్రస్థం వెళ్తారు విహారానికై ఖాండవవనం వెళ్ళిన కృష్ణార్జునులు ఖాండవదహనానికి పూనుకుంటారు

ఆ సభలన్నీ మీ మయ సభంత విచిత్రంగా లేవు అని నారదుడు మయ సభను పరికించి చూశాడు

'మహర్షీ! మీరు త్రిలోక సంచారులు మీరె రుగని లోకం కాని మీకు తెలియని విషయం కాని వుండవు మా తండ్రి పాండురాజు ఏ సభలో ఎలాంటి మర్యాదలు పొందుతున్నా డో మా అన్నదమ్ముల గురించి ఏమను కుంటున్నాడో చెప్పండి అని వినయంగా అర్థించాడు మహారాజు

'ధర్మరాజా! త్రిశంకు మహారాజు కుమారు డు సత్య హరిశ్చంద్రుడు మినహా మిగిలిన రాజర్షులందరూ యమధర్మరాజు సభలో వున్నారు

'హరిశ్చంద్ర మహారాజు ఏ సభలో వున్నా డు?' వుత్సుకత ఆపుకోలేక అడిగింది ద్రౌపది

'హరిశ్చంద్రుడు దేవ పూజ్యుడై ఇంద్ర సభలో వున్నాడు

'అదేం! ఆయన చేసిన పుణ్య మేమిటి? తక్కినవారు చేసిన పాపమేమిటి? పరమ ధర్మాత్ముడైన తన తండ్రికి దేవ పూజ లభించలేదనే చింతతో అడిగాడు ధర్మరాజు

మహారాజా! హరిశ్చంద్రుడు ఆడిన మాట తప్పనివాడు విద్యా వినయ సంపన్నుడు సూర్యవంశదీపకుడై, జయశీలుడై సప్త ద్వీపా లనూ జయించాడు రాజసూయ యాగం చేసి ఇవ్వవలసిన దక్షిణకు అయిదురెట్లు ధనం ఎక్కువగా ఇచ్చి విప్రులనూ యాచ కులనూ సంతోషపెట్టాడు వాళ్ళందరూ అతని దాన ధర్మాలకు మెచ్చుకుని రాజులం దరిలోనూ తేజ స్వంతుడవై లోకోత్తర పదాన్ని పొందమని దీవించారు వాళ్ళ దీవెనల వల్లా రాజసూయ యాగం చేసిన ఫలం వల్లా హరిశ్చంద్రుడు ఇంద్రసభను అధివసించ గలిగాడు'

'మహర్షీ! మీరు అనుగ్రహిస్తే మేమూ రాజసూయ యాగం చెయ్యడానికి సిద్ధంగా వున్నాం

'మహారాజా! నేను వచ్చింది కూడా అది చెప్పడానికే ఒకరోజు నేను యమధర్మ రాజును చూడటానికి వెళ్ళినప్పుడు మీ తండ్రిని కూడా కలిశాను మీరు రాజసూయ యాగం చేస్తే తనకు కూడా దేవేంద్ర సభా ప్రాప్తి కలుగుతుందని పాపం పాండురాజు ఆశపడు తున్నాడు

"నా కుమారులైదుగురూ అపరిమిత శక్తి వంతులు దేవతల వరంవల్ల పుట్టిన దివ్య మూర్తులు నా పెద్ద కొడుకు రాజ సూయ యాగం చెయ్యగల సమర్థుడు అందుకు వాడికి, తమ్ములు నలుగురూ కూడా సాయపడతారు నా కుమారులు రాజసూయ యాగం చేసేలా నువ్వు వెళ్ళి వాళ్ళను ప్రోత్సహించు ' అని మీ తండ్రి

బ్రతిమాలు కున్నాడు ఆ సంగతి నీకు చెప్పడానికే నేను ఇక్కడికి వచ్చాను మీరు రాజసూయ యాగం చేసి మీ పితృ గణానికి స్వర్గలోక సుఖాలు కలుగ చెయ్యండి' అన్నాడు నారదుడు

'నారదమునీ! తండ్రి కోర్కెను వెల్లించడం కన్నా బిడ్డలకు కావల్సిందేముంది మీ ఆశీ ర్వాదం వుండాలే కాని నేనూ నా తమ్ములూ ఇప్పుడే దిగ్విజయ యాత్రకు బయలుదేరి

రాజా! ఒక్క సంగతి మాత్రం ముఖ్యంగా గుర్తుపెట్టుకో రాజసూయ యాగం చేస్తుం టే చాలా విఘ్నాలు సంభవిస్తాయి బ్రహ్మ రాక్షసులు దాన్ని సాగనీయకుండా చేయడానికి శత విధాల ప్రయత్నిస్తారు ఒకవేళ ఆ యాగం నిర్వి ఘ్నంగా పరిసమాప్తమైతే, సకల ప్రజా ప్రళయం సంభవించేటంత పెద్ద యుద్ధం

జరుగుతుంది అని హెచ్చరించాడు నారదుడు

ధర్మరాజు ద్రౌపది వంక చూశాడు

నారదుడు చేసిన హెచ్చరికతో పాంచాలికి ముచ్చెమటలు పోశాయి

ధర్మరాజు నిస్తేజుడై కూర్చున్నాడు

'వేద వేద్యుడూ, జగదేక వంద్యుడూ శ్రీకృష్ణుడుండగా మీకు భయమేమిటి ?

అని కన్నులర మోడ్చి పైకి చూశాడు మహర్షి

'నారాయణ నారాయణ ' అన్నాడు

ద్రౌపదీ ధర్మరాజులు చిరునవ్వుతో మహర్షికి నమస్కరించారు

' ధర్మ తనయా ! న్యాయ పరిపాలనతో, చాతుర్వర్ణా శ్రమ ధర్మాలను రక్షిస్తూ జయశీ లుడవై ప్రకాశించు ఇంక నేను వెళ్ళి వస్తాను నీకు శుభమగుగాక

అని బయలు దేరాడు నారదుడు

ధర్మరాజు ఆ మహర్షికి వీడ్కోలు చెప్పాడు

× × ×

రధం దిగి వస్తూనే కృష్ణుడు రాజభవనానికి వెళ్ళి

మేనత్తకూ, ధర్మరాజుకూ నమస్కరించాడు

కుంతి మేనల్లుడ్ని దీవించి హంసతూలికా తల్పం మీద కూర్చో బెట్టింది

పాండు నందనులు, ద్రౌపది ఎదురుగా నిల బడివున్నారు

చాలా సేపు ఎవరూ మాట్లాడలేదు

చివరికి కృష్ణుడే అడిగాడు ' ఏమైంది అత్తా ? '

కుంతి కలవరపడింది

' నాయనా ! ఇంతకు ముందు కొద్ది రోజుల క్రితం నారద మహర్షి వచ్చి మీ మామయ్య మాటగా రాజసూయ యాగం చెయ్యమని ఆనతిచ్చిపోయాడు దానివల్ల లోక భయం కరమైన యుద్ధం వస్తుందని కూడా చెప్పాడు తండ్రికి మేలు చెయ్యని కొడుకు జన్మ ఎందుకనే భావం ఒక వైపూ, రాజసూయం చేస్తే ప్రజాప్రళయం సంభవిస్తుందనే భయం ఒక వైపూ నా ఎడ్డల్ని వేధిస్తున్నాయి నా పిల్లలకు వాళ్ళ పినతండ్రి ఇచ్చిన ఈ రాజ్యం చాలు కడుపులో చల్ల కదలకుండా సుఖంగా వున్న బిడ్డలకి - రాజసూయ యాగాలూ పోరాటాలూనా వద్దు నా బిడ్డలకేమైన అయితే నేను భరించలేను '



' అత్తా నీ తల్లి మనసు నాకు అర్ధంగాక పోలేదు

అయినా తెలియక అడుగుతాను - సర్వగుణ సంపన్నులైన నీ కొడుకులు తప్ప రాజ సూయ యాగం చేసేటంత సమర్ధులిం కెవరున్నారు ? రాజసూయ యాగం చెయ్యడం వున్న రాజ్యం చాలక కాదు ; ధర్మాత్ముడైన పాండురాజుకి సురలోక సభా ప్రాప్తి కలిగించేందుకు రాజసూయం చేస్తే సమస్త దోషాలూ నశిస్తాయని నారదుడు నాకూ చెప్పాడు '

ద్రౌపది కళ్ళతోనే అన్నకు వందనం చేసింది

కృష్ణుడు నవ్వాడు

' ధర్మరాజా ! శౌర్య రాసులైన నీ తమ్ముల సహాయంతో, పాంచాల పుత్రి ప్రోత్సాహంతో రాజసూయాన్ని నువ్వు నిర్విఘ్నంగా పూర్తి చెయ్యగలవు

మీ మీద మమకారంతో అత్త మీకు యుద్ధా లూ,పోరాటాలూ వద్దంటోంది కాని, మీ శక్తి ఆవిడకంటే నాకు బాగా తెలుసు ' అన్నాడు

' నిజమే నేను నిమిత్త మాత్రురాల్ని ' అంది కుంతి

' బావా ! నువ్వు జయించవల్సిన వాళ్ళలో జరాసందుడు ముఖ్యుడు '

' అయితే ఇప్పుడే బయలుదేరుతాం ' అన్నా డు భీముడు

కృష్ణుడు ముందుకడుగేసి ' భీమా ! నువ్వు నా తోనే వుండు ' అన్నాడు

' మనిద్దరమే జరాసంధుణ్ణి చంపి వేడుక చేసుకుందామా ? '

ఆ మాటకు అక్కడ వున్న వాళ్ళందరూ నవ్వారు

జరాసంధుడు సామాన్యుడు కాడు పూర్వం పరశురాముని పగవల్ల క్షత్రియ వంశాలన్నీ నశించిపోగా మిగిలిన ఐల, ఇక్ష్వాకు వంశాలను అతను జయించాడు పైగా బల గర్వంతో కన్నూ మిన్నూ కానని శిశు పాలుడు అతనికి సేనాపతి

జరాసంధుడి దగ్గర హంసుడూ, డిభకుడు అనే ఇద్దరు మహా యోధులుండే వారు వాళ్ళు ఒకరి చేత జయింపబడరు వాళ్ళిద్దరూ జరాసంధుణ్ణి స్వామి భక్తితో కొలుస్తూ వుండేవారు హంస డిభకులకు కౌశిక, చిత్రసేనులనే పేర్లు కూడా వున్నాయి ఆ ఇద్దరినీ ఎంతో నేర్పుగా కడ తేర్చాను - అన్నాడు కృష్ణుడు

'ఇంతకు మునుపేగా వాళ్ళు ఎవరివల్లా చావరని చెప్పావు ఎలా చంపావో చెప్పవా?' అని అర్జునుడు చిన్నపిల్ల వాడిలా అడిగాడు

## హంస డిభకులు

హంస డిభకులు జరాసంధుడికి కుడి ఎడమ భుజాల్లా వుండేవారు

పశ్చిమ దిశను అప్పుడు భగదత్తుడనే మరో రాజు పరిపాలించేవాడు అతను మహాబల వంతుడు మీ తండ్రికి స్నేహితుడు అందు చేత మనస్సులో మీరంటే ఇష్టమున్నా భయంవల్ల జరాసంధుడు చెప్పినట్లు చేస్తుం డేవాడు చేది రాజైన పురుషోత్తముడూ, కరూశ దేశాధిపతి అయిన పౌండ్రక వాసు దేవుడూ జరాసంధుడి కనుసన్నలలో మెలి గేవారు తూర్పు దక్షిణ దిశలలో వున్న రాజులందరూ అతనికి లోబడ్డ వాళ్ళే ఉత్తర దిశలో వున్న పద్దెనిమిది క్షత్రియ వంశాల వాళ్ళూ ఉత్తర పాంచాల, శూరసేన, పుష్కర, పుళింద, కళింగ కుంత, మత్స్య దేశాల రాజులూ జరాసంధుడికి భయపడి రాజ్యాలు విడిచి పారిపోయారు జరాసంధు డి కూతుర్నే మా మేనమామ కంసుడు పెళ్ళి చేసుకున్నాడు నేను కంసుడ్ని చంపడం వల్ల జరాసంధుడు నా మీద పగబట్టాడు - అని ఒక్క క్షణం ఆగాడు కృష్ణుడు

'వావా! అతనికి నువ్వెవరో తెలీదా?' అన్నాడు భీముడు

కృష్ణుడు మందహాసం చేశాడు

'రాజయ్యాక మహారాజు మహారాజయ్యాక రాజాధి రాజు, ఆపైన భగవంతుడినే తలద న్నాలనే ఆశ అహం ఆవరిస్తాయి కొందరిని' అన్నాడు ధర్మరాజు

'వినాశకాలే విపరీత బుద్ధిః' అంది కుంతి

'వూఁ తరువాత అని ఆసక్తి చంపుకోలేక ముందుకొచ్చి నిలబడ్డాడు భీముడు

హంస డిభకులను వెంట బెట్టుకుని జరాసంధుడు మధురాపురాన్ని ముట్టడించాడు నేను యదు, వృష్ణి, భోజాం ధకులతో కలిసి జరా సంధుడ్ని ఎదిరిం చాను కాని సాధ్యం కాలేదు జరాసంధుడు హంస డిభకులతో కలిశాడంటే అతనిని ఎవరూ జయించలేరు అందుకని ఒక ఉపా యం ఆలోచించి హంసుడు మరణించాడని డిభకుడు నమ్మేలా ఒక కథ అల్లేను హంస డిభకులకు భుజ బలం తప్పితే బుద్ధి బలం లేదు డిభకుడు నిజంగానే తన అన్న చని పోయాడనుకున్నాడు నీళ్ళలో మునిగి ఆత్మ హత్య చేసుకున్నాడు అది విని హంసుడు హఠాన్మరణం చెందాడు ఇలా వాళ్ళిద్దరూ చనిపోయేసరికి జరాసంధుడు అసహాయుడై మగధ దేశానికి తిరిగి పోయాడు అయినా అతనిప్పటికీ మనకు శత్రువే అతను ఇప్పుడు మరీ ఘోరాలు చేస్తున్నాడు రాజులం దర్నీ చెరబట్టి తెచ్చి రోజూ ఒక్కొక్కరిని భైరవుడికి బలి ఇస్తూ పూజ చేస్తున్నాడు గిరి వ్రజమనే బలమైన కోటను నిర్మిం చుకుని అందులో వున్నాడు అతనిని గనుక మీరు జయించగలిగారంటే మీ రాజ్యం సుస్థిర మవుతుంది - అన్నాడు కృష్ణుడు

'అంతా నీ దయ నువ్వు ముందుంటే నీ వెనక నడిచే వాళ్ళమే మేము భారమంతా నీదే' అన్నాడు ధర్మరాజు

కృష్ణుడి మీద భక్తితో అతని కంఠం గద్గదమైంది

'ఎంత బల గర్వాలు కలవాడైనా దుర్మార్గుడూ, వివేకహీనుడైతే అలాంటి వాడి దగ్గర మహాలక్ష్మి నిలబడదు నేను చెబుతున్నాను దిగ్విజయానికి సిద్ధం కండి' అన్నాడు కృష్ణుడు

శత్రు భయంకరుడైన కృష్ణుడు వెంట వుంటే భయపడాల్సింది ఏముందిలే అనుకున్నారో ఏమో, భీమార్జునులిద్దరూ అన్నకు నమస్కరించి బయలుదేరారు

ధర్మరాజు అశ్రుపూరిత నయనుడై వాళ్ళను దీవించాడు వాళ్ళు ముగ్గురూ అమితోత్సాహంతో ఒకరి భుజాలు మీద ఒకరు చేతులు వేసుకుని నవ్వుకుంటూ రథమెక్కారు

సరయూ నదిని దాటారు
మిథిలను చూశారు
గంగను అతిక్రమించారు

ఆ తరువాత ఉత్తరాభిముఖంగా కొంతసేపు ప్రయాణం చేశారు అప్పటికి బాగా అలసి పోయారు ఇంకా పది కోసులు వెళ్తేగాని మగధ దేశం రాదు కాసేపు అక్కడే ఒక చెట్టుకింద విశ్రమించి మళ్ళీ బయలు దేరారు

మధ్యలో వాళ్ళకు గోరథమూ, ఋషభమూ, వైహారమూ, ఋషగిరి, చైత్య కాద్రి అనే అయిదు పర్వతాలు కనిపించాయి వాటి మధ్యలో వుంది జరాసంధుడి నగరం అయిదు పర్వతాలూ ఆ నగరాన్ని చుట్టుకుని శూరభటుల్లా కాపలా కాస్తుంటాయి కనుక దానికి గిరివ్రజమనే పేరు వచ్చింది

చైత్యకాద్రి శిఖరంలో మూడు భేరీలు వున్నాయి మగధ వాసులుమానుషాదమనే పేరుగల ఒక ఎద్దును చంపి దాని చర్మంతో ఆ మూడు భేరీలూ నిర్మించారు జరా సంధుడి నగరానికి వెనుక వైపున చైత్యకాద్రి పర్వతం వుంది మిగిలిన పర్వతాల్లో ఒకటి గిరివ్రజానికి సింహద్వారమై వుంది తక్కిన మూడు పర్వతాలూ ఎవరూ ఎక్కలేనంత ఎత్తయినవి శత్రువులంటూ వస్తే చైత్యకాద్రి నుంచే రావాలి అందుకే ఆ భేరీలు మూడూ అక్కడ పెట్టారు గిరి వ్రజంలో గౌతమ మహర్షి చాలా కాలం వున్నాడు ఆయన మాగధుల్ని అజేయుల్ని చెయ్యడం కోసం తన శక్తంతా ధారపోసి శత్రువులెవరైనా ఈ పురంలోకి ప్రవేశిస్తే ఆ మూడు భేరీలూ

### అనురాగం!

చెలికన్నుల చంద్రోదయం
చెలికానికి నవోదయం'
చంద్రబింబ మహోదయం
చెలిచెక్కిట ఉషోదయం!
చెమలిన ఆకళ్ళలో
సేదతీరిన ఊహల ఊయలలో
సెలయేటి సవ్వడిలా
గలగలమనే గవ్వల సవ్వడిలో
వినిపించే ఆ రాగం చెలి అదరమ్ముల అనురాగం!

—కొత్త చక్రవర్తి

వాటంతటవే మోగేటట్టు చేశాడు

కృష్ణార్జునులూ, భీముడూ ఆ భేరీలను విచ్ఛిన్నం చేసి చైత్యకాద్రి తటాన్ని బద్దలు కొట్టి గిరివ్రజంలోకి ప్రవేశించారు

జరాసంధుడికి సంగతి తెలిసింది

మందిరం తలుపును భళ్ళున తెరచి బయటకు వచ్చాడు ఆగ్రహావేశుడై కాలితో నేల మీద బాదాడు

ఎవరక్కడ అని అరిచాడు

కత్తి దూసి పరుగెత్తాడు

చైత్యకాద్రి దగ్గరకు వెళ్ళి దిక్కులు పిక్కటిల్లేటట్టు అరిచాడు తన అరుపు తనకే భయంకరంగా వినిపించింది

కొండెక్కబోయి కూలబడిపోయాడు

ఆయాసంతో ఒగురుస్తున్నాడు

అలాకూచునేచుట్టూకలయ చూశాడు

ఎదురుగా ముగ్గురు బ్రాహ్మణ స్నాతకులు

కొంచెం ధైర్యం వచ్చింది స్థిమిత పడ్డాడు కోపం చల్లార్చుకుని 'మీరెవరు? మీ వైఖరి చూస్తే చాలా వింతగా వుంది చైత్యకాద్రి తటాన్ని బద్దలు కొట్టి, భేరీలు భగ్నం చేసి దొడ్డి దోవన పట్టణంలోకి ప్రవేశించాల్సిన అగత్యమేమొచ్చింది మీకు? మీరెవరో పగటి వేషధారుల్లా వున్నారు కాని, నిజమైన బ్రాహ్మణుల్లా లేరు వేషంలో బ్రాహ్మణత్వ మూ, శరీర లక్షణాలలో క్షత్రియత్వమూ కనబడుతోంది మీరెవరో నిజం చెప్పండి అన్నాడు

'రాజా మిత్రుని ఇంటికి సింహద్వారం నుంచి శత్రుని గృహానికి వెనుక ద్వారం నుంచీ వెళ్ళాలని పెద్దలు చెబుతారు అయినా స్నాతకులు బ్రాహ్మణులే కావల్సిన అవసరం లేదు స్నాతకులు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య జాతుల్లో మూడింటిలోనూ వుంటారు' అన్నాడు కృష్ణుడు

జరాసంధుడికి చెళ్ళున కొట్టి నట్టయింది

కోపం, రోషం ఎగజిమ్ముకు వచ్చాయి

'ఇంతకీ మీరెవరు? బ్రాహ్మణులా క్షత్రి యులా?

కృష్ణుడు మందహాసం చేశాడు

'ఎవరైనా ఖచ్చితంగా శత్రువులమే!'

జరాసంధుడు నివ్వెరపోయాడు

'విప్రులారా! నేనిచ్చే మర్యాదను నిలుపు కోండి నేను తలుచుకుంటే మిమ్మల్ని ఇప్పుడే ' ఇంకా ఏదో

# ద్రౌపది

అనబోయి ఆగాడు జరాసంధుడు

భీముడు పిడికిలి బిగించాడు

అది చూసి కళ్ళతోనే వద్దని వారించాడు కృష్ణుడు

జరాసంధుడు నవ్వుతూ 'మీకు నేనూ, నాకు మీరూ ఎప్పుడూ అపకారం చెయ్య లేదే! దేవతలనూ, మునులనూ, విప్రులనూ నిరంతరం సేవిస్తూ ఉత్తమ క్షత్రియుల్ని అనుసరించి నడుచుకునే నేను మీకు శత్రువునెలా అయ్యాను అని సందేహంగా అడిగాడు

'ఆహా! ఎంత వినయం నటిస్తున్నావు సద్ధర్ములైన రాజుల్ని అనుసరించి నడుచు కుంటున్నానన్నావు రాజులందర్నీ చెర బట్టి బలి యిస్తూ పశుపతిని పూజిస్తున్న దుర్మార్గులెవరైనా వున్నారా? ఇంతకంటే నువ్వు ఇంకేం తప్పు చెయ్యాలి? కారణం లేకుండా సాధు జనుల్ని హింసించేవాడు అందరికీ శత్రువే! అయినా ఇంక దాచవల్సిన పనికూడా లేదు చూడు! నేను కృష్ణుడ్ని ఇతను భీముడు అతను అర్జునుడు ఈ కురుసింహాలు రెండూ నిన్ను జయించ టానికి వచ్చాయి అన్నాడు కృష్ణుడు

ఆ మాటలు విని జరాసంధుడు నెయ్యి పోసిన అగ్నిలా మండిపడ్డాడు

తోక త క్కిన పాములా బుసలు కొట్టాడు

తన కొడుకు సహదేవుణ్ణి అప్పటికప్పుడే రాజ్యానికి అభిషిక్తుణ్ణి చేసి పురోహితుల ఆశీర్వాదం తీసుకుని యుద్ధరంగంలోకి ప్రవేశించాడు

జుట్టు వెనక్కి కట్టి ముడేశాడు

మల్ల యుద్ధానికి తగిన అలంకారమంతా చేసుకున్నాడు ముందు భీముణ్ణి యుద్ధానికి రమ్మన్నాడు

అతను జబ్బ చరిచి గోదాలోకి దూకాడు మబ్బు లేకుండా పిడుగుపడ్డట్టయింది

జరాసంధుడు అదిరిపడి చూశాడు

భీముడు తన మీదకు ఉరుకుతున్నాడు

కొదమ సింహంలా జరాసంధుడు కూడా అతని మీదకు లంఘించాడు

సింహ గజేంద్రాల్లా

వజ్ర పర్వతాల్లా

దేవేంద్ర వృత్రాసురుల్లా

మబ్బు మీద మెరుపుల్లా

శక్తికి రూపాల్లా

చెలరేగారిద్దరూ

కార్తిక మాసం మొదటి రోజు మొదలుకొని చతుర్దశి నాటి రాత్రి వరకూ ఎడా తెరిపి లేకుండా సాగింది యుద్ధం

అప్పటికి జరాసంధుడు పూర్తిగా అలిసి పోయాడు

అది గ్రహించి భీముడు తన తండ్రి వాయు దేవుణ్ణి తలుచుకుని ఆయన అనుగ్రహంవలన అధిక బలసంపన్ను డయ్యాడు జరాసంధు ణ్ణి ఎత్తి చేతి బలం కొద్దీ గాలిలో గిరగిర తిప్పాడు ఆ తరువాత నేలకేసి బాదాడు అతని ముక్కుల్లోంచీ నోట్లోంచీ, చెవుల్లోంచీ ఎర్రటి విషం కక్కాడు భీముడు జరా సంధుడి శవాన్ని ద్వార తోరణ సమీపం వరకూ ఈడ్చుకుంటూ వెళ్ళాడు

ఆ కళేబరాన్ని చూసి ప్రజలందరూ భయ పడ్డారు ఇన్నాళ్ళూ చెరసాలలో మగ్గిన రాజు లందరూ బయటకు వచ్చి దేవ దేవుడి పాదాలకు నమస్కరించారు (ఇంకావుంది)

# వారఫలం

## *7-7-1989* శుక్రవారం మొదలు
## *13-7-1989* గురువారం వరకు

**మేషం-** శ్రమతో ఒకానొక వ్యవహారంలో విజయం సాధిస్తారు చలన చిత్ర రంగానుకూలత చాల మందికి చెప్పదగిన అంశం పత్రికా రంగాన శ్రమించు వారికి అనుకూలం శుభ సమయంగా గ్రహించాలి స్త్రీలకు- శుభసమయం ఉద్యోగమందు పెంపు, ధన లబ్ధి

**వృషభం-** క్రమంగ 'గురుని' స్థితి లాభదాయకం కానున్నది విద్యా వేత్తల సహాయ మున్నది సజ్జన సహవాసమున ఏదో మేలు జరుగనున్నది ఒకానొక వ్యవహారం, 'మధ్యస్తం ద్వారా' అనుకూలిస్తుంది 'కోర్టు' వ్యవహారాలున్నా యిబ్బంది లేదు ధన విషయంలో ఏ లోపం లేదు స్త్రీలకు- ధన వృద్ధి, వృత్తి పెంపు గలవారం

**మిధునం-** ధన విషయంలో ఏ మాత్రం లోపంలేదు కళా సాహిత్య రంగావకాశాలుంటాయి సభా గౌరవమున్నది పత్రికా రంగాన శ్రమించు వారికి అనుకూల వారం రాజకీయంగా అనుకూల వారమే, శ్రమించండి స్త్రీలకు- అనుకూల సమయం చిత్ర రంగానుకూలత గల సమయం ఉద్యోగలాభం, గమనించాలి

**కర్కాటకం-** స్థితియందు పెంపు చెప్పదగిన సమయం రాజకీయవాదులతో పరిచయం లాభదాయకం సుఖశాంతులు, ఆదాయ వృద్ధి, సమయానుకూలంగా కార్యాచరణ చెప్పదగిన అంశాలు, సత్కార్యాచరణమునకు అనుకూలం బంధు విరోధం ఏర్పడవచ్చు జాగ్రత్త? స్త్రీలకు- కృషి లోపం లేకుంటే సర్వవిధాలా మేలే!

**సింహం-** నూతన వ్యక్తులతో పరిచయం రాజకీయ వాదులకు అనుకూలం 'కేతు స్థితి' రాశియందుండుట కొంత యిబ్బందికి కారకమే 'జాయింటు' వ్యాపారం చేసేవారికి అనుకూల సమయమే ప్రయాణం జరుపవలసి వచ్చినా, జాగ్రత్త అవసరం ఒక వేళ మానుకొన్నా మంచిదే స్త్రీలకు- గృహమార్పు, ఉద్యోగమార్పు, స్వల్పాదాయం

**కన్య-** నూతన మిత్ర సహాయమున్నది వ్యాపారాన లాభమున్నది సుఖశాంతులున్నాయి ఆదాయమందు లోపంరాదు వృత్తియందు అనుకూలత వార విశేషం విద్యార్థులకు అనుకూలత, ఆశించిన విధంగా 'సీట్లు' లభ్యం కావటం గమనింపదగిన అంశం స్త్రీలకు- ఉద్యోగరీత్యా పెంపు, మిత్రాదరణ, స్వల్ప ఆదాయం

**తుల-** రాజకీయంగా అనుకూలం 'శని' తృతీయ స్థితి అత్యంత అనుకూలం వృత్తియందు చెప్పదగిన మార్పు రావచ్చు అతిథి అభ్యాగతులను ఆదరించుట తప్పదు కొందరు గృహ నిర్మాణ కార్యక్రమమందు నిమగ్నులవుతారు. స్త్రీలకు-సదవకాశాలున్నాయి

**వృశ్చికం-** విశిష్ట వస్తు సేకరణకు ఆస్కారం, విద్యా వినయ సంపన్నులతో పరిచయం, రాజకీయ వ్యక్తుల పరిచయం, వృత్తియందు వృద్ధి, మాటకు గౌరవం చేకూరనున్న వారం ఒకానొక వ్యవహారాన క్షణ క్షణం భయాందోళనలు, వ్యవహార రీత్యా అనుకూలత, స్త్రీలకు- అభిమానించే వారున్నారు, ప్రయాణాలున్నాయి

**ధనుస్సు-** దూరభారాల నుండి బంధు మిత్రులు రానున్నారు మీ సహాయం అర్థింపనున్నారు మీ మాటకు గౌరవ ప్రతిపత్తి లభ్యం కానున్నది వారమంతా మేలుగానే కనిపిస్తుంది వస్తు వాహన సేకరణకు అనుకూలం రాజకీయరంగాన మేలుగాదు స్త్రీలకు- లాభదాయక వారం సుఖశాంతులు

**మకరం-** స్థిరచరాస్తుల విషయంగా కొంత గొడవ రావచ్చు ఇరుగు పొరుగుతో యిబ్బంది రావచ్చు కొందరకు సభా గౌరవమున్నది ఏమున్నా ఆశయ సిద్ధికి అహరహం యత్నించాలి. శని బాధా నివారణం కాలేదు, గ్రహించాలి స్త్రీలకు- వస్తు వాహన సేకరణకు అనుకూల వారం, గ్రహించాలి

**కుంభం-** గ్రహానుకూలత గల సమయం వాహన సేకరణకు అవకాశమున్నది, యత్నించండి అపూర్వ వస్తుసేకరణకు అనుకూల సమయం దూరపు బంధు మిత్రులు రాగలరు వ్యాపారాన చక్కని అవకాశాలు స్త్రీలకు- విద్యా వేత్తల, ధనవంతుల సహాయం, ఆదాయమందు వృద్ధి, వృత్తియందు పెంపు

**మీనం-** విశేష ప్రజ్ఞతో నాలుగు వ్యవహారాలు సరిదిద్దుకొంటారు అయినదానికి, కాని దానికి అదే పనిగా తిరుగుతారు ఉత్తరాల మూలంగా పలు విషయాలు గ్రహిస్తారు అనుకొన్న విధంగా కళాసాహితీ రంగాన సదవకాశాలు చిక్కుతాయి స్త్రీలకు- వస్తు సేకరణకు సదవకాశాలు, ఆదాయవృద్ధి

-విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి

## అంతా అదేమయం!

కులం మనిషికే కాదు
మానుకూ సోకింది
చెదలై
ఇంటింటా పాకింది!
కులం మనిషికే కాదు
గాలికీ సోకింది
పీల్చినవాడి గుండెలకు
పుండై పాకింది!
కులం మనిషికే కాదు
జలానికీ సోకింది
తాగినవాడి పేగులకు
కాన్సరై పాకింది!

-అడిగోపుల వెంకటరత్నమ్



# ఏనాటికీ మరచిపోలేని మహానటుడు మన యస్.వి.ఆర్.

వెండి తెర వెలుగు ఎస్. వి. ఆర్. జయంతి జూలై *13*, వర్ధంతి జూలై *18* ఆ సందర్భంగా ఈ వ్యాసం వేస్తున్నాము. *23-8-63, 30-8-63* ఆంధ్ర సచిత్ర వారపత్రిక సంచికలలోని "తెరమీద తెర వెనుక" (వీరాజీ) శీర్షికలోని యీ కొన్ని అంశాలు నేటితరం పాఠకులకు "యశస్వి" రంగారావు గురించి తెలియజెపుతాయని భావిస్తున్నాము. - ఎడిటర్.

అప్పుడు తమిళంలో గొప్పగా బోలెడు సినిమాల్లో నటిస్తున్న తెలుగు ఎస్. వి. రంగారావు తెలుగులో బ్రహ్మాండమైన నటుడు. తెలుగు తెర కొక ప్రత్యేకమైన ప్రతిపత్తి ఇచ్చిన నటులలో శ్రీ ఎస్వీ రంగారావు పేరు కొందరు మొదట చేరుస్తే, చాలామంది అభ్యంతరం చెప్పరు కానీ, అస్సలు మానేస్తే- మాత్రం అందరూ తిడతారు. తెలుగు తెర పెద్దతారలలో శ్రీ రంగారావును వదిలేయడం 'పాతాళభైరవి' నాటినుంచీ కూడా తప్పుగానే భావించారు ప్రేక్షకులు.

## అంఫట్

శ్రీ ఎస్. వి. రంగారావు నేపాళ మాంత్రికుడిగా 'అంఫట్' మంటూ జనం గుండెలు దోచుకున్నాడు. అటు తర్వాత-



మంచీ అతనికి లభ్యమైన పాత్ర లన్నింటికీ ఒక ప్రత్యేకతను, పాత్ర చిత్రణలో ఒక ఒరవడిని పెట్టుకుంటూ రావడం అతని "పెట్టుబడి" అయితే ధానికి ప్రేక్షకులు ఇచ్చిన ఆదరాభి- మానాలు అతనికి 'లాభం'.

కళను ఇలా వ్యాపార దృష్టితో చూసినా గొప్ప క్రెడిట్ రంగారావుది.

## నేపాళ మాంత్రికుడూ, హరిశ్చంద్రుడూ

ప్రవరాఖ్యుడి వేషం కట్టాడు పాత రోజుల్లో ఆ సినిమా నేను చూడలేదు ప్రేక్షకులలో అప్పుడుకూడా చాలామంది 'చూడం పొమ్మన్నారుట'

పాపం ఇది ఒక 'కవితా గాథ' అని సని మా అభిమానులు రంగారావుగారి 'ఫ్యాన్స్' భావిస్తార

'అబ్సర్డ్' రంగారావ్ బొమ్మ ఫెల్యూరా?' అన్నాడు మాయాబజార్ సినిమా రాకపూర్వమే, బంగారుపాప రోజుల్లోనే ఒక మిత్రుడు కాని ఆనాడు ఆ ప్రవరాఖ్యుడు సక్సెస్ అయితే తెనుగుతెర దరిమిలాన తమిళతెర రెండూ కూడా ఒక క్యారెక్టర్ ఏక్టర్‌ని, ఒక ఉత్తమ కళాకారుణ్ణి పొందలేకపోయిన దౌర్భాగ్యస్థితిలో ఉండేవి!

తొమ్మిది ఇంటూ పదిహేను అడుగు ల పెద్దతెరమీద చూస్తేనే అంత పొడుగూ, ఇంత విగ్రహం అగుపించే నటుడుకాదు ఎస్వీ. సామాన్య ప్రమాణంలో కూడ నిండైన భారీ విగ్రహం నడకలోనూ మాటలో

షేక్స్‌పియర్ నాటకాలాడటం తెలుగు మంచినీళ్ళప్రాయంగా వచ్చును కూడానట 'షైలాక్'గా ప్రశంసలందుకున్న శ్రీ ఎస్ వి రంగారావుకు అంఫట్ వేషం ఒక లెఖ్ఖా? పాతాళభైరవిలో క్రూరంగా రావు

మ్మా,రీవి, హొండా (హుక్కా పీల్చే అలవాటు కూడ వుంది) అగుపిస్తాయి!

## నాటి మాయలమరారీ? నేడు మంచివాడు, మంచినటుడు

పెద్దపులుల్లాంటి నాలుగు కుక్కలను పెంచుతున్నాడాయన అందులో ఒకదాని పేరు 'సీజర్!'

చెయ్యెత్తుమనిషి, గంభీరమైన విగ్రహం, తీక్షణమైన డేగచూపు, దార్ఢ్యమైన నడక, అతనిప్రక్క పెద్దపెద్ద ముట్టెలూ, తోకలూ కల అల్సేషియన్ కుక్కలు. అత-



కార్టక్టర్ ఏక్టర్ రంగారావు తెరవెనుక...ఇంట్లో హుక్కా పీలుస్తూ

న ఇంటిముందు ఆవరణలో వస్తూవుంటే, సాధారణంగా ఎక్కువమంది తమిళ ప్రేక్షకులు గేటుదగ్గర గుర్ఖాలతో "మేం రంగారావు గారిని చూస్తా"మని ఘర్షణపడుతూంటారు అయితే శ్రీ రంగారావు మాయలమరారీని ఒక కొత్తపంథాలో తెరకెక్కించిన బాలనాగమ్మ నటుడూ కాని నిజంగా మాయలమరారీ కాదు మంచినటుడు ప్రేక్షకులంటే నవ్వులు చిందించేవాడు

తాను చూస్తేమాత్రం గూర్ఖాలను అదిలించనివ్వక, కుక్కలను నిలదియ్యనివ్వక, అభిమానులను పలకరించి కుశలప్రశ్నలు వేస పంపేస్తుంటాడు

తెనుగువాళ్ళు గర్వంగా అనుకునే యస్వీ తమిళులకు అత్యంత ప్రేమపాత్రుడయాడు తెనుగు నిర్మాతలు కొందరు శీతకన్ను వేసినా అతని యశస్సు మాత్రం జంట పూలు పూస్తూనేవుంది! ఏపీ రాజకీయాలతన్ని దెబ్బతియ్యలేకపోయాయి

## ప్రతిభ వాడుకోడం

"తెనుగు సినిమాలవాళ్ళకి ప్రతిభను సరియైన పద్ధతిలో వాడుకోడం తెలీదనే" అభిప్రాయం ఉన్నది రంగారావుకి తెలుగు సినిమాలు బాగుపడటం గురించి, ప్రస్తుతం వాటి నైతిక, కళాత్మక స్థాయి అంతగ బాగులేదనే ఉద్దేశంతో నేను ఆయనతో మాట్లాడాను

"తెనుగు సినిమాయే కాదు. ఏ సినిమాయైన కేవలం వ్యాపారంగా వుంటున్నంతకాలం అది బాగుపడదు" అన్నాడాయన ప్రస్తుతం అనేకానేక రకాల పాత్రలను ప్రజాహితంగా నటిస్తున్న తమిళనటుడు శ్రీ ఎస్వీని "తెలుగు సినిమాలలో ఈమధ్య అరుదుగా వస్తున్నారు తమిళ సినిమాలు 'ప్రిఫర్' చేస్తున్నారా?" అనడిగితే "లేదు లేదు నాకు అటువంటి తేడా లు లేవు తమిళ నిర్మాతలు, వారి అభిమానమూ, ప్రేక్షకుల మన్ననా నన్ను ముగ్ధుడను చేస్తున్నాయి నేను తెలుగులో నటిస్తాను మన నిర్మాతల నెప్పుడూ కదనను కాని నా పద్ధతిలో వారు రావాలి అంటే ఉభయతారకమైన పంథాలో వస్తే కాదనలేను పాలిటిక్స్ నా కయిష్టం" అన్నారు కీచకుడిగా మరోసారి తెనుగుతెరను వెలిగించనున్న శ్రీ రంగారావు "కీచక" పద్ధతిలో నవ్వుతూ

"కీచకుడి వేషంలో ఒక ప్రత్యేకత నేదే నా ప్రవేశపెడతారా?"

"నిజంగా నాకు ఆ పాత్రను పూర్తిగా స్టడీచేసే దానికీ, నాకూ కూడా ఒక చిరస్మరణీయతను ఇవ్వాలని ఉంటుంది అలాంటి ప్రయత్నం బాలనాగమ్మలో, మాయలమరారీగా చూపించాను కీచకుడి వేషమే వేరు ఆ పాత్రలో వైవిధ్యమూ ఉన్నది, రసకళా ఉన్నది అది చూపిస్తా" అన్నాడాయన

## హైహై నాయకా

శ్రీ ఎస్వీని మనం ఘటోత్కచుడిగా మరిచిపోలేము పురాణపురుషులైన రాముడూ, కృష్ణుడూ వేషాలు వేరు ఐతిహాసికపు వేషాలైన ఘటోత్కచుడూ, హిరణ్యకశిపుడూ వేరు మాయాబజారు సినిమాలో ఘటోత్కచుడు ఒక ఆదర్శ పురుషునిగా, ఒక ధర్మానికి, ఒక నీతికి కట్టుబాటు చేసేవానిగా అగుపిస్తాడు 'దుష్ట చతుష్టయ హాహాహా' అని ఘటోత్కచుడు కంగా నవ్వినది ఒక నాయకుడు నవ్విన నవ్వుగాని రాక్షసుడు కాదు అదో ప్రత్యేకత రంగారావు పాత్రపోషణలో ఒక ఉదాత్తత తెసుకురాగల ధైర్యశాలి.

## తెనుగు రైతు

హిరణ్యకశిపుడుగా చెంచులక్ష్మిలో అగుపించిన ఎస్వీని నమ్మినబంటులో తెనుగు రైతుగా వ్యక్తిత్వమున్న పేదవానిగా అగుపించిన రంగారావుని జ్ఞాపకం తెచ్చుకుంటే, శ్రీ రంగారావు నటనాశక్తి, ప్రతిభ తారాపథంలో ఏమండలంలో ఉంటాయో సులువుగా వూహించుకోవచ్చును

"ఆటమ్మా పాటమ్మా
తోలుబొమ్మలాటమ్మా!" బంగారుపాప సినిమా కాదా అంతేకాని, ఆ బొమ్మ కదలిక, మీ గుండెలను జివ్వుమనిపిస్తుంది దానికి తన కళా తపస్సును, నటతృష్ణను ధారపోసే నటుడు మీకు అభిమాన కళాకారు డవుతాడు శ్రీ రంగారావు అలా మీ గుండెలను కదిలించుతూ ఒకసినిమా నుంచి మరో సినిమాకి గొప్ప నటుడై పెరిగిపోయాడు

పాతాళభైరవిలో అసలు ఆకర్షణ "అంఫట్!"

నేపాళమాంత్రికుడు "హారం గిరం శాయక శృంగారం సేయవే బుల్ బుల్" అంటాడు (థాంక్స్ టు ది రైటర్!) నిజంగా కథ మరోలాగ ఉండకపోతే, ఆ బుల్ బుల్ శృంగారం చేసునేమో ఈ మాంత్రికుడితో!

## నాటకాలు

శ్రీ ఎస్ వి కి నాటకాల అనుభవం వుంది తన శక్తి తా నెరిగిన నటుడు



# మన యశస్వి రంగారావు

అధ్యయనుఉంది. సంభాషణ చెప్పడంలో ఒక విరుపు, ఒక కొత్తదనం, "వడి" సాధించిన ఘనత, ఈతరం నటు లందరిలోను ఆయన ఒక్కడికే చెల్లింది.

పౌరాణికంగా ఒక రకంగా, సాంఘికంగా ఇంకోరకంగా డైలాగును చెబుతూ, ఆ రంగారావు వేరు, ఈ ఎస్వీ వేరు అనిపించే ఈ ఎస్. వి. రంగారావు నిజజీవితంలో పట్టుదల, ఆశయం గల వ్యక్తి.

## కథకుడు-చిత్రకారుడు

కథలు రాయడం అంటే చాలా ఇష్టం.... వేటంత ఇష్టం! అంటాడాయన. చిన్ననాటినుంచి కాలేజీలో అన్నిరకాల పోటీలుగల ఉషారైన వ్యక్తి శ్రీ రంగారావు.

కథలు రాస్తాడు, చిత్రాలు గీస్తాడు, తుపాకీతో పేల్చడం, మాటల్లో వాదనా గ్రబవస్తే "సైసై" అంటూ వాగ్యుద్ధంచేయడం ఇవన్నీ అభ్యాసాలైన కూసువిద్యలే మన రంగారావ్‌కి.

పురాణ పాత్ర అయితే దాని "ఎనాలిసిస్ చాలా జాగ్రత్తగా చేస్తా" నంటాడాయన.

"పాత్రలో లీనమై నటించాలా?" అంటే "నేను పూర్తిగా పాత్రలో లీనమైపోవటం, అప్పుడప్పుడు సెట్‌మీద నెర్వస్ బ్రేక్‌డౌన్ రావడం కూడా కద్దు" అన్నారాయన.

శ్రీ ఎస్. వి. రంగారావు సినిమాలన్నీ మణిపూసలు. అందులో ప్రేక్షకులను మెస్మరయిజుచేసిన మాయాబజారు లున్నాయి. చకితులను చేసిన బాలనాగమ్మలున్నాయి. ముగ్ధులనుచేసిన బంగారుపాపలు మెప్పించిన నమ్మినబంట్లూ ఉన్నాయి.

అదో ప్రత్యేకత.

"నా చిన్ననాటి నించీ నటనే నా ఆశయం. తతిమ్మావి అభిరుచులే" రంగారావు అన్నాడాయన.

శ్రీ రంగారావుతోను నేను తెనుగు, తమిళ సినిమారంగాల మార్కెట్‌లో గల తేడాలను ప్రస్తావించినపుడు "నిజానికి తెనుగు సినీమారంగానికి టాలెంట్‌ను సవ్యంగా వాడుకోగల శక్తి సామర్థ్యాలు కొరవడుతున్నాయని" ఆయన మరోసారి అన్నారు.

## కేవలం డబ్బు?

'కేవలం డబ్బు మాత్రమేనా? కాదు. కళ అనేది అంతకంటే ఉదాత్తమైనది యింకేటి వుంది' అన్న దాయన విశ్వాసం. మంచిమాటకారిమాత్రమేకాదు 'డ్రామా' మీద అర్థార్తితో మాట్లాడే వ్యక్తి శ్రీ రంగారావు.

## అభిరుచులు: డ్రామాట్రూపు

బి.ఎస్‌సి. బోటనీ చదువుకున్న శ్రీ రంగారావుకు ఆటలంటే యిష్టముండేది మొదట్నుంచీ. వేటంటే యిప్పటికీ ఇష్టం. తుపాకీలు రకరకాలు తనదగ్గర పుస్తకాలు రకరకాలు ఉన్నట్లే ఉన్నాయి.

ఈయనకు సొంత డ్రామాట్రూపు ఉన్నది. దానితో డ్రామాలువేసి దేశ పర్యటన చేయడం, నలుగురికీ కళాత్మకమైన ఆనందాన్ని పంచడం ఈయన ఆశయాల్లో ఒకటి.

విజయావారు తీయనున్న చిత్రంలో తాను డబుల్‌రోల్ వేయవచ్చునని చెప్పాడాయన.

## ఏ వేషమేసినా....

ఏ వేషం వేసినా శ్రీ రంగారావులో ధాటి, హుందా రెండూ ఉట్టిపడుతుంటాయి. హరిశ్చంద్రుడుగా అతని పాత్రధారణను మరువలేం. అనేక విషయాలలో 'దర్జా' అంటే యిష్టం.... హుక్కా పీల్చగల అలవాటూ ఉంది.

## నాకు కర్ణుడి వేషం వేయాలనుంది

"నాకు కర్ణుడు వేషం వేయాలనుంది. నాకు మంచినటన అంటే విపరీతమైన దాహం అనండీ లేదా తృష్ణ అనండీ అలాంటిది ఉన్నది" అంటాడాయన.

పాత బాలనాగమ్మలో కే.శే. గోవిందరాజులు వేషాన్ని మరాఠీ వేషాన్ని ధరించిన మరోసారి మరోరకంగా వేసి ఓహో అనిపించుకున్న శ్రీ రంగారావు సామాన్యనటుడా? కాదు.

## కొత్త కావాలి

"కొత్తవాళ్ళను రానివ్వాలి. కొత్తదనం కొత్త నటులు వస్తారేమోనని పాతవారు భయపడకూడదు. ఛాలెంజిగా తీసుకుని కుర్రాళ్ళముందు నటించి, వారినీ పైకె రానివ్వాలి, తామూ శక్తి సామర్థ్యాలు నిరూపించుకోవాలి" అంటారు శ్రీ ఎస్. వి.

హిందూస్తాన్ మినరల్స్ అనే కంపెనీ బోర్డు ఆఫ్ డైరెక్టర్లలో ఒకడైన శ్రీ రంగారావు యిప్పట్లోనే ఆ కంపెనీతరఫున అమెరికాకు వెళ్ళగల అవకాశాలున్నాయని నాతో అన్నారు.

"వెళితేమాత్రం తెనుగుదనాన్ని గంభీరంగా అక్కడ చూపించిరాగలనన్న విశ్వాసం నాకున్నది" అన్నాడాయన.

శ్రీ రంగారావు తెనుగు, తమిళ వెండితెరకు ఒక అమూల్యమైన కళాకాన్క. (వెండితెర వున్నంతవరకూ వుంటాడాయన).

[తెరమీద - తెరవెనుక 1963 ఆగస్టులోని కొన్ని అంశాలు మాత్రం] ●

# సాహితీ పజిల్

## గళ్ల నుడి కట్టు –12

### బహుమతులు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ■ | 1 ఉ | త్ప | 2 లం | ■ | 3 కృ | త | 4 ము | ■ |
| ■ | సి | ■ | ఘ | ■ | పు | ■ | ద్గ | ■ |
| 5 వి | రి | ■ | 6 నం | 7 దు | డు | ■ | 8 రం | 9 భ |
| భీ | ■ | ■ | ■ | క్కి | ■ | ■ | ■ | గీ |
| 10 ష | ట్ప | ద | ము | ■ | 11 ప | రం | ప | ర |
| ణు | ■ | ■ | ■ | 12 నీ | ■ | ■ | ■ | థు |
| 13 డు | 14 బీ | ■ | 15 వ | రు | 16 స | ■ | 17 గో | డు |
| ■ | ర | ■ | ర | ■ | ర | ■ | పి | ■ |
| ■ | 18 ము | గు | ద | ■ | 19 మ | ర | క | ■ |

రకులు అత్యంత ఉత్సాహంతో వందల సంఖ్యలో ఈ పోటీలో న్నారు వ రందరికీ మా అభినందనలు! సరైన సమాధానం ఈ సారి ు పంపగలిగారు బహుమతి మొత్తం రు 200/– లను ఈ ఐదుగురికి గా పంచగా ఒక్కొక్కరికి రు 40/–లు చొప్పున వచ్చాయి త్వరలో ఈ ుతులు నగదు రూపంలో వారికి పంపే ఏర్పాట్లు జరుగుతున్నాయి ఒకరు కూపన్లైనా పంపవచ్చును కాని తెల్ల కాగితం మీద వ్రాసిన కూపన్లు ల్లవు పత్రికలో కూపన్నే నింపి పంపాలి– ఒకరికి ఒకసారికి ఒక బహుమతి ంటే ఎక్కువ రాదు

–సం

### సరైన జవాబులు పంపిన వారి పేర్లు

యల్లా శ్రీ శ్రీ (గిద్దలూరు), టి. జగన్మోహనరావు (విజయవాడ), బి. పుష్పరాణి (నంద్యాల), పి. శీతా-ౕమ్ (కోరుకొండ), పి.వి. రామనాథ్ (గుంటూరు).

### సరియైన జవాబులు

**నిలువు**

1 ఉసిరి
2 లంఘనం
3 కృపుడు
4 ముద్గరం
5 విభీషణుడు
7 దుక్కి
9 భగీరథుడు
12 నీరు
14 బీరము
15 వరద
16 సరము
17 గోపిక

**అడ్డం**

1. ఉత్పలం
3 కృతము
5 విరి
6 నందుడు
8 రంభ
10 షట్పదము
11 పరంపర
13 డుబీ
15 వరుస
17 గోడు
18 ముగుద
19 మరక

---

సాహితీ పజిల్

గెల్చుకోండి రు.200/-

## గళ్ల నుడి కట్టు – 14

### ఆధారాలు

**నిలువు**

1 సప్తవ్యసనాలలో ధర్మరాజు కిష్టమయినది
3 అరుద్ర-మవ్వే వేమ
4 భారత రణానికి మూలం ఈమె అవమానం
8 ఇవి వుంటేనే ఆవకాయ
9 వంశమర్యాదను కారణాలుచూచి వెదకండి
10 రాశికి ఒక అక్షరం చేరిస్తే సముద్రం
11 వ్యవహారిక భాషను తెచ్చిన పిడుగు
14 —లందు వైవాహికములందుప్రాణవిత్తమాన భంగమందు అబద్ధరమెప్పవచ్చు
15 వానా రుచిరార్థసూక్తినిధిఅదికవి
17 నాగమాత

**అడ్డం**

2 ఇకారాన్ని ఇలా అంటారు
5 దీనికిదే ప్రమాణం అని నమ్మితే ఆస్తికుడు
6 మనిషిలా, దీనికి పాదాలు-కాపీ పద్యం
7 వాదికి ముందుఅక్షరంచేర్చండిసుగంధద్రవ్యం
12 వరుణ అపి మధ్య
13 సుమతీ శతకంలో మొదటి పద్యంలో మొదటిమాట దైవం
16 తెనుగు భారతంలో మొదటి పద్యం శ్రీవాణి తరువాత
18 అన్ని జీవరాసులకు ఇది మూలం
19 ఇది శ్రేష్ఠ వాచకం
20 ప్రథమ కలశంలో ఇది పడితే సాపెంత

ఆదారాలున్నాయి నుడికట్టు గళ్లు నింపండి! ఈ కూపన్ కత్తిరించి మీ చిరునామా రాసి పంపండి! ఆల్ కరెక్ట్ సొల్యూషన్ పంపినవారికి రు 200/– లు బహుమతి లభిస్తుంది– ఒకరికన్నా ఎక్కువమంది కరెక్టు అన్సర్లు పంపితే వారికి బహుమతి మొత్తం పంచడం జరుగుతుంది తుది నిర్ణయం సంపాదకునిదే!

–సం

## గడువు తేదీ : 12-7-'89

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ■ | 1 | ■ | 2 | 3 | | ■ | 4 | ■ |
| 5 | | | ■ | | ■ | 6 | | |
| ■ | | ■ | 7 | | | ■ | | ■ |
| 8 | ■ | 9 | ■ | | ■ | 10 | ■ | 11 |
| 1 | | | | ■ | 13 | | | |
| | ■ | | ■ | 14 | ■ | | ■ | |
| ■ | 15 | ■ | 16 | | | ■ | 17 | ■ |
| 18 | | | ■ | | ■ | 19 | | |
| ■ | | ■ | 20 | | | ■ | | ■ |

కూర్పు పింగళి వి కృష్ణారావు

**ఆంధ్రసచిత్రవారపత్రిక**

పంపిన వారిపేరు ......

పూర్తి చిరునామా ......

......

...... పిన్కోడ్: ...

## పాంచాలి

తెలుగు పత్రికారంగంలో విశిష్టస్థానమును సంపాదించుకున్నది ఆంధ్రసచిత్రవారపత్రిక శ్రీ ప్రయాగ రామకృష్ణ గారి కలం నుండి జాలువారుచున్న ఆణి ముత్యాల్లాంటి మాటలతో ద్రౌపది ధారావాహిక కధలు మన పత్రికలో ప్రచురించటం ఆనందదాయకం మహాభారత్ చరిత్రలో మహాసాధ్వీమణి ద్రౌపదికిగల విశిష్టస్థానాన్ని శ్రీ ప్రయాగ చక్కగా మాకందరికి అందించడం నాబోటి వయో వృద్ధుడుకేగాక పామర పండితులకు, బాలుర కు ఎంతో ఉపయోగముగ యున్నదనుటలో విస్సందేహం మహాభారతములోని ఇతర పాత్రల విశిష్టతనుకూడ కథారూపంలో అందించిన బాగుండునని నా ఉద్దేశ్యం

-పాలపర్తి కోనయ్యశర్మ, పండరీపురం

## ద్రౌపది

విజ్ఞానాన్ని, మానసిక ఆనందాన్ని సామాజిక చైతన్యాన్ని కలిగించేట్టు ఆంధ్రపత్రికను తీర్చిదిద్దుతున్నారు కవి, రచయిత, ఆకాశవాణి ప్రయోక్త అయిన శ్రీ ప్రయాగ రామకృష్ణ గారి కలం నుండి జాలువారుచున్న ముత్యాల్లాంటి మాటలు, ద్రౌపది యొక్క పాత్ర వైశిష్ట్యాన్ని అందరికి చాటి చెప్పటం ఎంతైనా అభినందనీయం నేటి యువతరం, ముఖ్యంగా మహిళాలోకం, ప్రతి గృహిణి మహాసాధ్వీమణి ద్రౌపదియొక్క ప్రాముఖ్యతను చదివి, తెలుసుకొని తన కుటుంబాన్ని, తద్వారా సమాజాన్ని చైతన్యవంతం చేయగలదనటంలో ఏ మాత్రము సందేహము లేదు

-సి శ్రీనివాసులు, గుంటూరు

## శ్రీ శ్రీ కి నివాళి

ఈ శతాబ్దంనాదే అని చాటి చెప్పిన మహాకవి, విప్లవకవి అయిన శ్రీ శ్రీగారి వర్ధంతి సందర్భంగా మీరు ప్రచురించిన "శ్రీ శ్రీ గురించి తెలుసుకుందామా?" అనే రచనవల్ల మాకు ఆయనగురించి ఎన్నో విషయాలు తెల్పినవి దాన్ని మేము కత్తిరించి పదిలంగా వుంచుకున్నాము ఈ వివరాలన్ని సేకరించి మా కందించిన శ్రీ చెన్నాప్రగడ సత్యనారాయణ శర్మగారికి, ఎడిటర్ గారికి మా అభినందనలు, అలాగే మీరు సాహిత్యానికి ప్రాధాన్యమిచ్చి ఆయా రంగాలలోని ప్రముఖుల వర్ధంతులు, జయంతులకు చక్కటి వ్యాసాలను అందించి ఆంధ్రపత్రిక ఘనతను కాపాడాలి!

-సుమతీ మనోహర్ (గుణదల)




# వీక్లీ పోస్ట్

(5వ పేజీ తరువాయి.)

## ధూమపానం

9,16 జూన్ 89 వారపత్రికలో మీ సంపాదకీయం చదివిన తర్వాత ఈ ఉత్తరం వ్రాయాలనిపించింది పొగత్రాగేవారు తీవ్ర అనారోగ్యానికి గురి అవుతున్నారన్న ఆదుర్దాతో పొగత్రాగేవారి నుద్దేశించి మీరు చేసిన హితవులు, హెచ్చరికలు నిజంగా ఎవరినైనా కదలించి వేస్తాయి కానీ ప్రజల్లో కేవలం, మందలింపులు, హెచ్చరికలు, హితోపదేశాలతో మార్పురాదు, అందుకు తగిన కఠిన చర్యలు ప్రభుత్వం తీసుకొని తీరాలి ప్రజల క్షేమమే ప్రభుత్వ కర్తవ్యము కదా! ధూమపానము తాగేవారికే కాకుండా, ప్రక్కనున్న వారికి కూడ హాని కలుగచేసే ప్రమాద మున్నప్పుడు, ధూమపానాన్నే నిషేధించే శాసనం చేయవచ్చుకదా! లేదా సిగరెట్లు, బీడీలు వగైరాల ఉత్పత్తులకు లైసెన్సులు మంజూరు చేయకపోతే, క్రమేణా ఈ అలవాటు ప్రజల్లో లేకుండా పోతుంది కదా! ఈ సంగతి ప్రభుత్వం ఎందుకు ఆలోచన చేయదు? ఒకవైపు ఉత్పత్తికి లైసెన్సులు మంజూరుచేస్తూ, మరొకవైపు సిగరెట్లు త్రాగడం ఆరోగ్యానికి హానికరము అని హెచ్చరికలు చేస్తుంటే ఈ సమస్య తీరేనా? బహుశా, ఉత్పత్తికి లైసెన్సులు మంజూరు చేసినందున, ప్రభుత్వానికి వచ్చే రాబడి (పన్నురూపంలో) రాదని భయమేమో? ఏది ఏమైనా ప్రభుత్వానికి రాబడి రాకపోయినా, ప్రజల ఆరోగ్యక్షేమాలు కాపాడవలసిన బాధ్యత ఎంతైనావుంది మీ సంపాదకీయం చదివితే, పొగత్రాగేవారు మనసు మార్చుకోక మానరు

-పి ప్రశాంతి, కడప

## పొరపాటు

2-6 సంచికలో "ఫాల్కే అవార్డు గ్రహీతలు" కాలమ్ పేరిట ప్రచురితమైన శీర్షికలో "సులోచన" (నటి) 1973లో అవార్డు పొందినట్లు, "పంకజ్ మల్లిక్" (నటుడు-సంగీత కారుడు) 1974లో పొందినట్లుగా ప్రచురించారు

కాని అది పొరపాటు!!

"పంకజ్ మల్లిక్" గారే 1973లో దాదాసాహెబ్ ఫాల్కే అవార్డు నందుకున్నారు

నటి అయిన "రూబీ మేయర్స్ సులోచన" ఆ తర్వాతి సంవత్సరం అంటే 19[illegible] అవార్డు అందుకున్నారు

పాఠక ప్రపంచంలో ఝ[illegible] "శృంగారతల్పం" "విశృబ్ద యు[illegible] సృష్టించి- విశిష్టతను సం[illegible] రచయిత-శ్రీ శాతవాహన గా[illegible] ప్రారంభంలోనే ఆకట్టుకుంది నిజం లంటే వజ్ర సంకల్పం-దీటుదేలిన వజ్రంలా, అపురూపఅపూర్వ రత్నదీపికలా వుంది!

సరికొత్త వృత్తాన్ని పాఠకలోకానికి పరిచయం చేస్తూ, మరొకసారి తన ప్రత్యేక బాణిని-స్పష్టీకరించుకుంటున్న శ్రీ శాతవాహన ధన్యవాదాలు

ముఖ్యంగా సీరియల్‌లో జైలర్ పాత్ర- వ్యక్తిత్వం, అతని మనిశిల- ఆదిలోనే "హిప్నాటైజ్"కు గురి చేసాయ్. అదే సంచికలో "శ్రీ శ్రీ" కథ విందామా' వ్యాసం-చాలా బాగున్నది సేకరణ కర్తకు నా కృతజ్ఞతా పరంపర

-కె శేషు, జహీర్‌పురా,ఖమ్మం

## ఉదర వ్యాధులు

23-6-89 సంచికలో ఉదర వ్యాధులపై యింటర్వ్యూ యిచ్చిన ప్రముఖ వైద్యు పేరు డా. కామినేని పట్టాభిరామయ్య ●

Editorial Adviser *S RADHAKRISHNA*, Editor *VEERAJI*,
Printed and Published by *S NAGESWARARAO* for Nageswara Rao Estates Ltd.,
at the Andhra Patrika Press, Gandhi Nagar, Vijayawada-520003
Phones Editorial 75667, Business 61247, 61248